## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071370

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కావ్యపరిమళము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ




ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ :: సైఫాబాద్,
హైదరాబాద్ - 4.

# అంకితము

## డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారికి

సీ॥ సంప్రదాయపు టూహా సరణి యీలాటిది
భావుకత్వపు రమ్య ఫక్కి యిద్ది
ఆనందసౌధ సోపానమ్ము [illegible]
భావనా లక్షణ ఫణితి యిద్ది
ఆది పురాణేతిహాసత్రయీ త్రయీ
శిఖలు తీర్చిన యట్టి చెలువమిట్లు
జని యెత్తు దానికిఁ జారితార్థ్యంబిద్ది
తెలుగువాఁడైనట్టి తెలివి యిట్లు

భావములు వందగాఁబుట్టవచ్చుఁ బుట్టి
మొదలు పాముండవలయుఁ గ్రొచ్చుదురు లేక
చీమలు చరించు నంచు దాక్షిణ్యమున్న
అడవి గోడలు పాలికలనుచు లేక.

శా॥ నీకున్ మెత్తనయైన గుండెపొరలో నిష్పాక్షికత్వంబనన్
గైకొందే యొకదారినో పెఱల జోకన్ (శ్రీ) పరీపాకరే
ఖాకావ్యంబుల దీక్షపూనవును స్వర్గంబంతలో నింతలోఁ
జేకోనిప్పుడు గోకికో సుఖము తెచ్చేంబో చిరంటీసుధల్.

శా॥ కొంకుల్ మాలిన సంఘపున్ మురికిపల్కుల్ చెట్టదుర్నీతి కా
వ్యాంకంబై యదియొక్క చిత్రణము వహ్వా ఖూముతౌనా ! రసా
లంకారధ్వని కల్పనా బహుళ హేలాశయ్యలే కావ్యమా !
కొంకుల్ విర్గినకుంటులా! బహుపరాకుల్ నీకు వాచించెదన్.

విశ్వనాథ సత్యనారాయణ

# విషయసూచిక

# మనుచరిత్రము

అంకముఁజేరి శైలతనయాస్తనదుగ్ధములానువేళ బా
ల్యాంక విచేష్ట తొండమున నవ్వలిచన్గబళింపఁబోయి యా
వంక కుచంబుఁగాన కహివల్లభహారముగాంచి వే మృణా
ళాంకుర శంకనంటెడి గజాస్యునిఁగొల్తు నభీష్టసిద్ధికై.

ఇది విఘ్నేశ్వర ప్రార్థన. ఇది మనుచరిత్రములోనిది. మనుచరిత్రము వ్రాసినది అల్లసాని పెద్దన. ఈ గ్రంథము శ్రీ కృష్ణదేవరాయల వారికి నంకిత మీయబడినది.

పెద్దన్నగారికి ఆంధ్ర కవితాపితామహుడని బిరుదు. పెద్దన్నకంటె పూర్వులు తెలుగులో చాలమంది కలరు. కవిత్రయము, నాచన సోమన్న, శ్రీనాథుడు, పోతన్న మొదలైన మహానుభావులు చాలామంది కలరు. కవిత్రయములో నొకడైన ఎఱ్ఱాప్రగ్గడకు ప్రబంధ పరమేశ్వరుఁడన్న బిరుదు కలదు. ఇట్టి విషయములో పెద్దన్నగారికి ఆంధ్ర కవితాపితామహు డన్న బిరుద మెట్లు వచ్చినదో, ఎట్లు చెల్లుఁబడియైనదో, విచారించ వలసిన విషయము.

శ్రీకృష్ణ దేవరాయలు చక్రవర్తిగనుక తన కభిమానుడైన కవికి ఈ బిరుదమునిచ్చెనా ?

లౌకికములైన కారణములు పొసగవు. విప్రతిపత్తు లెన్నియైన చెప్ప వచ్చును.

ఒక భాషయున్నచో నా భాష గొప్పసారస్వతము కలదియైనచో నా సారస్వతము వృద్ధిపొందెడి లక్షణములలో కొన్ని దశలుండును. ప్రథమదశ పురాణదశ. ద్వితీయదశ కావ్యదశ. కవిత్రయము, నాచనసోమన్న, మాదన్న, పోతన్న మొదలైన వారిది పురాణదశ. శ్రీనాథుడు పురాణ

దశకు చివరివాడు. కాని, యాయన వ్రాసిన శృంగార నైషధము దాని యంతటనది కావ్యము. అది యనువాదము కాని స్వతంత్ర గ్రంథముకాదు.

ఇట్లుండగా అల్లసాని పెద్దన్న ఆంధ్రభాషలో తొట్టతొలుత స్వతంత్ర కావ్యమును వ్రాసినవాడుగా కనిపించును.

మనుచరిత్ర మనువాదము కాదు. ఆంధ్రీకరణముకాదు. మార్కండేయ పురాణములోని యొక కథ తీసికొని దానిని స్వతంత్ర కావ్యముగా నిర్మించినాడు.

ఈ గ్రంథముపేరు " స్వారోచిష మనుసంభవము "; కాని " మను చరిత్రము"ని యలవాటైనది. ఆ పేరే చెల్లుబడి యగుచున్నది. నిజానికీ గ్రంథముపేరు స్వారోచిష మనుసంభవము. నేను రచించిన 'అల్లసానివాని యల్లిక జిగి బిగి" యన్న విమర్శ గ్రంథము చదివినచో స్వారోచిష మను సంభవమన్న పేరిగ్రంథమున కెట్లన్వర్థమో తెలియగలదు.

ఒక మహా విషయమును స్థాపించుటకొరకు తొట్టతొలుత వ్రాయ బడిన కావ్యమిదియే యని చెప్పవచ్చును. అందులో స్వతంత్రముగా కథా నిర్మాణముచేసి కథాంశములను తానే సమకూర్చుకొని చేయబడిన మొదటి గ్రంథ మాంధ్రసారస్వతములో నిదియే !

మరియు ప్రధానమైనది ఇంకొక విషయముకలదు. కవులందఱకు తలాయొక శైలియు నుండును. పురాణకవుల శైలులు పురాణ కవులవి. కావ్యకవుల శైలులు కావ్యకవులవి. ఆరెండు శైలులకు పెద్దభేదముండును.

పురాణకవులు ప్రధానముగా కథను చెప్పికొని పోవుటమీద దృష్టి నిలుపుదురు. కావ్యకవులు వర్ణనమీద దృష్టిని నిలుపుదురు. పురాణకవులు పద్యరచన చక్కగా చేయవలయునన్న ప్రయత్నము నెక్కువ చేయరు. కావ్యకవు లాప్రయత్నమును మిక్కిలిగా జేయుదురు. పురాణకవులు వ్రాయుచుండగా దాని సందర్భమునుబట్టి యొక మంచిరచనగల పద్యము రావచ్చును. కావ్యకవులలో నట్టిప్రయత్న మధికము, నట్టిపద్యముల సంఖ్య యెక్కువ.

పురాణములు చదువుచున్నప్పుడు పాఠకుని బుద్ధి కథా గమనము భిన్నాంశములు మొదలైనవానిమీద నుండును. కావ్యములు చదువునప్పటి పాఠకునిబుద్ధి ప్రతి పద్యగత చమత్కారము ప్రతి పద్యమునందు చేయబడిన సూక్ష్మకల్పన, పద్యరచనా సౌందర్యము—వీని మీదనుండును.

వారిని వీరిని పోల్చిచూడకూడదు. సామాన్య సంసారములున్నవి. సంపన్నమైన సంసారములు కలవు రెండు సంసారములకు ప్రాధాన్యము బ్రతుకుటయే. సామాన్య సంసారములో నతిథులు వచ్చినచో చాపవేసి కూర్చుండబెట్టుదురు. మర్యాదచేసి మాటాడి పంపింతురు. గొప్ప సంపత్తుకల సంసారములో నతిథులురాగా పరుపులు, తివాసీలు, పట్టు దుప్పటులతో కుట్ట బడిన యాసనములు, వీవనలు, అగరువత్తులు— ఈ మొదలయిన భోగము లుండును. పురాణ కవులకు కావ్యకవులకు భేదమిది.

మరియు తొలుతటి రాజులువేఱు. తరువాత వచ్చిన రాజులువేఱు. శ్రీకృష్ణరాయల నాటికి నాంధ్రసామ్రాజ్య మేర్పడినది. విజయనగర సామ్రాజ్యము స్థిరపడినది. విజయనగరము నాటి ప్రపంచకములలో నొక మహానగరము. అనంతమైన యొకభోగభూమి. భోగములలో సూక్ష్మవిష యముల ననుభవించుటకు వలసిన సంపత్తి కలదు. పాలు త్రావినచో వట్టి వెండిగిన్నెలో త్రాగరు. పైడిగిన్నెగాని, వజ్రపు గిన్నెగాని కావలెను. ఆ గిన్నెచుట్టు నది పట్టుకొనుపిడి శిల్పములచేత నిండియుండును. ఇదియొక భోగలక్షణము. ఈ భోగలక్షణము ఆనాటి సర్వశిల్ప విద్యలయందును భాసించెను. అదియే కవిత్వములోనికిని వచ్చెను.

అందుచేత పెద్దన్నగారి పద్యరచన మాధుర్య గుణములకు నిధాన మయ్యెను. క్రొత్త క్రొత్త పలుకుబళ్ళకు, రమ్యమైన సమాస గ్రథనమునకు కాణయాచి యయ్యెను.

పరమేశ్వరుడు పరమ మధుర సరస్వతీ రూపముగా చిక్కని శారదా రూపముగా పెద్దన్నగారి వాక్కునందు వచ్చికూర్చుండెను.

పెద్దన్నవలె చక్కని మధురమైన పద్యరచన చేయగల కవి యాంధ్ర సారస్వతమున మఱియొకడుండడు.

మన సారస్వతములోనున్న మహా కవులందఱి విషయములో వారి వారి శైలి వారి వారి ప్రత్యేకత అని చెప్పవచ్చును. కాని పెద్దన్నగారి విషయములో నీప్రత్యేకత యందొక వైలక్షణ్యమున్నది. ఆ విజయనగర సామ్రాజ్య సూక్ష్మభోగ పరమ మాధుర్యలక్షణ మాశైలియందున్నది. ఇది యనుభవైక వేద్యము.

శ్రీనాథుడు దీనికి మార్గదర్శిగా కనిపించును. కాని యీ లక్షణము శ్రీనాథునియందు పరాకాష్ఠ పొందలేదు. పెద్దన్నగారియందు పొందినది. అందుచేత నతడాంధ్ర కవితాపితామహుడు. పితామహుడనగా తాతకాదు బ్రహ్మ.

బ్రహ్మకు పూర్వము సృష్టిలేదా? బ్రహ్మనెవరు సృష్టించినారు? ఈ దృశ్యమానమగుచున్న సృష్టిని బ్రహ్మ చేసినాడు. ఆ రీతిగా నాంధ్ర భాషయందు ప్రథమ ప్రబంధనిర్మాత, ప్రబంధ సర్వలక్షణములు కలిగిన గ్రంథ నిర్మాత యాయనయని యర్థము.

ఆంధ్ర సారస్వతమున కదియొక క్రొత్తభోగము. ఆ భోగము నారంభించినది యాయన.

అంకము, జేరి— తొడనెక్కి, తల్లి తీసి తొడమీద నెక్కించు కొన లేదు. ఇతడే యెక్కినాడు.

శైల తనయా స్తన దుగ్ధములు — తల్లియైన పార్వతియొక్క చనుబాలు. ఆమె కొండకూతురు. ఆమెయందు స్తన్యసమృద్ధి యెంతయుండునో తెలియదు.

బాల్యాంక విచేష్టన్ — బాల్యమునకు చిహ్నమైన విశేషమైన చేష్టతో; శైశవముకాదు బాల్యము. అనగా మకురుపాలు తాగుచున్నాడు కాబోలు!

తొండమున నవ్వలిచన్గబళింప బోయి — పిల్లలు పాలుద్రావుచు విడిగానున్న చేతితో తల్లియొక్క రెండవ బొమ్మను స్పృశించుదురు. పుణుకుదురు. ఈ చేష్టసరియే! ఈ విఘ్నేశ్వరుడు తల్లియొక్క అవ్వలి చన్ను తొండముతో గ్రహించబోవుచున్నాడు. తనకు చేయి యున్నది

కదా! ఇది బాలార్యాంక విచేష్ట కాదు. ఏనుగు మొగము కలిగి యున్నవాని లక్షణము.

అవ్వలిచన్గబళింపఁబోయి — కబళించుట యనగా తినుట. కబళము — ముద్ద; మాధవ కబళము — చన్నును కబళింపబోవుట యేమిటి—సరే!

ఆవంక కుచంబుగాన కహివల్లభ హారము గాంచి— వెదకినాడు కుచము కనిపించలేదు. హారముగానున్న పాము కనిపించెను. అహివల్లభుడే హారము. దానిని చూచినాడు. చూచినాడనగా తెలిసికొన్నాడని యర్థము. కాంచి యనగూడదు. అతడది యహివల్లభ హారముగా తెలిసికొనలేదు, అచట నహివల్లభ హారముండుటచేత నది మృణాళాంకుర మనుకొన్నాడు. మృణాళాంకురము – తామరతూటి మొక్క.

అహివల్లభుడనగా వాసుకి. వాసుకి సర్పములకు రాజు. అతడు శివునికి భూషణము. అతనిని మృణాళాంకురమని యనుకొనుట యెట్లు? ఆ వాసుకి శరీరము మహాదీర్ఘము మహాస్థూలమై యుండవలయును.

ఇది అర్ధనారీశ్వర మూర్తియొక్క వర్ణన. ఇతడు గజాస్యుడు. ఏనుగు మొగము గలవాడు.

అభీష్టసిద్ధికై ఇతనిని కొలుచుటలో నతని యందభీష్టములు సమకూర్చు లక్షణములు లేవు. అట్టి లక్షణములు వర్ణితములు కాలేదు.

వ్యుత్పత్తిచేత గజశబ్దమున కర్థము మదముకలదియని. అనగా యథార్థ పరిశీలన చేయనిది. ఇది లోకముయొక్క స్వభావము. ఈ లోకమే ఆ విఘ్నేశ్వరుని ముఖము. ఈలోకము పట్టి భ్రాంతిమయము. తెలిసికూడ పట్టిభ్రాంతి

చనిపోవుదుమని యెవరికి తెలియదు? లోకముయొక్క ప్రవర్తనకు ఈ తెలియుటకు నేమి సంబంధము. ఇదిభ్రాంతి. అర్ధనారీశ్వరుడనగా లోకముయొక్క మహాతత్త్వము పుంజీభూతమై దేవతారూపము కట్టినవాడు.

పార్వతి, దుర్గ, ప్రకృతి, పంచభూతముల సమాహారము. పరమేశ్వరుడు ఈ పంచభూతముల యందభివ్యాప్తమైయున్న చైతన్యము. ముఖ్యప్రాణము. విజ్ఞానమయ బ్రహ్మ మొదలైనవి కావచ్చును.

వారికి ముఖము మదముతో నిండిన కొడుకు పుట్టినాడు మద మును మినహాయించినచో వీడు పరమ చైతన్యస్వరూపము, అతనినిగూడ మనము దేవతగా కన్పించి - మనమదము మనకు తగ్గరాదు, మన పనులు మనకు కావలయును—అట్టి విఘ్నేశ్వరుని స్తోత్రము చేయుచున్నాము.

కావ్యకవులు సామాన్యముగా వేదాంతార్థముల నుద్దేశించి వ్రాయరు. వారికి కావలసినది వాక్చమత్కృతి, పాఠకుని మనస్సునకు చక్కిలిగింత పెట్టుట, లోకములోనున్న లీలలు చిత్రించుట, మరియు లోనికిపోయి చూడరాదు.

ఈ కావ్యకవుల యూహాలో కవితయనగా చల్లని గాలితగిలినట్లు, వెన్నెలలో విహరించినట్లు, పచ్చ కర్పూరపుపొడి చల్లుకున్నట్లు—అంతే.

## మను చరిత్రము

వరణానదియని యొక నదియున్నది, కాశికి వారణాసి యనిపేరు. వరణానది - అసీనది అన్న రెండు నదులకు మధ్యనుండుట వలన వారణాసి యన్న పేరు వచ్చినదందురు. ఈ వరణానది యొడ్డున యరుణాస్పదమన్న పురమున్నది.

అచటి విప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి
 ముదిమదితప్పిన మొదటివేల్పు
అచటి రాజులు బంటునంపి భార్గవునైన
 బింకాన పిలిపింతు రంకమునకు
అచటిమేటి కిరాటు లలకాధిపతినైన
 మును సంచిమొదలిచ్చి మనుప దక్షు
లచటి నాలవజాతి హాలముఖాత్తవిభూతి
 నాదిభిక్షువు భైక్ష్యమైనమాన్చు

అచటి వెలయాండ్రు రంభాదులైన నౌరయ
కాసె కొంగునవారించి కడపగలరు
నాట్యరేఖా కళాధురంధర నిరూఢి
నచటపుట్టిన చిగురుకొమ్మైన చేవ.

[మొదటివేల్పు బ్రహ్మ; బింకానన్ - పట్టుదలతో, అంకమునకు - సమీపమునకు, మేటికిరాటులు - గొప్పవైశ్యులు, వర్తకులు. అలకాధిపతి - కుబేరుడు (ఆయనవద్ద నవనిధులున్నవట) నాలవజాతి - శూద్రులు, కృషికులు, హాలముఖాత్తవిభూతి - నాగటి కొర్రునుండివచ్చిన సంపదతో ఆదిభిక్షువు - శివుడు, భైక్ష్యము - బిచ్చపుదనము. వెలయాండ్రు - వారకాంతలు. ఒరయన్ - స్పర్ధవహించినచో, కానెకొంగు - వెనుకకుఁదోపికొను చీరచివర, నాట్యరేఖ అను కళావిద్యయందుకల ధురంధర - అధికమైన, నిరూఢిన్ - సామర్థ్యముతో.]

చిగురుకొమ్మ - శ్రీకృష్ణదేవరాయల వారు విజయనగరమునుండి పాలించుచు ప్రధానముగా పెనుగొండ యందుండెడివారు. పెనుగొండలో కోటయున్నది ఈ కొండమీద చిగురుచెట్లని కొన్నికలవు. ఆ చెట్టుపేరు చిగురుచెట్టు, అచెట్టు చాలా పెళుసు. మునగచెట్టువంటిదె. చిగురుకొమ్మ యనగా లేతకొమ్మయని యర్థంకాదు. అచటి చిగురుచెట్టయొకను మంచిచేవ గలది. విఱిచినచో విఱుగదని యర్థము. పెద్దన్నగారు పెనుగొండలోని తానెఱిగిన యీచెట్టును అరుణాస్పదములో నున్నట్లు వర్ణించెను.

మనపూర్వ ప్రబంధములలో నేకావ్యము చూచినను ఈ రీతిగా వర్ణనములు వర్ణింపబడును. వారకాంతలు వర్ణింపబడుదురు. ఆనాటి నాగరికతయు సంపత్వ్యవస్థయు నాలుగు వర్ణములమీదను నాధారపడి యుండెడిది. రాజ్యములయొక్క రక్షణ దుర్గములమీద నాధారపడి యుండెడిది. అందుచేత నగడ్తలు ప్రాకారములుకూడ వర్ణింపబడును, మరియు నానాటి శిల్పములలో భరతనాట్యము ప్రధానమైనది. దేవాలయములలో వారకాంతలు నాట్యము చేసెడువారు. దేవాలయములలోనున్న స్వాములకు ననేక భోగములు జరిగెడివి. నేడు తిరుపతి మొదలైన క్షేత్రములలో జరుగుటలేదా ? ఆ భోగములలో ప్రధానమైనది, వారకాంతలు చేయు నాట్యము. అందుచేతనే వారికి భోగమువారని పేరువచ్చినది. వారు భరతశాస్త్రములో చాల సమర్థులు.

ఆనాడు పూవులమ్ముటకూడ నొక గొప్పవృత్తి. పురుషులుకూడ సాయంకాలములందు పుష్పములు ధరించెడివారు. పురుషులకుఁగూడ జుట్టు

వారికి ముఖము మదముతో నిండిన కొడుకు పుట్టినాడు మదమును మినహాయించినచో వీడు పరమ చైతన్యస్వరూపము, అతనినిగూడ మనము దేవతగా కన్పించి - మనమదము మనకు తగ్గరాదు, మన పనులు మనకు కావలయును—అట్టి విఘ్నేశ్వరుని స్తోత్రము చేయుచున్నాము.

కావ్యకవులు సామాన్యముగా వేదాంతార్థముల నుద్దేశించి వ్రాయరు. వారికి కావలసినది వాక్చమత్కృతి, పాఠకుని మనస్సునకు చక్కిలిగింత పెట్టుట, లోకములోనున్న లీలలు చిత్రించుట. మరియు లోనికిపోయి చూడరాదు.

ఈ కావ్యకవుల యూహలో కవితయనగా చల్లని గాలితగిలినట్లు, వెన్నెలలో విహరించినట్లు, పచ్చ కర్పూరపుపొడి చల్లుకున్నట్లు—అంతే.

## మను చరిత్రము

వరణానదియని యొక నదియున్నది, కాశికి వారణాసి యనిపేరు. వరణానది - అసీనది అన్న రెండు నదులకు మధ్యనుండుట వలన వారణాసి యన్నపేరు వచ్చినదందురు. ఈ వరణానది యొడ్డున యరుణాస్పదమన్న పురమున్నది.

అచటి విప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి
ముదిమదితప్పిన మొదటివేల్పు
అచటి రాజులు బంటునంపి భార్గవునైన
బింకాన పిలిపింతు రంకమునకు
అచటిమేటి కిరాటు లలకాధిపతినైన
మును సంచిమొదలిచ్చి మనుప దగుదు
అచటి నాలవజాతి హాలముఖోత్థశుభాంతి
నాదిభిక్షువు భైక్ష్యమైనమాన్చు

అచటి వెలయాండ్రు రంభాదులైన నోరయ
కాసె కొంగునవారించి కడపగలరు
నాట్యరేఖా కళాధురంధర నిరూఢి
నచటపుట్టిన చిగురుకొమ్మైన చేవ.

[మొదటివేల్పు బ్రహ్మ; బింకానన్ - పట్టుదలతో, అంకమునకు - సమీపమునకు, మేటికిరాటులు - గొప్పవైశ్యులు, వర్తకులు. అలకాధిపతి - కుబేరుడు (అయనవద్ద నవనిధులున్నవట) నాలవజాతి - శూద్రులు, కృషికులు, హాలముఖాత్తవిభూతి - నాగటి కొఱ్ఱునుండివచ్చిన సంపదతో ఆదిభిక్షువు - శివుడు, భైక్ష్యము - బిచ్చపుఁదనము. వెలయాండ్రు - వారకాంతలు. ఒరయన్ - స్పర్ధవహించినచో, కాసెకొంగు - వెనుకకుఁదోపి కొను చీరచివర, నాట్యరేఖ అను కళావిద్యయందుకల ధురంధర - అధికమైన, నిరూఢిన్ - సామర్థ్యముతో. ]

చిగురుకొమ్మ - శ్రీకృష్ణదేవరాయల వారు విజయనగరమునుండి పాలించుచు ప్రధానముగా పెనుగొండ యందుండెడివారు. పెనుగొండలో కోటయున్నది ఈ కొండమీద చిగురుచెట్లని కొన్నికలవు. ఆ చెట్టుపేరు చిగురుచెట్టు, ఆచెట్టు చాలాపెళుసు. ములగచెట్టువంటిది. చిగురుకొమ్మ యనగా లేతకొమ్మయని యర్థంకాదు. అచటి చిగురుచెట్ల యొక్క ముదివేవ గలది. విఱిచినచో విఱుగదని యర్థము. పెద్దన్నగారు పెనుగొండలోని తానెఱిగిన యీచెట్లును అనుభవాస్పదములో నున్నట్లు వర్ణించెను.

మనపూర్వ ప్రబంధములలో నేకావ్యము చూచినను ఈ రీతిగా వర్ణనములు వర్ణింపబడును. వారకాంతలు వర్ణింపబడుదురు. ఆనాటి నాగరికతయు సంపత్వ్యవస్థయు నాలుగు వర్గములమీదను నాధారపడి యుండెడిది. రాజ్యములయొక్క రక్షణ దుర్గములమీద నాధారపడి యుండెడిది. అందుచేత నగడ్తలు ప్రాకారములుకూడ వర్ణింపబడును, మరియు నానాటి శిల్పములలో భరతనాట్యము ప్రధానమైనది. దేవాలయములలో వారకాంతలు నాట్యము చేసెడువారు. దేవాలయములలోనున్న స్వాములకు ననేక భోగములు జరిగెడివి. నేడు తిరుపతి మొదలైన క్షేత్రములలో జరుగుటలేదా ? ఆ భోగములలో ప్రధానమైనది, వారకాంతలు చేయు నాట్యము. అందుచేతనే వారికి భోగమువారని పేరువచ్చినది. వారు భరతశాస్త్రములో చాల సమర్థులు.

ఆనాడు పూవులమ్ముటకూడ నొక గొప్పవృత్తి. పురుషులుకూడ సాయంకాలములందు పుష్పములు ధరించెడివారు. పురుషులకుఁగూడ జుట్టు

ముళ్లు, గిరజాలు–వానికి పూవులు పెట్టుకొనుట యిదియొక భోగము. కనుక మన పూర్వ కావ్యములలో నీ వర్ణనలు చేయబడినవనగా–కావ్యము జీవితమునకు ప్రతిబింబమని యాధునికు లనుచున్నారుకదా – ఆనాటి సంప్రదాయమున కీకావ్యములు ప్రతిబింబములు.

ఇది యిట్లుండగా నీకథలో ప్రారంభించుచు పెద్దన వెలయాండ్రను వర్ణించెను. ఆయూరి వెలయాండ్రు, మహాభరతశాస్త్ర కళానిష్ణాతలు. ఎందుకు చేసెననగా నొకటి జీవిత ప్రతిబింబము. రెండవది యీ కావ్యములో కథానాయకుడు ప్రవరాఖ్యుడు. అతనికి హిమాలయ పర్వతముమీద వరూధినియన్న యప్సరస కన్పించును. ఆమె దేవతా వారకాంత. వారకాంతలు, వారి హేలలు, వారి యొయ్యారములు, వారి సౌందర్యములు ప్రవరాఖ్యునకు క్రొత్తలుకావు. ఈసంగతిని సూచించుటకుగూడ వ్రాసెను.

ఆ వూరిలో ప్రవరాఖ్యుడన్న బ్రాహ్మణ యువకుడు కలడు. అతడు పండితుడు. యజ్ఞములు చేసినవాడు. చాలా యందగాడు. పలుమందికి వేదమును నేర్పెడివాడు. మరియు వైరాగ్యవంతుడు. అందుచేత వానిని పరస్త్రీలు కోరినను లాభములేదు. ఈ మాటకూడ భవిష్యత్కథకు సూచనగానే చెప్పఁబడెను.

అతనికి తల్లిదండ్రులుఁ గలరు. అతడు ప్రొద్దుననే లేచి వరణానదిలో స్నానముచేసి వచ్చి తన నిత్యకర్మానుష్ఠానము చేసికొనును. ఎవరు దానము చేయ వచ్చినను స్వీకరింపడు. అతడు అప్రతిగ్రహీత. ఎవరైన దానము చేసినచో దానము చేసినవాని పాపము కొంత ప్రతిగ్రహీతకు వచ్చును. దానము పుచ్చుకొన్న బ్రాహ్మణుడు తత్ప్రాయశ్చిత్తము కొఱకు తగినంత గాయత్రీ మంత్రమును జపించవలెను. రాజు లితనికి సాలగ్రామము నిత్తుమందురు. సాలగ్రామము, బాణము, నివి రెండు రాళ్లు. సాలగ్రామమునందు విష్ణుమూర్తి యుండును. బాణములు, శివలింగములు, ఏది బాణమో ! ఏది సాలగ్రామమో ! తెలిసికొనుట ఆ విద్యయందు పండితులైన వారికే సాధ్యము. అతడు సాలగ్రామమును గూడ దానము పుచ్చుకొనడు.

అతనికి భార్య కలదు. ఆమె అన్నపూర్ణవంటిది. అతిథులు నడికిరేయి వచ్చినను భోజనము పెట్టును. (నడికిరేయియనగా నర్థరాత్రమని యర్థము) నడిరేయి నడురేయి సామాన్యరూపములు. నడికిరేయి విశేషరూపము.)

ఇతనికి తీర్థయాత్రలు చేయవలెనన్నచో మిక్కిలి యిష్టము. తీర్థ సంవాసు లేతెంచినచో నాదరించి భోజనముపెట్టి దూరములడుగును. ఎంతో యాదరించును.

ఇట్లుండగా నొకనాడు కుతపకాలము (కుతపకాలమనగా మధ్యాహ్నము దాటిన కాలము) నందు ఒక ఔషధసిద్ధుడు వచ్చెను. ప్రవరు డతనికి మర్యాదచేసెను. అతని నెంతయో గౌరవించెను.

మీ మాటలు మంత్రమ్ములు
మీ మెట్టినయెడ ప్రయాగ, మీ పాదపవి
త్రామలతోయము లలఘు
ద్యోమార్గ ఝరాంబు పౌనరుక్త్యము లుర్విన్.

మనదేశములో నతిథులను గౌరవించుట అతిథుల కన్నముపెట్టుట మన మతములో ప్రధానమైన భాగము, దానముచేయుట మిక్కిలి గొప్ప విషయము. శ్రీ శంకరాచార్యులవారు భాష్యములో నొకచోట దానేన ఉపనమంతేయని వ్రాసినారు. దానముచేత ప్రాణులు ఉప – సమీపమునందు, ఎవరి సమీపమందు? పరమేశ్వరుని సమీపమునందు, నమంతే–వంగుచున్నారు. సదా నమస్కరించుచున్నారు. అనగా దానముచేత జీవులు పరమేశ్వర సన్నిధానమునందు వర్తిల్లుదురని యర్థము. అతిథి పూజకూడ ఇట్టిది. 'అభ్యాగతస్స్వయం విష్ణుః' అభ్యాగతుడనగా అతిథి. అతడు స్వయముగా విష్ణువు. అందుచేతనే మీ పాద పవిత్రామలతోయములు – మీ పాదములు కడుగగా వచ్చిన స్వచ్ఛమైన నీరు; అలఘు–తక్కువకాని, ద్యోమార్గజలము – ఆకాశ గంగ మందాకిని లేదా భాగీరథి; (ఆకాశమునందలి గంగ మందాకిని. భూలోకమునందలిది భాగీరథి. పాతాళలోకము నందలిది భోగవతి) ఆ గంగ యొక్క అంబు — నీళ్ళకు, (ఆయన పాదములు కడిగిన నీరు) పౌనరుక్త్యములు – పునరుక్తియనగా చెప్పినమాటయెచెప్పుట, దానిమీద తద్ధితరూపము

పౌనరుక్త్యము-అర్థ మొకటియే. గంగ విష్ణుపాదోద్భవి గనుక అభ్యాగతుడు స్వయంవిష్ణువు కనుక నిట్లనుట.

ప్రవరాఖ్యు డిక్లెంతయో పొగడగా ఆ యౌషధసిద్ధుడు గృహస్థ ధర్మమును పొగడెను.

> కెలకులనున్న తంగేటి జున్ను గృహమేధి
> యజమానుఁ డంకస్థితార్థపేటి
> పండిన పెరటి కల్పము వాస్తవ్యుండు
> దొడ్డిఁబెట్టిన వేల్పుగిడ్డి కాపు
> కడలేని యమృతంపు నడబావి సంసారి
> సవిధమేరు నగంబు భవన భర్త
> మరుదేశ పథ మధ్యమ ప్రప కులపతి
> యాఁకటి కొదవు సస్యము కుటుంబి
>
> బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
> జటిపరివ్రాజ కాతిథి క్షపణ కావ
> ధూత కాపా ద్యనాథులకుఁ గాన
> భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె

గృహస్థెట్టివాడనగా ఇట్టి యిట్టి వాడు; గృహమేధి, యజమానుడు, వాస్తవ్యుడు, కాపు, సంసారి; భవనభర్త, కులపతి, కుటుంబి, యివి యన్నియు గృహస్థునకు పేర్లు.

కెలకు — ప్రక్క; (కెలను — కెలకు ఈ రెండు రూపములు కలవు. కొలను — కొలకు చెఱువని యర్థము) — తంగేటిజున్ను — తంగేటిచెట్టునకు పట్టిన తేనెపట్టువంటిది. తంగేటిచెట్టు పరమౌషధము. తంగేటిచెట్టు సమూలముగా పెఱికితెచ్చి యెండపెట్టి పొడిచేసి దానిని పంచదారతోనో తేనెతోనో నలుబదిరోజులు సేవించినచో సర్వవ్యాధులు శమించును. అందుచేత తంగేటి జున్ను అనుట — అంకస్థితార్థపేటి — అంక — ఒడియందు; స్థిత — ఉన్న; అర్థపేటి — డబ్బుగల పెట్టె; (హస్తామలకము అందురు. చేతిలోనున్న యుసిరికాయ యని యర్థము) అట్టిది. వేల్పుగిడ్డి — కామధేనువు; నడబావి — దిగుడుబావి (నడచి వెళ్ళుటకు వీలైన బావియని యర్థము. కాని నడపీను గు

నడచుచున్న పీనుగనియర్థము. నడదివ్వియ — నటచుచున్న దివిటీ. (నడదివ్వియలు చేసె నగరికి మాణిక్యమకుటముల్ గలిగిన మనుజపతుల—అని తిక్కనగారు విరాటరాజుతో తాము పాండవులమని చెప్పికొనప్పుడు ధర్మరాజును గూర్చి చెప్పిన పద్యములోనిది.)

సవిధ మేరునగంబు — సమీపమునందున్న మేరు పర్వతము.

మరుదేశ పథమధ్యమ ప్రప — మరుదేశమనగా ఎడారి. చవిటి పఱ్ఱ దేశము. పథము - మార్గము, ప్రప - చలివేంద్ర (త్రప - సిగ్గు, కృప - దయ) బధిరులు - చెవిటివారు; పంగులు - కుంటివారు; అంధులు - గ్రుడ్డివాండ్రు: జటి - జడలు కలవారు, పరివ్రాజకులు - సన్యాసులు; క్షపణకులు - బౌద్ధభిక్షులు; అవధూతలు - సన్యాసము పుచ్చుకోని పరమ విరాగులు: కాపాలికులు — ఇదియొక మతము. వారు నిత్యము కపాలములను చేబూని తిరుగుచుందురు.

ఈ పద్యము మిక్కిలి ముఖ్యమైనది—

అప్పుడు ప్రవరుడు

ఏ యే దేశములన్ జరించితిరి మీరే యే గిరుల్ చూచినా
రే యే తీర్థములందు క్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టి నా
రేయే పుణ్యవనాళిద్రిమ్మరితి రేయే తోయధుల్ డాసినా
రా యా చోటులగల్గు వింతలు మహాత్మా నా కెఱింగింపవే !

అని యడిగినాడు. గిరులు — కొండలు, తీర్థములు — పుణ్యనదులు; క్రుంకిడుట - స్నానముచేయుట; ద్రిమ్మరుట - తిరుగుట; తోయధి - సముద్రము (తోయమనగా నీరు. సంస్కృతములో నీరు అన్న యర్థముగల శబ్దములకు 'ధి' 'నిధి' రెండును కలిపినచో సముద్రమన్న యర్థము వచ్చును. తోయధి, తోయనిధి; జలధి, జలనిధి; వారిధి, వారినిధి; పయోధి,—పయోనిధి; పాథోధి పాథోనిధి; నీరధి, నీరనిధి; వార్ధి, వారినిధి; - మరియును ఈ నీటి యర్థమిచ్చు శబ్దములకు, జ, జాత, రుహ యివి కల్పినచో తామరపువ్వన్న యర్థము వచ్చును. జలజము, జలజాతము, జలరుహము. ఇట్లే — మరియు ద, వాహ యన్న యక్షరములు కలిపినచో మేఘమగును; వారిద ; వారివాహము, జలదము, జలవాహము - ఇట్లు)

ఈ పద్యములో నెక్కువ యేమియునులేదు. కాని పద్యరచన పరమ సుఖముగా నున్నది, అడుగుటలో నున్న సౌఖ్యమంతయు కనిపించుచున్నది. నోటికి వచ్చుటకు పరమ సుఖముగా నున్నది.

అప్పుడౌ షధసిద్ధు డిట్లన్నాడు.

ఓ చతురాస్య వంశకలశోదధి పూర్ణశశాంక తీర్థయా
త్రాచణ శీలినై జనపదమ్ములు పుణ్యనదీనదమ్ములున్
జూచితినందు నందుగల చోద్యములన్ గనుగొంటి నా పటీ
రాచల పశ్చిమాచల హిమాచల పూర్వదిశాచలమ్ములన్.

చతురాస్యుడు—నాలుగు మొగములు కలవాడు బ్రహ్మ; చతురాస్య వంశము - బ్రాహ్మణవంశము; అదియే, కలశోదధి - పాల సముద్రము; దానియందు పుట్టిన పూర్ణశశాంకుడు-నిండుచంద్రుడు, అని సంబోధన.

ఓ మిహిరాంశు వంశకలశోదధి పూర్ణశశాంక అని పూర్వము శ్రీనాథుడు వ్రాసినాడు. మిహిరాంశుడనగా చల్లని కిరణములు కలవాడు చంద్రుడు. శృంగార నైషధములో నలమహారాజు నొకాయన యిట్లు పిలిచినాడు.

శ్రీకృష్ణరాయల యాస్థానములో నున్న కవులు శ్రీకృష్ణరాయలతో సహా శ్రీనాథుని శబ్దములు శ్రీనాథుని పోకడలు వందలకొలది గ్రహించినారు. పెద్దన్నగారు తక్కువవాడు కాదు. కాని ఆ పిలుపుకన్న నీ పిలుపు విశేషార్థము కలది. ఇచట నౌషధసిద్ధుడు బిచ్చగానివంటివాడు. వాని బ్రతుకు గృహస్థులమీద నాధారపడియున్నది. అందుచేత నతడు గృహస్థులను పొగడును. మరియు నతడు తన గొప్పదనము తాను చెప్పికొనుచుండును. చివరి చరణములో అచలమన్న శబ్దము నాల్గుసార్లు వాడి చరణము పరుగెత్తునట్లు చేసినాడు. ఈ రచనయంతయు తనయొక్క బహుదేశ పర్యటనముయొక్క గొప్పదనము వ్యంగ్యమగుటకే. ఇది యెంత యందమైన పద్యము ! మనము సంగీతము పాడుకొనుచున్నట్లే యుండును. అని ఔషధసిద్ధుడు పెద్దవచనమును చెప్పెను. ఆ వచనములో తాను చూచిన ప్రదేశముల నన్నింటిని పెద్దపెద్ద సమాసములతో చెప్పెను, ఆ సమాసము లన్నింటియందు అతని గొప్పదనము వ్యంగ్యమగుటకే.

కాని ప్రవరుడు యాజ్ఞికుడు, కర్మశీలి, పరమసాధువు, కాని చాల గడుసువాడు. అతిథిని అగౌరవించడు. కాని యతనిమాటల నితడు నమ్మ లేదు. అందుచేత నిట్లన్నాడు :

వెఱవక మీ కొనర్తు నొక విన్నప మిట్టివి యెల్లఁజూచిరా
నెఱకలుఁ గట్టుకొన్న మఱియేండ్లును బూండ్లనుఁబట్టుఁ బ్రాయపుం
జిఱుత తనంబు మీ మొగము సెప్పక చెప్పెడు నద్దిరయ్య మా
కెఱుఁగఁ దరంబె మీ మహిమ లీర యెఱుంగుదు రేమి చెప్పుదున్.

వెఱవక—వెనుకకు దీయక; ఒక విన్నముచేయుదును; ఎఱకలు-ఱెక్కలు,

ఈ పద్యమున ఏండ్లును పూండ్లును పట్టు; మీ మొగము చెప్పక చెప్పెడు, ఈ లోకోక్తులు వాడబడినవి. గౌరవము సడలినదని యర్థము. అతనిని తన తోటివాడుగా చూచుచున్నాడని యర్థము. మీ మహిమలు మీకే తెలియును — మే మెఱుగుట సాధ్యమా ? మరి యేమి చెప్పమందురు ?

ఈ మాటలలో నొక సన్నని యాక్షేపణ, ఒక దాగియున్న లెక్కలేని తనము నున్నది.

ఆ ఔషధసిద్ధుడు పదియూండ్ల పాపరాజు. దేశదేశములు తిరిగి గడుసు తేలినవాడు. వాడు గ్రహించినాడు. వానికి ప్రవరాఖ్యు నేడిపించవలెనని పుట్టినది.

అందులకాత డేమిచేసెననగా—ఇట్లన్నాడు. 'అదికాదయ్యా ! మావద్ద నొక దివ్యౌషధమున్నది. తద్భూరి ప్రభావమ్మునన్ - దాని యధికమైన ప్రభావముచేత; పవమాన మానస తిరస్కారిత్వరాహంకృతిన్ — వాయువును మనస్సును తిరస్కరించునటువంటి గొప్ప వేగముతో; నేనెప్పుడు తిరుగుచుందును. ఇది చాల రహస్యము. ఆకాశమున సూర్యుని గుఱ్ఱము లెంత త్వరగాపోవునో భూమియందు నే నంత త్వరగా పోవుదును.' అన్నాడు. ఈ ప్రవరాఖ్యుఁడు తీర్థయాత్రలు చేయుటయందు మిక్కిలి మక్కువ కల వాఁడు గావునను ఎంత తెలివిగలవాడైనను తరుణాగ్నిహోత్రి గనుకను, అనగా కుఱ్ఱతనమగుటచేతను, చప్పున లోఁబడి "స్వామీ! నేనేదో పొరపాటు మాటాడినాను. నేను మీ శిష్యుడను నాచేత తీర్థయాత్రలు చేయింపుమని

యడిగెను. ఆ సిద్ధుడు వెంటనే యితని పాదముల కొకపసరు పూసెను. పూయుటయేమి! వెళ్లుటయేమి! ఒక్కసారియే చేసెను. ఈ ప్రవరాఖ్యు డెగురుట మొదలుపెట్టెను. ఆకాశములోనికి పోయెను. ఇదివఱకే యితఁడు పోయి హిమాలయ పర్వతములు, బదరీనారాయణము మొదలైనవిషయము లన్నియు వినియున్నాడు. ఇతని కాళ్ళక్కడికి దారితీసినవి.

"అట జని కాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానురూప పరిఫుల్ల కలాప కలాపి జాలమున్
కటక చరత్కరేణు కరకంపిత సాలము శీత శైలమున్."

అవియన్నియు దేవతాభూములు. ఇతడు భూదేవత. అందుచేత నితడు భూమి సురుడని చెప్పుట. కొంత దవ్వు దిగెను. అచ్చటినుండి చూడగా ఆకాశమును ముద్దుపెట్టుకొనుచున్న శిరస్సులు కలిగిన చెఱువులు, సెలయేళ్ళు వీనియొక్క సమూహము యొక్క మాటిమాటికి లేచుచున్న తరంగములను మద్దెళ్ళయొక్క ధ్వనులకు స్ఫుటముగా నాట్యమునకనుకూలముగా వికసించిన పించములు కలిగిన నెమళ్ళ సమూహమును చూచెను.

మరి నేలమీదికి దిగెను. ఆసానువుల (కొండప్రక్కల) యందు ఆడ యేనుగులు చెట్లను కదలించుచున్నవి. అట్టి హిమవత్పర్వతమును చూచెను.

ఈ ప్రదేశములను గూర్చి యితడు విన్నదే. ఇట్లిట్లుండునని విన్నదే! అందుచేత అతని కన్నియు పరిచితములుగా కనిపించుచుండెను.

అక్కడ రేగుచెట్లు వరుసయున్నది దానినడుమ ఒక త్రోవ యున్నది. ఆ త్రోవవెంట పూర్వము నరనారాయణులు నడచిరి. (కృష్ణుడు అర్జును డున్నూ). అత డిదియంతయు చూచెను అక్కడ అలకానది కలదు. దాని గాలులు వీచుచుండెను. అతడు చూచిన ప్రదేశములను మనము చదివి తీరవలెను

అత డెన్నో యందములు చూచెను. ఇత డెన్నియో చూడవలె నను కొనెను. అన్నిటినిచూచెను. అతడు చూచినవేవనగా :

"నిడుద పెన్నెఱిగుంపు జడగట్ట సగరు ము
మ్మనుమండు తపము గైకొనినచోట
జరఠ కచ్ఛపకులేశ్వరు వెన్ను గానరా
జగతికి మిన్నేఱు దిగినచోటు
పుచ్ఛడీకతనంబు పోఁబెట్టి గిరికన్య
పతిఁగోర్వ నాయాసపడిన చోటు
వలరాచ రాచవా రలికాతు కనువెచ్చఁ
గరఁగిన యల కనికరపుఁజోటు

తపసి యిల్లాండ్ర చెలువంబుఁ దలఁచి తలచి
మున్ను ముచ్చిచ్చును విరాళిఁ గొన్నచోటు
కనుపపులు వేల్పుఁబడవాలుఁ గన్నచోటు
హర్షమునఁ జూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన.

ఇవి యేమి స్థలములు! భగీరథుడు తపము చేసినచోటు, ఆకాశగంగ భూమికి దిగినచోటు, పార్వతీదేవి శివునికోసము తపముచేసినచోటు, శివుడు మన్మథుని దహించినచోటు, కుమారస్వామి జన్మించిన చోటు. ఆశ్చర్యముకదా! ఈ పద్యములోని మాటలెటువంటివి!

భగీరథునకు సగరుముమ్మనుమడు - భగీరథుడు సగరచక్రవర్తికి మనుమని కొడుకు. పెన్నెఱిగుంపు — పెద్దవెంట్రుకల గుంపు. అది జడ కట్టినదట!

మిన్నేఱు - ఆకాశగంగ; పైనుండి గంగానది గభేలున దూకఁగా భూమియంతయు బొత్తపడి పాతాళముదాక చొచ్చుకొనిపోయి భూమిని మోయుచున్న ఆదికూర్మముయొక్క వీపుడిప్ప కన్పించినదట: ఆ పతన మెంత వేగముకలదో చెప్పుటకు జరఠకచ్ఛపకులేశ్వరు వెన్నుకానరాన్ అని వాడినాడు. కచ్ఛపము - తాబేలు; జరఠము - ముసలిది; బాగుగా బలిసినది, యుగాలుగా కూర్చున్నది యని యర్థము. గిరికన్య — పార్వతీదేవి; ఆమె భర్తకొఱకు తపస్సుచేసినది. సేవచేసినది. ఎవరైనను మగవాండ్రు స్త్రీకోస మూరాటపడుదురు. ఈమె మగనికోస మూరాటపడెను. తపస్సుచేసెను. దీనినే కాళిదాసు కుమారసంభవములో "నరత్న మన్విష్యతి మృగ్యతేహితత్" అన్నాడు. రత్నముపోయి యెవ్వరిని వెదుకదు. దానినేపోయి యందఱును

వెదకుదురు. అట్టిపార్వతి శివుని భర్తగా సంపాదించుటకు చాల యిక్కట్టులు పడినది. స్త్రీ యట్లుచేయుటకు సిగ్గును వదలిపెట్టవలెను. పుచ్చడీకతనమనగా సిగ్గు; సిగ్గు అనుటలో గొప్ప యేమున్నది. ఆమె పరమేశ్వరి. చక్రవర్తి కూతురు. అందుకోసము వట్టి సిగ్గు అన్నమాట చాలదని పుచ్చడీకతన మన్నమాట తెచ్చినాడు. దానిని పోఁబెట్టి—వదలిపెట్టి—ఓరి, మీ నాయనగారింట్లో నున్నారా? మీయయ్య యింట్లోనున్నాడా! మీ బాబున్నాడా? మీయమ్మ మొగుడున్నాడా? మీ నాయనమ్మ కొడుకింట్లో నున్నాడా?— అన్నియు నొకటియా! కవులు వాడెడి శబ్దములలో నొకమర్యాద యొక యొడుపు నొక యొయ్యారము నుండును. పుచ్చడీకతన మట్టిమాట.

వలరాచ రాచవాఁడు — మన్మథుడు, అలి కాతుడు — శివుఁడు; కనువెచ్చన్ - కంటివెచ్చఁదనముచేత, అగ్నికాదు వట్టి సెగ. అబ్బో! అసలు అగ్ని తగిలినచో లోకములే మండిపోవును—. ఆ వెచ్చదనముచేత వాడు కఱగిపోయినాడట! కాళిదాసు బూడిద యైనాడని చెప్పినాడు. పెద్దన్నగారి మన్మథుడు కడు మెత్తనివాడు, వెన్నపూస వంటివాడు. వీడు కరిగిపోయినాడు. కాళిదాసుయొక్క మన్మథుడు కఠినుడు, వాడు ఱాయి. అందుచేత బూడిదయైనాడు. ఆస్థలమట కనికరపు స్థలమట! అయ్యో పాపమని మన మనుకొనవలయును. కావ్య కవులలోనుండెడి మార్దవ మిటువంటిది.

పూర్వ మగ్నిహోత్రుఁడు తపస్వుల భార్యలనుజూచి మోహము గొన్నాడు. అదియు నచ్చటనే చిట్టచివరకు కుమారస్వామి జన్మము చెప్పుచున్నాడు. కుమారస్వామి యెక్కడ పుట్టినాడు? ఱెల్లుగడ్డిలో పుట్టినాడు. వేల్పు పడవాలు — వేల్పులనగా దేవతలు, పడవాలనగా సేనాపతి, కనుపపులు — ఱెల్లుగడ్డి, పులు — గడ్డి. (పులుమేసి - గడ్డితిని) ఱెల్లు కనుపులుగా నుండును. చెఱకు గడకున్న కనుపులవంటివి గావు. గఱుకు గఱుకుగా నుండును. అందుచేత కనుపపులు అన్నారు.

చూడవలసిన వన్నియు చూచినాడు. చూచినవాని నన్నింటినిజూచి యాశ్చర్యపోయినాడు. ఏమి హిమవత్పర్వతము అనుకొన్నాడు. ఒక్కసారి హిమవత్పర్వతమును గుఱించి యూహించినాడు.

2.7.04

పసుపునిగ్గులు దేఱు పాఁపజన్నిద మొప్పఁ
బ్రమథాధిపతి యింటిపట్టెఱింగె
శచి కీఁత గఱపుచుఁ జదలేట సురరాజు
జలకేళి సవరించు చెలువెఱింగె
సదనుతోఁ జేఁపి చన్నవిసి యోషధుల మ
న్నొదవు కొండలకెల్లఁ బిదుకనెఱిఁగె
వేల్పుటింతులలోన విఱ్ఱవీగుచు మేన
నవరత్న రచనల రవణమెఱిఁగెఁ

బరిపరి విధంపుఁ జన్నంపు బరికరంపు
సొంపుసంపద నిఖిలనిలింపసభయు
నప్పటప్పటికిని జిహ్వాత్రుప్పుడుల్ల
నామెత లెఱింగె నీతుషారాద్రికతన.

ఈ మంచుకొండమీద నెన్ని యెన్ని చమత్కారములు జరిగినవి. శివుడిచ్చట పెండ్లియాడెను. ఇంద్రుడిచ్చట విహరించెను. ఇచ్చటనే భూదేవి పర్వతములకెల్ల నోషధులనుఁ బిదికెను. ఇచ్చటనే హిమపర్వత రాజుభార్య యైన 'మేన' దేవతా స్త్రీలందరికంటె నెక్కువ నగలు, రత్నములు ధరించి టెక్కుపోయెను.

శివుఁడిచ్చట పెండ్లియాడెననుటకు ఇంటిపట్టెఱింగెనని వ్రాసినాడు. ఇప్పటికిఁగూడ లోకములో వాడొక యింటివాడైనాడందురు. పాఁప జన్నిదము - పాము + జన్నిదము, (ముకారాంతములైన యిట్టి శబ్దముల చివరనున్న 'ము' సమాసములో 'పాఁప' యగును. రెండవ, ప కారము వెనుక నరసున్న వచ్చును. పాఁప జన్నిదము—పాము జందెము; వేముచెట్టు—వేఁపచెట్టు; నాము + చేను — నాఁపచేను.) ప్రమథాధిపతి — శివుడు.

తన భార్యయైన శచీదేవికి నింద్రుడు ఈత నేర్పినాడట !

ఇట్లు చూచిచూచి విసిగి మధ్యాహ్నము కాగా ఇవ్వాళిటికి ఇంటికి పోదము, మరల రేపువచ్చి చూతములే అనుకొన్నాడు.

(2)

అతని యమాయికత్వ మిక్కడనున్నది. తీర్థయాత్రలుపోయి సేవించ వలయునన్న యాదుర్దాలో తక్కిన విషయములు మఱచిపోయినాడు. లోక ములో చాలమంది యింతే. అన్ని విషయములందు చాల గడుసువారుగా నుందురు. ఏదో యొకానొకయాశ యుండును. దానియందు వారిని సుల భముగా మోసముచేయవచ్చును. ఔషధసిద్ధుడు దీనిని గ్రహించినాడు, తన కోపమిచ్చట తీర్చుకున్నాడు. తీరా చూచునప్పటికి కాలికి పసరుకఱిగి పోయినది. దుఃఖపడినాడు. కొంత యేడ్చినాడని చెప్పవచ్చును. చివరకిట్లను కున్నాడు :

"అకలంకౌషధ సత్త్వమున్ దెలియ మాయాద్వారకావంతి కా
శికురుక్షేత్ర గయాప్రయాగములు నే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గవ్యాఘ్ర మిమ్మంచుకొం
డకు రాఁజెల్లునె, బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్"

తా నఁట! ఈ అకలంకమైన ఔషధముయొక్క సత్త్వమును తెలిసి కొనుటకు వచ్చినాడట! ఇది యబద్ధము. లేదా దాని సత్త్వము తెలియగా వచ్చినాడనవచ్చు. ఇట్లు రాఁగా దాని సత్త్వము తెలిసినదన్నమాట. తెలి యన్-తెలియగా, తెలియుటకు; రెండర్థములు చెప్పవచ్చును. కాని యితడు దాని సత్త్వము తెలియుటకు రాలేదు. అందుకును వచ్చియుండవచ్చును. మాయ, ద్వారక, అవంతి, కాశి, కురుక్షేత్రము, గయ, ప్రయాగము, ఇవి యన్నియు నుత్తరహిందూస్థానమునందున్న మన పుణ్యక్షేత్రములు. ఆ ప్రదే శములకు బోయి, పితరులకు పిండములు వేసినచో వారుత్తమ లోకములకు పోవుదురు.

నే నచ్చటికిపోఁక యీ మంచుకొండకు వచ్చితినేమో! ఈ మంచు కొండ యెట్టిది? ఉద్దండమైన గండమృగములు, వేదండములు – ఏనుగులు; వరాహములు – అడవిపందులు, వాహరిపులు — అడవిదున్నలు; ఖడ్గమృగ ములు; వ్యాఘ్రములు — ఇవియన్నియు కలది. ఉద్దండ...వ్యాఘ్రము — ఇదియొక సమాసము. ఇందు మృగములు పేర్లు చెప్పబడినవి. మనమేమని యర్థము చెప్పికొనవలయును. ఈ సమాసమంతయు మంచుకొండకు విశేషణ మని చెప్పుకొనవలయును. ఇవియన్నియు కలదియని చెప్పికొనరాదు. వీనిచేత నివసింపబడుచున్నట్టిదని చెప్పికొనవలయును.

చూచితిరా! ఇంతకుముందు హిమవత్పర్వతము నేమి పొగిడినాడు. ఇప్పుడు మంచుకొండ వట్టిదౌర్భాగ్యపు కొండయని చెప్పుచున్నాడు. ఇంతకుముందు ఏమి సీసపద్యములు, ఏమి చమత్కారము! ఇప్పుడట, వట్టి పులులు, పందులు నుండెడి స్థలమట! ఇది మానవ స్వభావము. సుఖము లనుభవించు నపుడు భోగ వస్తువులను తత్ హేతువు లయిన మనుష్యులను పొగడుదురు. దుఃఖములు ప్రాప్తించి నప్పుడు వానిని తెగడుదురు. మానవులు జీవితము ననుభవించుచు సుఖదుఃఖము లనుభవించు భిన్న వేళలందు వారు పలికెడి భిన్నమైన పలుకులు వారి సుఖ దుఃఖములకు వ్యంజకములేగాని యదార్థములుగావు. ఎందుకనగా వెంటనే ప్రవరాఖ్యు డిట్లనుచున్నాడు. బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ కదా! శ్రోత్రియుల్. కర్మానుష్ఠాన పరులు, బుద్ధియొక్క జాడ్యము – మాంద్యముచేత, జనిత – పుట్టిన, ఉన్మాదము కలవారుఅని. ఇంతకుముందు మంచుకొండను తిట్టినట్లే తన్ను తాను తిట్టుకొనుచున్నాడు. లోకములో జనులేమందురు? నాకు బుద్ధి లేదుకనుక నీకు సాహాయ్యము చేసితినిరా యనును. తనకు బుద్ధిలేదని యర్థమా! వాడు సాహాయ్యము పొందుట కనర్హుడని యర్థము. అట్లే యిచ్చట ప్రవరాఖ్యుడు తన్ను నిందించుకొను చున్నాడు. ఇంతకంటె నిక్కడ నెక్కువ యర్థ ముకాదు.

ఇట్లు తాను దుఃఖపడుచు, తన సంసారమును తలచుకొనుచు, తప్పని సరిగా నడచుచు ఒక కోనను చూచెను.

ఆ కోనయొక్క వర్ణన సరిగా పెనుగొండ కొండమీద నొకచోట నున్నదట! పెద్దన్న దానినే వర్ణించినాడు. వెనుకటి చిగురుకొమ్మవలె. దానికి త్రోవయున్నది. ఏమి యందమైనదారి. అచ్చట నొక మేడయున్నది. అది యెంత యందమైన మేడ.

ఈ దారిగాని, ఈ మేడగాని వర్ణించుట–సొగసు సొగసుగా వర్ణించుట–కావ్యకవుల లక్షణము.

అప్పుడతనికొక సన్నని సువాసన, గాలితోవచ్చినది తగిలెను.

మృగమద సౌరభవిభవ
ద్విగుణిత ఘనసారసాంద్ర వీటీగంధ

స్థగితేతర పరిమళమయి
మగువ పొలుపుఁదెలుపు నొక్కమారుత మొలసెన్.

మృగమదము — కస్తూరి, ఘనసారము — పచ్చకర్పూరము; కస్తూరిచేత గుమ్మను వాసనచేత రెట్టింపైన పచ్చకర్పూరము కలిసిన తాంబూలపు గంధముతోకూడిన గాలివచ్చినది. ఆ గాలిలో ఆ తాంబూలముకంటె నితరమైన వాసనకూడ వచ్చుచున్నది. ఆ యితరమైన వాసనయేమి ? అత్తరులు, పునుగులు, జవ్వాదులు కూడ నున్నట్లున్నది. ఇట్టి వాసన యెచటినుండి వచ్చును ? మహాభోగవతియైన యొక స్త్రీ యున్నచో వచ్చును. ఆ మారుతము మగువ పొలుపుఁ దెలుపుమారుతము.

అతడు వట్టి శ్రోత్రియుడు కాడు, భోగి. స్త్రీల యొయ్యారములు, భోగములు తెలిసినవాడు. ఈ పద్యములోని రహస్యమిది.

మరియైనచో తానాచోటును పరిహరింపవలయును. రెండు కారణముల చేత నతడు పరిహరించలేదు. ఒకటి-తనకు దారిచెప్పెడి దిక్కు మరియొకటి లేదు. రెండు-అతడిట్టి సౌందర్యములు, భోగములు, సంగీతములు నన్నియు నెఱిగినవాఁడు. అతనికి వ్యామోహములేదు. అందుచేత వెళ్ళినాడు. వెళ్లి యామెను చూచినాడు. ఆమె మెఱుపుతీగవలె నున్నది. పెద్ద కన్నులు కలది, నల్లని ముంగురులు కలది, చంద్రునివంటి మొగము కలది. మంచి యౌవనములో నున్నది. చాల భాగ్యశాలిని. చూచినవెంటనే యామె దేవతా స్త్రీయని యితడు గ్రహించెను. అచ్చట మానవస్త్రీ లెవరుందురు ?

ఆమె తనయింటిముందఱనున్న యొకమామిడిచెట్టు మొదట వేయించు కొన్న యరుగుమీద కూర్చుండి వీణవాయించుచున్నది. ఆమెయొక రతిపారవశ్య విభ్రమములో నున్నది. వీణ వాయించు చున్నది. అప్పుడామెను యితడు పలుకరించు స్థితిలో లేదు. కాని యామెయే యితనిని చూచినది. ఇతడు నలకూబర సన్నిభుడు.

నలకూబరు డనగా కుబేరుని కుమారుడు. నలకూబరుడు, జయంతుడు మన్మథుడు, నలమహారాజు, నకుల, సహదేవులు, వీరందరు మన పురాణములలో గొప్ప సౌందర్యవంతులైన పురుషులు.

ఇచ్చట అబ్బురపాటుతోడ చూచి ఝుళంఝుళత్కటక - మునుమున్ బుట్టెడుకొంకు — పంకజముఖి కప్పుడు—తొంగిలి ఱెప్పలన్ దొలగ — ఈ పద్యములన్నియు చదివి తీరవలెను. అప్పుడు

"అనిమేషస్థితిమాన్పె బిత్తరపుఁజూ పస్వేవతావృత్తి మా
న్పె నవస్వేదసమృద్ధి బోధకళమాన్పెన్ మోహవిభ్రాంతి తో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయమొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వముమెయిన్ జూపెట్టెనా నత్తఱిన్."

ఆమె దేవతాస్త్రీ. దేవతలు ఱెప్పవాల్చరు. అందుకే వారిని అని మేషులని; అనిమిషులనియందురు. నిమేషము-నిమిషము-రెప్పపాటు. వారికి స్వేదము-చెమట, యుండదు. వారికి మోహముండదు. ఆమె ప్రవరుని చూచుచు కనుఱెప్పలువాల్చినది-(ఇది శృంగార భావలక్షణము)ఆమెకు చెమటపోసినది. (దీనిని సాత్త్విక స్వేదమందురు). మోహముసరే. ఆమె గీర్వాణవధూటి-దేవతా స్త్రీ; గీర్వాణులు - దేవతలు. వధూటి - ఒకటి స్త్రీ; (సామాన్యముగా వాడుదురు) రెండు పెండ్లాడిన స్త్రీ; మూడుకోడలు; ఇచ్చటనే యర్థము చెప్పవలెనని ప్రశ్న. కవి యొకః కావ్యమును వ్రాయునప్పుడు వర్ణనలు చేయును. కొన్ని వర్ణనలు కవి స్వంతముగా చేయును. కొన్నింటిని కథాను బంధిగా చేయును. కథానుబంధిగా చేసిన వర్ణనలు తత్తత్పాత్రల మనో లక్షణములను చెప్పుచుండను. స్వంతముగాచేసినవి వానిసొంతమే. అయినను వానిలో నొక్కొక్కచోట కవి యభిప్రాయముండవచ్చును. పాత్ర యభి ప్రాయముండవచ్చును. వధూటికిన్ అనుటచేత సామాన్య స్త్రీ వాచకముగా పెద్దన్న వాడియుండవచ్చును. కాని ప్రవరాఖ్యుని మనస్సులో నామె యెవ్వ నికో పెండ్లమన్న యూహకూడ నుండవచ్చును. ఇది వధూటి శబ్దములో నున్న స్వారస్యము.

అమరములో వధూః అన్న శబ్దముమాత్రమే యున్నది. వధూటి శబ్దము చాలాచోట్ల వాడబడినది. గోపవధూటి మొదలైనది.

లేదా యిచ్చట ప్రవరుని చూచినంతనే వరూధిని తానతనిస్త్రీగా భావించినది. ఆమెను పూర్వమొక గంధర్వుఁడు వాంఛించెను. ఆమె తిరస్క రించెను, ఆమె యింతవఱకు కన్య. దేవతావారకాంత కనుక నామెకు పలు

మందితోడ సంపర్కము కలదనుకొనుట కథాగత లక్షణములకు వ్యతిరేకము. అది న్యాయముగాదు. ఆమె తన్నుదాను ప్రవరునకు సమర్పించుకొన్నది. వేంటనే వధూటియైనది. పెద్దన్నగారి యర్థమిదియై యుండవలయును.

పెద్దన్నగారు జాగ్రత్తగా నాలోచించి శబ్దమును వేసెడివారు.

ఇప్పుడు ఆమె దేవతాస్త్రీ. ఇతడు మనుష్యుడు. ఆమెయందు దేవతా లక్షణములు పోయి మనుష్యలక్షణములు వచ్చినవి. కనుఱెప్ప వేయుట, చెమట పోయుట, మోహము కలుగుట, —

కవి యిచ్చట నాపవలయును. ఇది ధ్వనియగును. తరువాత చెప్పినది వాచ్యమగుచున్నది. ఒక న్యాయమును కుదిర్చినాడు. ఆ న్యాయము భ్రమరకీట న్యాయము. భ్రమరము - తుమ్మెద యొక పురుగును పట్టుకొని ఝంఝుమ్మని తిరిగి దానిని తుమ్మెదనుజేయునని లోకములో వాడుక. ఇది భ్రమరకీటన్యాయము. దాని ప్రకారము వరూధిని ప్రవరాఖ్యుని భావించుట చేత తానుకూడ మనుష్యస్త్రీయైనది అన్నట్లుగా నున్నది.

ఇప్పుడేమైనది. వ్యంగ్యముపోయి వాచ్యమైనది. వ్యంగ్య మధిక రమణీయమైనది. వాచ్యము తక్కువ రమణీయమైనది. మరి యెందుకు చేసినాడని ప్రశ్న. పెద్దన్న తక్కువకవికాడే ! దీనికి రెండుమూడు కారణములు కలవు. 1. కావ్యకవులకు పద్యము సుఖముగా పూర్తిచేయుట అధిక వాంఛనీయము. 2. ఇచ్చట నిది వాచ్యము చేయకుండ వదలిపెట్టినచో వ్యంగ్యమును గ్రహించుట చాలకష్టము. ఈ వ్యంగ్య మొక న్యాయముమీద నాధారపడియున్నది. ఆ న్యాయమును వదలిపెట్టినను వ్యంగ్యము వ్యంగ్యముగానే యుండును. కాని న్యాయమును సమకూర్చుటచేత నొక చిన్న చమత్కారము కలుగుచున్నది. 3. పెద్దన్న యిచ్చట వ్యంగ్యముకన్న వాచ్యమే అధిక సుందరముగా భావించినట్లున్నది. ఆ మాట నచ్చముగా కాదనుటకును వీలులేదు.

అని అతని సౌందర్యమును చాల మెచ్చుకొని హఠాత్తుగావచ్చి కాలి గజ్జెలు మ్రోయునట్లుగా వచ్చి యతనిదారి కడ్డముగా నిలచెను. అతడు నివ్వెఱపోయెను. కాని యతడిట్టి లక్షణములు మున్నెఱుగును. అతడన్నాడుకదా !

"ఎవ్వతవీవు భీతహరిణేక్షణ ! యొంటి జరించె దోట లే
కివ్వనభూమి భూసురుడనే బ్రవరాఖ్యుడ త్రోవ తప్పితిన్
క్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచితి నిల్లుసేర నిం
కెవ్విధిగాంతు తెల్పగదవే తెరువెద్ది శుభంబునీకగున్"

ఈ మాటలామెకు నొకవిధముగా నర్థమైనవి. ఏమియు లేదు. 'భీత హరిణేక్షణ' – భయపడిన లేడికన్నులవంటి కన్నులుకలదానా ! (లేడికన్నుల వంటి కన్నులుకలదానా యని బహువ్రీహి సమాసము చెప్పవలెను. లేడివంటి కన్నులుకలదానా యనకూడదు. ఆమెకన్నులు లేడికన్నులవలె నున్నవిగాని లేడివలె లేవు.)

ఒంటిచరించె దోటలేక – భయములేక యొక్కతెవు తిరుగుచున్నావు.

ఈ మాటలామె కాళగొలిపినవి. తనకన్ను లెట్టివైనచో నతనికేమి ? తనకన్నులు మెచ్చుకొనుచున్నాడు గనుకనే యట్లుపిలిచినాడు అని యామె యుద్దేశ్యము.

కాని యతడు సౌందర్యము నెఱిగినవాడు. దానిని నోటితో ననెడు వాడు. భయములేకుండ నిచ్చట తిరుగుచుంటివనగా నతడిచ్చట దారితెన్ను లేక భయపడుచున్నాడు. అది యడవి యనుకొనుచున్నాడు. అట్టిస్థలములో నామెను చూచుటచేత నిట్లన్నాడు. మరియు 'శుభంబు నీకగున్' అని బ్రాహ్మణాశీర్వాద మిచ్చినాడు. ఈ యాశీర్వాదములో శృంగార రసము యొక్క ఛాయకూడ లేదు.

తరువాత పద్యపు మొదట 'అని తనకథ నెఱిగించిన' యని యున్నది. అనగా తన కథయంతయు చెప్పెనని యర్థము–సిద్ధుడువచ్చుట, కాళ్ళకు పసరురాచుట మొదలైనదంతయు.

అప్పటికి వరూధినికి అతడు తనచేతిలో చిక్కిన పిట్టయని తెలిసినది. ఈమాట యనుటచేత నామె యతనిని వలవేసి పట్టుకొనవలెననిగాని మరి యే దురూహలుగాని లేవు. అతడిప్పుడు నిస్సహాయుడు. అట్టిస్థితిలో తా నతనిని వలచినదిగనుక తనవలపు చెప్పినచో నచటనుండి పోవుటకత డంగీకరింప వచ్చును. నిజాని కామెకుమాత్రము దారి యేమితెలియును? ఆ పర్వతములు

ఆ మార్గములు నామె యెఱుగునా? ఒక ఆటవికుడో యొక ఆటవికురాలో యైనచో దారి చెప్పగలుగుదురేమో!

ఇంకనామె తన ప్రేమను బయటపెట్టుట మొదలుపెట్టినది.

> "ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర! యే
> కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
> గింతియకాక నీ వెఱుఁగవే మునువచ్చిన త్రోవచొప్పు నీ
> కింతభయమ్ములే కడుగనెల్లిదమైతిమి మాట లేటికిన్"

ప్రసిద్ధమైన పద్యము. అతనికన్నులు విశాలమైనవని. అతడు తెలిసియే మిషపెట్టి పలుకరించుచున్నాడని తాను వానికి లోకువైనదని—యిట్టిమాటల చేత నామె తన ప్రేమ వెల్లడించినది.

ఎఱుఁగవే మునువచ్చిన త్రోవచొప్పు. అనగా 'అని తనకథనెఱింగించిన' యన్నమాటకు వ్యాఖ్యానము వేఱే యేమియులేదు. 'ఎవ్వతె వీవు' అన్న పద్యములో నెంత యర్థమున్నదో యంతియే యర్థమని సామాన్యముగా నందఱు ననుకొందురు. అందుకనియే 'యెఱుగవే మునువచ్చిన త్రోవచొప్పు' అని యీామె యనుట తటస్థించినదనికూడ చెప్పవచ్చును.

కాని యిందులో విశేషార్థ ముత్పన్నమగును 'నీవు వెళ్లుట యసంభవ' మని. ఇచ్చటనుండి యెవ్వరువెళ్ళరు. నీ విచ్చటనుండి పోవలసిందే! యని కూడ నర్థముచెప్పవచ్చును.

ఈ మాటలు ప్రవరున కర్థముకాలేదు, అర్థమైకూడ అతడు పట్టించుకోడు. తనవంశము గొప్పచెప్పినది.

> చిన్ని వెన్నెల కందువెన్నుదన్ని సుధాబ్ధి
> పొడమిన చెలువ తోఁబుట్టు మాకు
> గహివుట్ట జంత్రగాత్రముల రాల్గరగించు
> విమల గాంధర్వమ్ము విద్య మాకు
> నవిల్తు శాస్త్రంపుమినుకు లావర్తించు
> పని వెన్నతోఁ బెట్టినది మాకు
> హాయమేధ రాజసూయములనఁ బేర్వడ్డ
> సవన తంత్రంబు లుంకువలు మాకుఁ

గనకనగసీమఁ గల్పవృక్షముల నీడఁ
బచ్చరాచట్టు గవి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ భర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర."

ఇది చాల మంచి పద్యము.

చిన్ని వెన్నెలకందు—అందమైన వెన్నెల పసివాడు. అనగా చందమామ; అతని వెన్నుఁదన్ని — అతని వెంటనే; సుధాబ్ధిన్ — అమృతసముద్రములో, బొడమిన చెలువ — లక్ష్మీదేవి; మాకు తోబుట్టువు. లక్ష్మీదేవి పేరు చెప్పలేదు కదా! అందుచేత నామె తమకు వరుసకప్పగారుకాదు. నిజముగా నప్పగారు. అనగా తమరుగూడ పాలసముద్రములో పుట్టిరని యర్థము. 'పచ్చరాచట్టు గమి' పచ్చని మణివేదికలు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల సభలు వారికి సాము గరిడీలు. సాముగరిడీలు పురుషులు చేయుదురు. కాని భరతశాస్త్రము నేర్చికొను స్త్రీలయొక్క విద్యకూడనట్టిదే !

ఆమె యిట్టి మాటలనగా ప్రవరుడు ఆమె స్వరూపమును సంపూర్ణముగా తెలిసికొనెను. తాను అరుణాస్పదపురములో పలుచోట్ల కుపోవుట వారితనిని గౌరవించుట యితడు సాలగ్రామము మున్నుగా గొననివాడుఁ గనుక నిర్లిప్తుడుగనుక నతడనెడిమాటలు కొన్ని గలవు. వానినన్నాడు. కాని 'అండజయాన !' యని సంబోధించుట తప్పుచేసినాడు. వట్టి స్త్రీ పర్యాయ పదముగా వాడినాడు. అతని హృదయములో వస్తుసౌందర్యదృష్టి నెలకొని యున్నది. ఆ దృష్టికి నతనివాంఛకు సంబంధములేదు. నీవుచేసినమర్యాదలు మాకు వచ్చినవి. నేను మీయింటికి వచ్చినచో నొకటియు రానిచో నొకటి యునా? నేనింటికిపోయి క్రియాకలాపము చేసికొనవలెను. నన్ను దయచూచి వదలిపెట్టవలయును. నీవు దేవశాస్త్రీవి. నన్ను తేలికగా మా యింటికి పంపఁగల్గుదువు.

అనగా వరూధినికి ప్రవరుడు తన్ను మించిపోలేడని తెలిసినది. ఇంక నతనికెన్ని మేనెరలుపెట్టినది, అక్కడనున్న సౌందర్యములన్నియు చెప్పినది. ఎంతో శృంగారరసమును వెడలగ్రక్కినది. తన్నుఁగూడి రమింపుమన్నది. ఆక్షేపించినది.

చివరకు నిట్లన్నది :

"ఎందే డెందము కదళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్ గుంభగత ప్రదీపకళికాశ్రీదోఁప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁగను నా యింపే పరబ్రహ్మమా
నందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా !"

ఆమె ఆనందో బ్రహ్మ యన్న వాక్యమున కీ దుర్వ్యాఖ్యానము చేసినది.

ఇతడు సర్వశాస్త్రవేత్త. అధ్యయనపరుడు. అట్టివారు మరి దేనినైన నోర్తురుగాని వేదోపనిషచ్ఛాస్త్రగత పంక్తులకు దుర్వ్యాఖ్యాన మోర్వరు. ఇంతవఱ కామెయందు జాలికలదు. జీవులయొక్క కామప్రవృత్తి యిట్లుండు నన్న యొకయూహ కలదు. ఇప్పుడదియు పోయినది. ఆనందో బ్రహ్మ యటన్నది మహావిషయము. స్త్రీ పురుష రతిసంబంధమైనదిగా వ్యాఖ్యానము చేయుట పాపముకూడ.

దానికిత డిట్లనెను ;

"ఈ పాండిత్యము నీకు, దక్క మరియెందేగంటి మే కామశా
స్త్రోపాధ్యాయినినా వచించెదవు మే లోహో త్రయీ ధర్మముల్
పాపంబుల్ రతిపుణ్యమంచు నికనేలా తర్కముల్ మోక్ష ల
క్ష్మీ పథ్యాగమసూత్రపంక్తి కివె పో మీ సంప్రదాయార్థముల్"

ఇది మీ వ్యాఖ్యానము. ఇక్కడ తర్కము కూడనా! ఆనందో బ్రహ్మ మొదలయినవి మోక్షలక్ష్మీ పథ్యాగమసూత్ర పంక్తిలోనిది.

మోక్షలక్ష్మి - మోక్షేందిరయొక్క; పథి - మార్గమునందున; ఆగమ - శాస్త్రములయొక్క; సూత్రపంక్తి - సూత్రముల వరుస.

సంస్కృతములో కొన్ని శబ్దములు సమాసాంతము లైనచో అకారాంతము లగును. అందుచేత లక్ష్మీపథాగమములు కావలయును. కాని ఆ సూత్రము వికల్పము. వచ్చినచో వచ్చును రానిచో రాదు. అందుచేత పథ్యాగమ అని యణాదేశ సంధియేర్పడినది.

సంప్రదాయము- దీనిని లోకములో సాంప్రదాయమని వాడుదురు. అది తప్పు. సమర్థించవచ్చును.

అతడిట్టివానిని తుచ్ఛసుఖము లనెను.

ఆమె కాళ తునిగిపోయెను

ఆమె యతనిమీదపడి కౌగలించుకొనెను.

"ప్రాంచద్భూషణ బాహుమూలరుచితో పాలిండ్లుపొంగార పై
యంచుల్ మోవగ కౌగలించి యధరంబాసింప హా శ్రీహరి!
యంచున్ బ్రాహ్మణు డోరమోమిడి తదీయాంస ద్వయంబంటి పొ
మ్మంచుంద్రోచె కలంచునే సతులమాయల్ ధీరచిత్తమ్ములన్."

ఇందులో పక్కా రసాభాసమున్నది. ఈ పద్యము జనమందరికి వచ్చును. అప్పుడామె యేమి చేయును? ఒక వేలను చూపించెను.

"పాటునకింతులోర్తు రె కృపారహితాత్మక నీవుత్రోవ ని
చ్చోటఁ భవన్నఖాంకురముసోకె కనుంగొనుమంచుజూపి య
ప్పాటల గంధివేదననెపంబిడి యేడ్చె కలస్వనమ్ముతో
మీటినవిచ్చుగుబ్బ చనుమిట్టల నశ్రులు చిందువందగన్."

నీ గోటికొన చివర యిచ్చట గ్రుచ్చికొనెనని చూపినది. ఎచ్చటనో మనకు తెలియదు. పాపమామె యంత లజ్జవిడిచినది. ఆ గిచ్చువలన బాధ కలిగినట్లు ఏడ్వ మొదలుపెట్టినది.

ఈ పద్యమొక అందమైన పద్యము. దీనినిఁబట్టి ముక్కుతిమ్మన్న తన పారిజాతాపహరణములో నొక పద్యము, భట్టుమూర్తి తన వసుచరిత్రములో నొక పద్యమును వ్రాసికొనిరి.

చివరకామె నీవు నన్ను పొందుటచేత నీ గొప్పదన మేమియుపోదు పూర్వము నీకంటె గొప్ప మహర్షులే యప్సర స్త్రీలను పొందినారు అని వారి కథలు తడవమొదలు పెట్టెను.

"వెలిపెట్టరే బాడబులు పరాశరుఁబట్టి
దాశకన్యాకేళిఁ దప్పుజేసి
కులములో వన్నెతక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక చుట్టరికము

నను పుకాడై వేల్పు నాగవాసముఁగూడి
మహిమఁగోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్యమేలంగ నీకైరె సుర లహా
ల్యాజారుఁడైన జంభాసురారి
వారికంటెను నీ మహత్త్వంబు ఘనమె
పవన పర్ణాంబు భక్షులై నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిక్రుచ్చులెల్లఁ
దామరస నేత్రలిండ్ల బందాలుగారె."

జాడఖులు - బ్రాహ్మణులు; గాధిపట్టి - విశ్వామిత్రుడు; నను పుకాడు-మిండకాడు; వేల్పు నాగవాసము - అప్సరస్త్రీస్త్రీలు. స్వారాజ్యము-స్వర్గము; (స్వః + రాజ్యము — స్వారాజ్యము) శబ్దము స్వః - సకారాంతము "స్వస్" అన్నమాట. ఈ విసర్గపైన 'ర' అన్న అక్షరము రాగా 'స్వ'కు దీర్ఘముపచ్చును. అందుచేత స్వరాజ్యము వేఱు స్వారాజ్యము వేఱు. మన దేశములో చాలామంది పలుశబ్దములను తప్పుగా వాడుదురు. అందులో నిది యొకటి. ఇరువది యేండ్లక్రింద అహింసావాదులు చాలమంది స్వరాజ్యము బదులు స్వారాజ్య శబ్దమునువాడి బ్రిటిషువారి పోలీసుల చేతిలో స్వారాజ్యమును పొందిరి: కచ్చడాలు — గోచులు.

కచ్చడాలన్న శబ్దమిచ్చట వాడుట వరూధినిచేసిన యాక్షేపణకు లక్షణము.

చివరికా ప్రవరుడు తాను నిత్యము వ్రేల్చుచున్న మహాగ్నిహోత్రుని ప్రార్థించి మింటికెగిరి తనయూరు తాను బోయెను.

మనము పూర్వము వరూధిని నెరుగము. ఆమె సంగతి మనకు తెలియదు. అయినను అతడు వెడలిపోయిన తరువాత మన మనస్సు వానిమీద కంటె నీమెమీద నెక్కువ నిలచును. ఆమె యెవ్వరు? అన్న ప్రశ్నకంటె ఆమె యేమైపోయినది? ఏమి చేసినది? ఇట్టి ప్రశ్నలు మనలను బాధించును. అతడు వెళ్లిపోయిన తర్వాత నామె యతనిని గురించి చాల దుఃఖించినది. ఆమె దేవతా స్త్రీ. వారికి చావులేదు. ఆమె యనుకొన్నది కదా! నాకంటె మనుష్య స్త్రీలే యెక్కువ యదృష్టవతులు. వారు తాము ప్రేమించిన

పురుషుడు నిరాకరించినచో చనిపోగలుగుదురు. నేను చావలేనని దుఃఖించి నది. ఇంతలో ప్రొద్దు క్రుంకినది. సంధ్యాకాంతులు క్రమ్మినవి. ప్రపంచ మంతయు నెఱ్ఱగానైనది.

ఉరుదరీ కుహరసుప్తోత్థ శార్దూలముల్
ఝరవారి శోణిత శంకఁ ద్రావ
వనకుంజ మధ్యశాద్వల చరన్మృగపంక్తి
దావపావకభీతిఁ దల్లడిల్ల
నాశ్రమాంతర భూరుహాగ్రముల్ మునికోటి
బద్ధ కాషాయ విభ్రాంతిఁజూడ
ఘనసాను శృంగ శృంగాటకంబులఁగాంచి
యమరులు హేమాద్రియనుచు వ్రాల
గా నెఁబేశలరుచిఁ గింశుక ప్రవాళ
ఘుసృణకిసలయ కంకేళి కుసుమగుచ్ఛ
బంధుజీవ జపారాగ బాంధవంబు
లన్నగంబున జరతారుణాతపములు.

పెద్ద గుహాగర్భములయందు సుప్త - నిద్దురపోయి; ఉత్థ — లేచిన; శార్దూలముల్ — పెద్దపులులు; ఝరవారిన్ - సెలయేళ్లలోని నీటిని శోణితశంకన్ - నెత్తురన్న యూహతో: త్రావన్ — త్రాగగా; పెద్దపులులు పవలెల్ల నిద్రపోయి ఆ మగత సరిగా తీరకముందు సంధ్యాకాలపు టెఱ్ఱదనముచేత నెర్రవడిన సెలయేటి నీళ్ళను నెత్తురనుకొని త్రావినవట ! అడవిలో అగ్ని బయలుదేరినదని లేళ్లగుంపు భయపడినది. మునులు చెట్ల కొమ్మల మీదనున్న యెఱ్ఱదనమునుజూచి ప్రొద్దుట నెండవేసిన తమ కావి బట్టలు శిష్యులు విప్పలేదని చూచిరి. వట్టికొండల చరియలుచూచి దేవతలు వారి నివాసభూమియైన బంగారు పర్వతమనుకొని ప్రతికొండమీద వ్రాలిరి.

ఇది సంధ్యాకాంతుల వర్ణన. మన కవుల యొక్క వర్ణనలిట్లుండును. ఇంత రమ్యముగా నుండును. మరియు నీపద్యము యొక్క మొదటి చరణము

దాని కదియేసాటి. ఆ యక్షరములకూర్పు పరమ రమణీయము. అవి జర తారుటాతపములు. ముదిరిన యెఱ్ఱని యెండలు. ఆ సమాప మందమైనది.

చీకటిపడ్డది. తెల్లవార్లు గడచినది. మరల తెల్లవాఱినది. ఇచ్చట నెన్నియో పద్యము లందమైనవి కలవు.

అంతట వరూధిని దుఃఖపడుచున్నది. ఇంటిలో తోచక యుద్యాన వనము లోనికి పోయినది.

ఇట్లుండగా మన కావ్యములలో నొక యంగమున్నది. తొమ్మిది రసములు కలవు. వానిలో శృంగారరసము ప్రధానమైనది. రస ముద యించుటకు విభావము లుండవలయును. విభావములు రెండు విధములు. ఆలంబన విభావము, ఉద్దీపన విభావము. శృంగార రసమునకు నాయికా నాయకులుందురు కదా! వారాలంబన విభావములు. వారు లేనిచో రసమే లేదు. రెండవది ఉద్దీపన విభావము. ఆ భర్తదగ్గర లేనప్పుడు ఆ నాయిక చాల బాధపడుట సహజమేకదా! చల్లనిగాలి, వెన్నెల, చందమామ, మన్మ థుడు మొదలైనవి ఉద్దీపన విభావములు

ఆ నాయిక యీ యుద్దీపన విభావములను తిట్టుట మన కావ్యము లలో నొక సొగసు. కవులు చమత్కారముగా తిట్టింతురు;

వరూధిని చంద్రుని తిట్టుచున్నది :

త్రిపుర సంహార మొనరించునపుడు హరుడు
బండికల్లుగ నీమేను గండిచేసె
నదియు సెలవాఱి తెగటారవైతి చంద్ర
అకట రోహిణియెడ నపథ్యమునఁజేసి

శివుడు త్రిపుర సంహారము చేసినపుడు ఆయనకు భూమి రథము, సూర్య చంద్రులు రథ చక్రములు. చక్రమైన చంద్రునిలో నిరుసుపెట్టుటకు చంద్రు నిలో గండిచేసెనట అది పెద్దగాయము. మందులువేసి మాన్పించుకొన్నను ప్రాతపుండు సెలవేయుట యున్నదికదా! నీవట్లైన చచ్చితివికాదు. దాని కన్న నందమైన మాటయిది. "రోహిణియెడ నపథ్యమునఁజేసి" యన్నది. చంద్రునకు రోహిణి పెద్దభార్య. ఆమె యన్నచో నతనికెక్కువ ప్రేమ.

అతని కిరువది యేడుమంది భార్యలు; గురుభార్యయైన తారతో నతడు చేసిన జారత్వము ప్రసిద్ధము. అతడు గొప్ప కాముకుడు. స్త్రీలోలుఁడు. వుండు నెలవాటినపుడు జ్వరమువచ్చును. ఆ జ్వరములో స్త్రీ సంయోగము చేసినచో దోషగుణము కలుగును, దోషగుణము చాలాచెడ్డది. చాలమంది చత్తురు.

ఇది చిన్న పద్యమైనను మిక్కిలి భావముకలిగిన పద్యము. చక్కని యూహకలిగిన పద్యము. వరూధిని చంద్రుని కాముకత్వమును నిందించుచున్నది. వరూధిని శీలవతియని తెలియుచున్నది.

మన కావ్యములలో నిట్లు ప్రబంధము లన్నింటిలో మన్మథ చంద్ర మలయానిలాదుల దూషణలు శృంగారరస కావ్యములలో పతి విరహావస్థ యందు కవులు నాయికలచేత చేయింతురు. జనము బంధువియోగము జరిగి నప్పుడు భోగము లనుభవించుట కిష్టపడరుకదా! ఇష్టపడక పోవుటయే కాదు, తిరస్కరింతురు, వానిని దూషింతురు. ఇది మానవ స్వభావము. దీని నాధారము చేసికొని మన కవులీకల్పనలు చేసినారు.

ఒక స్త్రీ ఒక పురుషుని ప్రేమించుటయు ఆ ప్రేమ కొనసాగక పోయి నచో ప్రాణములుకూడ పరిత్యజించుటయు లోకములోనున్నది. అదియే నిజమైన ప్రేమయని యాధునికులు మిక్కిలి ప్రశంసించుట కలదు. ఆ స్త్రీ ఎందుకు చనిపోవును? తాను ప్రేమించిన వానిని వదలి బ్రతుకలేదు. ఈ శృంగార నాయికల లక్షణముకూడ నించుమించుగా నట్టిదే! అందుచేత కవులు తమ కావ్యముల యందిట్లు వ్రాసిరి. దీనివెనుక నీ పరమగాఢాను రాగమున్నది.

ఇవి ప్రతి కవియు చేసినాడని యాధునికు లాక్షేపించుట యారంభించిరి. తిరస్కరించుట యారంభించిరి. చిలవలు పలవలు మొలిపించిరి. వారిది సరియైన యూహకాదు, మరియు కావ్యములు కల్పనల కోసము వ్రాయ బడుచున్నవని తొలుత చెప్పబడినది. ఆ వెనుకనున్న గాఢానురాగమును పాఠకుడు వదలిపెట్టకుండ కవిచేసిన కల్పనలలోని చమత్కారము చూడ వలయును. మన పాశ్చాత్య విద్యా ప్రభావమువలన తదనుయాయులైన కొందరు విద్యార్థికులవలన మన కావ్యములను మెనమెట్లు చదువుకొన వలయునో మరచిపోయినాము.

ఈ కల్పనలు చదివినచో నేటి పాఠకులకు మన సంప్రదాయములు మన పురాణకథలు వానిలోని చమత్కారములు మొదలైనవి చక్కగా తెలిసి అందఱును పండితులు కావచ్చును.

ప్రొద్దు క్రుంకినది. చీకటి పడినది. వరూధిని తన యుత్సాహమే పోగొట్టుకొన్నది. ఆమె చెలికత్తె యామెను మందలించుచున్నది.

వాలారుం గొనగోళ్లనీ వలసతన్ వాయించుచో నాటకున్
మేళంబైన విపంచి నిన్నమొదలున్ నీవంటమింజేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెఁడు ప్రభాతాయాత వాతాహతా
లోలత్తంత్రులు మేళవింపగదవే లోలాక్షి దేశాక్షికిన్.

వరూధిని వెనుకటిదినమున వీణవాయించి తీగలను నాటరాగమునకు శ్రుతిచేసినది. ఈప్రవరుడు వెళ్లిపోయినాడన్న దుఃఖముతో మరల వీణవంకనే చూడలేదు. రాత్రి గడచినది. తెల్లవాఱినది. గాలిచేత కొట్టబడి యా తంత్రులు వేళకానివేళ నాటరాగ సంబంధిస్వరములు వెలువరుచుచున్నవి. ప్రాతఃకాలమునందు దేశాక్షిరాగము పాడవలయును. దానికి తంత్రులను మేళవించుమని చెప్పుచున్నది. ఆమె మేళవించినచో కొంత దుఃఖము మరచి పోయి నట్లగునుకదా, అందుకని.

ఇచ్చట మన కవులు, వారి పాండిత్యము, వారి నాగరకత, వారి బహుశాస్త్ర జ్ఞానము, ఆనాటి నాగరకత — ఎన్ని తెలియుచున్నవి. ఈ పద్యము చదివి తెలిసికొన్నచో సంగీత శాస్త్రములోని యొక మహా పరమ రహస్యము తెలియునుగదా! అన్ని రాగములు నన్ని సమయములందు పాడరాదు. కొన్ని ఋతువులయందు కొన్ని రాగములు పాడరాదు. అది సంపూర్ణముగా తెలిసి సంగీతము నానందించెడి నాగరకత మన దేశములో నేనాడో పోయినది. అన్ని విద్యలయందలి యన్ని సూక్ష్మములు నశించి పోయినవి.

ఇది తృతీయాశ్వాసము. ఆమె వియోగ దుఃఖమంతయు నరువది ఏడు పద్యములలో వర్ణితమైనది.

ఇప్పుడీమె యెవ్వరన్నప్రశ్న పుట్టక తప్పదుకదా!

పూర్వమొక గంధర్వుడీమెను ప్రేమించెను. ఈమె యంగీకరించలేదు. అతని కీకథ తెలిసెను. వారు దేవతలు, కామరూపులు. అనగా నిష్టమువచ్చిన రూపమును ధరింపగలరు. అతడు ప్రవరాఖ్యుడుగామారి ఈమెను పొందవలయుననితలచెను. అన్నియు వర్ణనలే! మలయపవనునిగురించి యొకచరణమున్నది. ఆ గాలిలోనుండి సువాసన వచ్చుచున్నది.

"ఉరగఫూత్కార ధూమోగ్ర గంధము వాసి
పొలయుఁబో యీ తావి మలయపవనుడు."

ఈ చరణములోని మొదటిసగము తెనాలి రామకృష్ణునిది వలెనున్నది. సంస్కృతము నసహ్యించుకొనువాడు తానీ యనుభవానందమునకు చెడును. ఎవరికి నష్టము ?

ఇట్లెన్నియో వర్ణనలుగలవు.

ఈనాటి పాఠకులు రసవేత్తలుకారు. వారికి తెలిసినది సుంత భావము. ఆ భావముకూడ సాంఘికవ్యవస్థ, రాజకీయములు, సామ్యవాదము మొదలైనవానికి సంబంధించినదివలె నున్నది.

ఊహయొక్క, భావనయొక్క రామణీయకము తెలిసినచో నీకావ్యము లర్థమగును.

మొదట బుద్ధిని దానికి ననువుగా చేసికొని కావ్యపాఠము కడకు పోవలయును.

కొంతసేపటికి అ గంధర్వుడు—ప్రవరునివలె వేషమువేసికొనినవాడు—ఆమెకు గనిపించెను. వరూథిని యితడే యతడనుకొనెను. వరూథినివచ్చి మరల పలుకరించెను. ఈ గంధర్వుడు నటించవలయును. అప్పుడక్కుహనా భూసురుడు (కపట బ్రాహ్మణుడు) ఎట్లు ప్రవర్తించవలయును? ఇట్టి ఘట్టములలో కవియొక్కశక్తి తెలియును. ఏవియో కొన్ని లక్షణములు ప్రతికవియు చెప్పును. సామాన్యకవులు చెప్పలేనివి మహాకవులు చెప్పుదురు. ఇక్కడ పెద్దన్నగారొక సీసపద్యమును వ్రాసిరి. అందులోని మొదటి చరణమును చూడవలయును.

కొనసాగి కామినీగోష్ఠి ప్రౌఢము లైన
ఉదుటు చూపులు ఱెప్పతుదల నాపి

పద్యమంతయు పాఠకుడు చదువుకొనవలయును. ఈ చరణములోని యందము చూపింతును. కొనసాగి—రాటుతేలి; కామినీగోష్ఠిన్—నిత్య స్త్రీ సంపర్కముచేత; ప్రౌఢములైన—బిగిసిన; తద్విషయికమైన సామర్థ్యమునందు పరాకాష్ఠపొందిన; ఉదుటుచూపులు—ఉదుటు అన్నమాటకు నిఘంటువులలో నర్థముండును. ఉదుటుచూపులన్నమాట దానియంతటనదియే. దానియర్థము దానిదే. స్త్రీసంపర్క ప్రౌఢుడైనవాడు తనవాంఛ యెదురుగానున్న స్త్రీలకు తెలియునట్లు కొన్నిచూపులు చూచును. ఉదుటుచూపులనగానవియే. దానికదియే యర్థము. అట్టిచూపులను ఱెప్పలయొక్క తుదలయందు ఆచి పట్టుకొనెనట.

ఇట్లు వ్రాయుటకాని ఉదుటుచూపులన్న శబ్దమును తెచ్చుటగాని చాల గడుసరియైన కవి చేయగలడు. అల్పులుచేయలేరు. మరియు నీ సీస పద్యపు చరణముయొక్క నడక ఒక గొప్పలయమీద నున్నది. అది ప్రతి వాడును తనకుదాను చదువుకొని తెలిసికొనవలసినదే.

నే నీ వ్యాఖ్యానములు వ్రాయుటలో పాఠకులయొక్క మనస్సులు మన సాహిత్యములోని రామణీయకము తెలిసికొనుటకు ప్రయత్నము చేయుచున్నాను.

చివరకునామె యితడు ప్రవరుడేయనుకొనినది. అతడు దొంగకదా! ఒక నియమము పెట్టెను. రతిసమయమునందామె కన్నులు మూసికొన వలయునట! ఇంతకంటె రతిసమయ గత పరమదుష్టమైన నియమముండదు. నిజమునకు రతి లేకపోయిననుసరే! ఈ నియమమున కంగీకరించు స్త్రీయందు స్త్రీత్వముకంటె నేదో మహాగుణమున్నది. ఆమె స్త్రీకాదు. ఒక కారణ జన్మురాలు ఆ రహస్య మీ నియమములో నిమిడియున్నది. ఆమె గర్భమున నొక మహానుభావుడు పుట్టవలెను, వాని గర్భమున స్వారోచిషమనువు జనింపవలెను. అందుకొఱకామె జన్మించినది. అందుచేత నామె యంగీక రించినది. ఒకదానివంక నొకటి చూచుకొనుట లేకున్నను పశువులుకూడ రతిసమయమునందు కన్నులు మూసికొనవు.

భారతమునందు వ్యాసదేవరన్యాయకాలమున అంబాలిక కనులు మూసికొన్నది. గ్రుడ్డివాడైన ధృతరాష్ట్రుడు పుట్టినాడు. వరూథినికి సంతతి కలిగినచో గ్రుడ్డివాడు కలుగవలెను. కలుగలేదే ! ఇది యాశ్చర్యము.

దేవతలు రాక్షసులు తాము కామరూపములు ధరించినచో రతివేళ మృతివేళ వారి సహజరూపములు పొందుదురు. అందుచేత నాగంధర్వుడీ నియమమును బెట్టెను.

ఇచ్చట కొన్ని యందమ్మైన పద్యములున్నవి. అతడన్నాడుకదా !

నీచనుదోయి సంకుమద నిర్భరవాసన మేనమాన న
య్యో చిర సౌఖ్యముల్ కనుటయొండె తపంబొనరించి పాపముల్
రాచుటయొండె గా కిహపరమ్ముకూఱక దూరమై వయ
శ్శ్రీచన రెంటికిన్ జెడిన రేవడనౌదునె నీరజేక్షణా !

అకట నిర్దయబుద్ధివని దూఱెఁగడు రంభ
యాహా వివేకివౌదని యె హరిణి
చేఁదు ద్రింంగెదవంచుఁ జిలికి నవ్వె ఘృతాచి
మాయలాఁడని తిట్టె మంజుఘోష
న్యాయనిష్ఠురములఁ బ్రార్థించె నూర్వశి
జుంకించె రమ్మంచుఁ జంద్రరేఖ
చెలినేచితని దిసంతులుగొట్టె మేనక
విడువు మాయలటంచు నొడివె హేమ

గొంటువనియెఁ దిలోత్తమ గూర్మిఁగొసరె
ధాన్యమాలిని పుంజికస్థల యదల్చె
దివిజకామిను లీరీతిఁ దిరుగువాఱి
గువ్వకోల్గొంచుఁ దమలోన నవ్వుకొంచు.

వీరు పదకొండుగురు వరూథినిచెలికత్తెలు. ఒక్కొక్కతె యొక్కొక్క మాటయన్నది. ఈ పద్యములోనున్న చమత్కారమేమనగా వారొక్కొక్క రన్నది యొక్కొక్క మాటయైనను ఆ మాటలలోని వైలక్షణ్యముచేత

ఆ మాటలనుచున్నప్పుడు వారు నిలుచున్న భంగిమలు వారి యాకార విశేషములు వారి స్వభావములు భిన్నభిన్నములుగా గడుసుగా శాంతముగా సాక్షేపముగా మృదుతిరస్కారముగా పదునొకండు విధములుగా కనుపించు చున్నవి. లోకజ్ఞుడు భావజ్ఞుడు రసజ్ఞుడునైన మహాశిల్పి వ్రాయదగిన బొమ్మలు.

ఈ పద్యముచివర గుంపుకూడుచు నన్న యర్థముకల శబ్దము "గువ్వ కొల్గొంచు" వాడబడినది. పెద్దన్నగారి శబ్దజాలములో కొన్ని మాటలుకలవు. పుచ్చడీకతనము, కచ్చడాలు, గువ్వకొల్కొంచు-ఇంకనుకలవు-గోవాళ్లు; తిమిరంపు వయసుగుబ్బలు; ఇట్టి కొన్నిమాటలుకలవు. ఆయన కవిత్వము నందు భావుకులకుగల యాకర్షణలో వీని పాలుకూడ కొంత యెక్కువ యున్నది.

వారిద్దరు పలుచోట్ల విహరించిరి. ఒక సీసపద్యమున్నది. ఆ పద్య మాచోట ఆచోటనని చెప్పును. ఆ పద్యపు మొదట "మృగనాభి నికరంపు బుగబుగల్ కలచోట" అని యున్నది. ఆయన సమాసగ్రథనమట్టిది.

పెద్దన్నగారి పద్యములకు చాలమంది కవులు నకళ్ళుదింపిరి. ఆయన యొక్క ఆంధ్రకవితయందలి యుపజ్ఞయట్టిది. ఆయనమాటలే వేఱని వ్రాసితినిగదా! "పావురము లారజమ్ములు పలుకుచోట" (అరజములనగా నవ్యక్తమధురమైన స్వరములు.) అర్థములోనేమున్నది ? అరజమ్ములు పలుకుచోట యన్న కూర్పులోనున్నదిగాని.

వారిద్దఱకు నొక కుమారుడు కలిగెను. ఆ గంధర్వుడు వరూధినిని వదలి వెళ్ళిపోయెను.

ఆ బిడ్డ పేరు స్వరోచి. (ఇది సకారాంతశబ్దము) 'స్వరోచిస్' అనిపేరు. తెలుగులో స్వరోచియగును. రోచిస్ అన్నశబ్దము తెలుగులో రోచి'యగును. తేజస్ - తేజము; యశస్-యశము; అర్చిస్-అర్చి; ఇట్లు. అతడు పెద్దవాడై గొప్పరాజయ్యెను. అతడొకప్పుడు వేటకువెళ్ళెను. ఈ వేటను చదివి తీరవలయును. ఎన్నో వేటకుక్కలు, వానికిపేర్లు; ఆ యడవిలోనున్న యేకలములు (అడవిపందులు)

> కండూతికై రాయు కర్కశంబగుతుంటి
> పీటపెట్టిన మ్రాను పెల్లగిలఁగ

వాని వెనుక భాగములయొక్క కండూతికి (దురదకు) పీటపెట్టిన మ్రానులకు వేసికొని రాయఁగా ఆ మ్రానులు పెల్లగిల్లునట !

> 'చప్పరించు వెదుళ్లు సటలుబ్బ దంష్ట్రాగ్ని
> చొంగపై బడి చుంయిచుంయి మనఁగ'

ఆ పందులు వెదుళ్ళను నమలుచుండును. నమలుచుండగా నిప్పుపుట్టును. ఆ నిప్పు వాటి నోటిచొంగపై బడి చుంయిచుంయి మనుచుండును.

అయన వర్ణనలిట్లుండును. వేట చాలవరకు వర్ణితమయ్యెను.

అడవిలో దావాగ్ని పుట్టినది. అది యెట్లున్నది?

> "చకితైణాహతి దావమాడలిత పుచ్ఛస్వల్ప గచ్ఛత్తర
> క్షుక మద్రిగ్రహణాగ్రభు భల్లుకము వక్షోభాగనిక్షిప్త డిం
> భక పల్గత్ప్లవగీ కదంబము ప్రహాంధః ప్రోద్ధిక్రోడ నా
> యక మాభీలముఖ ద్విపిద్వపటీకంబయ్యెన్ వనంబత్తరిన్ !

భయపడి లేళ్లు పారిపోవుచున్నవి. తోకలుముడుచుకొని సివంగులు వెళ్లుచున్నవి. ఎలుగుగొడ్లు కొండలకెగబ్రాకినవి. పిల్లలను బొమ్మల నెత్తుకొని అడబోతులు దూకుచున్నవి. చెలువులలోనుండి అడవిపందులు లేచిపోవుచున్నవి. పెద్దపులులు మహాభయంకరమైన మొగములతో నున్నవి. అడవి యట్లున్నది.

ఈ పద్యముయొక్క రచన సమాసభూయిష్ఠము. కాని చిక్కనిరచన. పద్యము నోటికి రావలయును.

అతడు చాలసేపు వేటాడెను. అతనికప్పుడు ఒక శకునముతోచెను. ఆ శకునమువలన నతని కొంకలాభము కలుగవలయును. అప్పుడాయడవిలో నొక మొఱ్ఱ వినిపించెను. అప్పుడొక స్త్రీ ఆర్తురాలై దుఃఖించుచు రాజుదగ్గఱకు వచ్చి యిట్లనెను.

> "ఓ రాజన్యమహేంద్ర యో మణిగణ ప్రోతాసివాతాశన
> ప్రారజ్యత్కటిచక్ర యో ముఖరశార్ఙక్రూర బాహార్గళా

యో రుక్మాచలకల్ప యో కవచితవ్యూఢాంగ కావంగదే
యో రాహుత్త శిరోమణీ నిరవధిప్రోద్యత్ప్రతాపారణీ !"

ఇది మిక్కిలి యందమైన పద్యము. ఆ సంబోధనలు మిక్కిలి రమణీయముగానున్నవి. మొదటి చరణము మరియు నందమైనది.

ఓ మహారాజా! మణిగణములచేత చెక్కబడిన పామువంటి ఖడ్గముచేత ప్రకాశించుచున్న మొలకలవాడా ! . ముఖర — మ్రోగుచున్న; ధన్సుచేత భయంకరమైన బాహువులుకలవాడా ! ఓ మేరుపర్వతము వంటివాడా ! ఓ కవచము ధరించినవాడా ! గుఱ్ఱపుస్వారి చేయువారిలో నుత్తముడా ! ఓ దివిటీవంటి ప్రతాపముకలవాడా !

ఇంతలో నామె తనకథ నిట్లుచెప్పెను :

"విసుమానములుగాగ వవతోడ పెనబెట్టి
నెట్టెమ్ముగా ప్రేగు జుట్టినాడు"

విసుమానములపగా అడ్డదిడ్డముగా; ప్రేవులతో తలపాగ చుట్టినాడు. ఎన్నో లక్షణములున్నవి.

ఇట్టి రాక్షసుడు తన్ను తఱుముకొని వచ్చుచుండెను. ఆమెపేరు మనోరమ. ఆమెతండ్రిపేరు ఇందీవరాక్షుడు. చిన్నప్పుడు చాలగారాబముగా పెరిగినది. ఆమెయొకప్పుడు చెలికత్తెలతో విహారముపోగా ఒకముసలిమునిని చూచినది. అతనిచుట్టు పుట్టవలె లేచినది. అతని ముక్కు మొగము తెలియక యీామె యతనిముక్కును మొగమును తడిమినది. అతనికి మెలకువవచ్చి అతని చేతిలోనున్న నాగబెత్తముతో చచ్చునట్లు బాదెను. బాది నిన్నొక రాక్షసుడు వెంటబడి తఱుమును నీవు వానికి పట్టుబడుదువని శపించెను. ఈమెచెలికత్తెలు ఋషినితిట్టిరి, బెదరించిరి.

"ఓయి దయావిహీనమతి యూరక యీాపసిబిడ్డ గొట్టగా
చేయెటులాడె నీకు నిది చేసినదేమి ? వృథా శపింతురే
బోయవె అడుతోడునను బుట్టవె శాపనిమిత్తమే తపం
బీయెడనున్న శాంతిపరు లేమనువారిక నీ చరిత్రకున్."

వారా ముసలిమునిని మిక్కిలి నిందించిరి. అతడు వారినిగూడ శపించెను. వారందఱకు క్షయవ్యాధి వచ్చునట్లు శపించెను.

ఆ మనోరమ యిట్లుచెప్పి రాజుతోనిట్లనెను. నాదగ్గఱ నస్త్రహృదయ మను విద్యకలదు. ఆ విద్యను మున్ను శివుడు స్వాయంభువ మనువునకిచ్చెను. ఆ మనువు వశిష్ఠునకిచ్చెను. ఆ వశిష్ఠుడు చిత్రాయుధు డన్నవానికిచ్చెను. ఆ చిత్రాయుధుడు మా మాతామహుడు. ఆయన మాతండ్రికిచ్చెను. నా తండ్రి నాకిచ్చెను. నేను నీకిత్తును, దానిని నీవు గ్రహించి యీ రాక్షసుని సంహరింపుమనెను. అంతలో రాక్షసుడు వచ్చెను. కిరాతు లందఱు పారిపోయిరి. రాజు ధైర్యముతో నిలచెను. ఇద్దరకును యుద్ధముజరిగెను. రాజు ఆ రాక్షసుని సంహరించెను. అంతనారాక్షసుడు తానొక దేవతా రూపమును తాల్చెను. పూవులవాన కురిసెను.

తరువాత నాదేవతామూర్తిగానైన రాక్షసుడు-ఆతడొక గంధర్వుడు- భూమికి దిగివచ్చి తనకథ నిట్లుచెప్పెను : "నేను నలనాభుడన్న యొక గంధర్వుని కొడుకును. బ్రహ్మమిత్రుడను వాడు శిష్యుల కాయుర్వేదము పాఠము చెప్పుచుండగా నేనుపోయి నాకుగూడ చెప్పుమనియడిగితిని. ఆయన చెప్పను పొమ్మనెను, అని నేను దాని కనర్హుడననెను. నేనును అతనినెదిరించి మాటాడితిని. కాని కృత్రిమముగా నతనిశిష్యులలోకలసి ఆవిద్యనంతయు నేర్చితిని. నేర్చినవాడను తిరిగి రావచ్చునుగదా ! చివఱకతనిని నీవు చెప్పకున్న నేమి ? నేను దొంగగా నీదగ్గఱనే చదివితినని వెక్కిరించితిని.

> "తండ్రీ ! నాకు ననుగ్రహింపఁగదె వైద్యంబంచు బ్రార్థించినన్
> గండ్రల్ గా నటులాడి ధిక్కృతులఁ బోకార్మంటి వోహో మదిన్
> దీండ్రల్ గల్గినవారి కే కరణినేనిన్ విద్య రాకుండునే
> గుండ్రాడాఁచినఁ బెండ్లియేమిటికిఁ జిక్కుంగట్టముష్టింపచా,"

ఇట్లు తిట్టితిని – ఈ పద్యము ప్రసిద్ధమైనది. చివరచరణమును సామాన్యముగా లోకమునందు వాడుకొందురు. అది లోకోక్తి-ముష్టింపచుడనగా బిచ్చగాడు. ముష్టియెత్తిన బియ్యమును వండుకొనువాడు –

అంతట నా బ్రహ్మమిత్రుఁడు కోపించి నన్ను రాక్షసుఁడవుకమ్మని శపించెను. నేనాయన కాళ్ళవ్రేళ్ళపడితిని. చివరికతడు నన్ను కరుణించి చివరకొక మహానుభావునిచేత చంపఁబడి భద్రమును పొందుదువనెను. అంత నేను రాక్షసుఁడనైతిని.

అభ్రమండలి మోచునందాఁక నూరక
పెరిఁగినక్లో మేను నరవరేణ్య
యవధిభూధర సానువందాఁక నూరక
పఱచినక్లో మేను పార్థివేంద్ర
యబ్జభూభువనంబు నందాఁక నూరక
యెగసినక్లో మేను జగదధీశ
యహిలోక తలమంటునందాఁక నూరక
వడినయక్లో మేను ప్రభువతంస

యఖిలజగములు మ్రింగునం తాఁకలియును
నబ్ధులేడును జెడఁగ్రోలునంత తృషయు
నచలచాలనచణమైన యదటుఁగలిగె
నసురభావంబు నను జెందు నవసరమున.

రాక్షసుడైనప్పుడట్లైనాడట ! ఇది యొక యాశ్చర్యమైన పద్యము. రాక్షసుడగుట యేమిటో యెట్టిదో ? వాని యనుభూతి యెట్టుండునో వాని లక్షణమేమో దీనిని విచిత్రముగా నూహించి పెద్దనగారీ పద్యమును వ్రాసిరి. ఇట్టి విషయములలో చేసిన యఖండమైన యూహ యొక మహాకవిని చేయును. ఏ యూహయు లేక ఏ యుదాత్తమైన కల్పనయు లేక, ఊరక కవులగుచుండి, మహాకవుల యొక్క కల్పనలు చదువుటయందు కూడ నశ్రద్ధ వహించి వారిని తిట్టెడివారికి నివి తెలియవు.

అతడూళ్ళమీదపడి తిన నారంభించెను. తన యీ కథయంతయు రాజుతో చెప్పెను. ఈ మనోరమ నా కన్నకూతురు. దానిని తినుటకే నేను ఇట్లు వెడలితిని. అని యాగంధర్వుడు మనోరమను స్వరోచికిచ్చి పెండ్లి చేసెను. వారికి పెండ్లి యైనది.

వారిద్దరికి స్వారోచిషు డన్న మనువు పుట్టెను. అతడు పెద్ద తపస్సు చేసెను. చివరికతడు మనువయ్యెను.

ఈ మనుచరిత్రలో చివర దశావతారస్తోత్ర ముండెను. ఆ పద్యము లన్నియు జాగ్రత్తగా చదువవలయును.

అందులోని యొకపద్య మిది :

"కొలుతుఁ దాదృగ్భవద్బాహువు కులిశయష్టి
నెద్ది గిరివోలెఁ గడుపులో వృద్ధిఁబొందఁ
బగిలి రాకాసిదేహంబు మొగపు ముత్య
మయ్యె ముంగాముురారి రంగె మురారి."

శ్రీకృష్ణుడు కేశియను రాక్షసునిచంపెను, వానినోటిలో తన చేయి దూర్చి కడుపులోనికి పోనిచ్చి యాచేతిని తెగఁయుబ్బించెను. వాని పొట్ట పగిలెను. వాడు చచ్చిపోయెను. అట్టి నీ చేతిని సేవింతును మురారి! ఓ కృష్ణమూర్తి! అటువంటి నీ చేయియను వజ్రాయుధమును కొలుతును. ఏచేయి వాని కడుపులో వృద్ధిపొందగా ఆరాకాసి దేహముపగిలి నీ ముంజేతి కా శరీరము కంకణమై మొగపు - రత్నము మొదలైనవాని ముందటి భాగము - 'మొగపూస' అన్నశబ్దములో మిగిలినది. మొగపుముత్యము - రత్నము ముందున్నముత్యము. రాకాసిదేహ మిట్లైనది. ఈయన చేయి వజ్రాయుధమువలె నున్నది. వజ్రాయుధము రత్నము. దాని ముందున్న ముత్యముగా రాకాసిదేహమైనది.

ముంగాముురారి—ముంజేతి కంకణము—అనగా స్వామియొక్క చేయి బ్రహ్మాండముగా పెరిగి ఆ కేశియన్న రాక్షసుని శరీరము మిక్కిలి స్వల్పమై యీచేయి వజ్రాయుధమువలె నుండి దాని శరీరము ముత్యమైయొప్పెనని యర్థము. 'ముంగాముురారి'యనగా ముంజేతికంకణముకదా! ఆ శబ్దమునకు 'రంగై' 'మురారి'—ఈ రెండుశబ్దములనుకలిపి మురారిని సంబోధనచేసెను.

# పాండురంగ మాహాత్మ్యము

కళింగదేశాభరణమైన పీఠికాపురమను పట్టణమునందు సభాపతియన్న యొక యగ్నిహోత్రి యుండెను. అతడు గొప్ప పండితుడు. అతనికొక కుమారుడు కలిగెను. ఆ కుమారుని పేరు నిగమశర్మ. అతడు గొప్ప యందగాడు.

ఆతనికి నూనూగు మీసాల వయసువచ్చినది. ఆతడు మిక్కిలి చదువు కొన్నవాడు. అతడు స్త్రీలోలు డయ్యెను. జందెమును లెక్కచేయడు. తెల్లబట్టలే కట్టుకొనును. ఎప్పుడును తాంబూలము నమలుచుండును. వారు ధనవంతులు. ఈ నిగమశర్మ సఖులును, పరిహాసకులును వెంటరా నూరివెంట విహారము చేయును. అతనికి పెండ్లియైనది.

ఉష్ణాని హోమాగ్ని నూఁదనొల్లఁడుగాని
విరహజ్వరార్తుఁడై వెచ్చనూర్చు
సంధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింపఁడుగాని
యెరఁగు నీర్ష్యాకషాయితల కర్థి
నాగమవాదంబు కాఁగా దనఁడుగాని
విటవాదములుతీర్చు వేగిలేచి
కంబుభృత్పాదోదకంబు గ్రోలఁడుగాని
యౌవతాధరసీధు వానిచొక్కుఁ

బుణ్యచిహ్నంబు లపఘనంబున ఘటింప
సిగ్గుపడుఁగాని కరనఖ శిఖరలిఖిత
జాతరూపక్షతాంకముల్ సమ్మతించు
నారజముమీరి యాదుర్విహారహారి.

హోమాగ్ని — హోమముచేసెడు వహ్ని: విరహజ్వరము—ప్రేమించిన స్త్రీని యెడబాసి యుండలేక పడెడుబాధ; సంధ్యకు ప్రార్థనాంజలి — సంధ్యా వందనము; ఈర్ష్యా కషాయిత — కోపమువచ్చిన భార్య; ఆగమ

వాదములు — వేద వాదములు; కంబుభృత్ పాదోదకములు - పూజచేసిన తరువాత శంఖములోని తీర్థము; యావతాధర సీధువు — యావతము — యువతుల సమూహము; సీధువు — కల్లు; అపఘనము — శరీరము; కర... క్షతాంకముల్ — చేతి గోళ్ల యొక్క కొనలచేత వ్రాయఁబడిన నొక్కుల యొక్క గుర్తులు. ఆరజము — ఇష్టము.

నిగమములనగా వేదములు. వాని పేరు నిగమశర్మ. వాని పేరు నేతిబీరకాయవలె నయ్యెను.

తాత తండ్రు లార్జించిన యాస్తియంతయు భోగము పేటలో వ్యయ పెట్టుచుండెను. తన మేని సొమ్ములు తాకట్టుపెట్టును. తల్లి నేడ్పించి యామె నగలు తీసికొనును. తండ్రియొక్క పత్రములు దొంగిలించును. దుష్టపు వడ్డీలకు పత్రములు వ్రాయును. చివరకు ఋణదాతలు బాధపెట్ట జొచ్చిరి. అతనికి గ్రామములో మర్యాదపోయెను.

ఇతనివార్త యతని యక్కగారికి తెలిసి తమ్ముని దిద్దుకొందమని యచ్చటికి వచ్చెను. ఆమె హఠాత్తుగా వచ్చిన తమ్ముని కతని భార్యచేత సేవచేయించి తలంటిపోయించి మంచిబట్టలు కట్టించి, తమ్ముని కూర్చుండ బెట్టి యిట్లుచెప్పెను:

ప్రారంభించిన వేదపాఠములకున్ ప్రత్యూహమౌనంచునో
యేరా తమ్ముడ! నన్నుఁజూడ చనుదే వెన్నాళ్లనోయుండి చ
క్షూరాజీవయుగమ్ము వాచినది నిన్నర్గోకున్కి మీబావయున్
నీరాకల్ మదిగోరు చంద్రుపొడుపున్ నీరాకరంబుంబలెన్.

ఇది ప్రసిద్ధమైన పద్యము. ప్రత్యూహము — విఘ్నము; చక్షుః — రాజీవయుగము; - చక్షూ రాజీవయుగము; (ఇది సంస్కృత విసర్గ సంధి. ప్రాస నిట్లదుకుట పద్యమున కొక యందము.) చక్షూరాజీవయుగము — తామర పూవులవంటి రెండుకనులు; నిన్ను చూచుటకు నా కనులు వాచి పోయినవని యర్థము. చంద్రుపొడుపు - చంద్రోదయము; నీరాకరము - సముద్రము; చంద్రోదయముకు సముద్రమువలె మీబావ నీరాకను గోరును. "రాక"కు రెండర్థములు — ఒకటి వచ్చుట; రెండు పున్నమి; ఈ శ్లేషచేత ఉపమానోప మేయములు రెంటికిని సరిపోవుచున్నది.

పరమేష్ఠినుండి నీతరముదాఁక విశుద్ధ
తరమైన వంశంబుఁ దలఁచవైతి
దలఁబ్రొక్కియున్న యీతల్లి తండ్రులఁ జాల
పలుచవై సంతోషపరచవైతి
నగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన యిల్లాలి
నిల్లాలితాకార నొల్లవైతి
ధర్మశాస్త్రార్థ విత్తముల విత్తములచే
నలరించి విఖ్యాతినందవైతి

శీల సుఖలంబు నిదిపిల్లి శీలమనుచుఁ
జనవ్రుతివియెల్లఁ జిక్కుల చదువులనుచుఁ
దోడవారలు నవ్వ నాతోడ! యేల
జెడనైతివి యీ గుణంబేల నీకు.

పరమేష్ఠి – బ్రహ్మ; పలుచ – ఎందుకు పనికిరానివాడు; ఇల్లాలితాకార – ఈ అందమైన ఆకారము కలది; పిల్లిశీలము – దొంగతనముగా నదియు నిదియు నెత్తికొనిపోవుట; నాతోడ! – నా తమ్ముడ.

ఈ పద్యములో తరముదాఁక విశుద్ధతరమైన; పలుచవై సంతోష పలుచవు; ఇల్లాలి ఇల్లాలితాకార; విత్తముల విత్తములచే; మొదలయిన యమకముచేత పద్యమునకెంతో యందము వచ్చినది. ఆ యమకము భిన్న చరణములలో భిన్న స్థలముల యందుంచుటచేత యమకమువలె కాకుండ పద్యముయొక్క చమత్కారమువలె నున్నది.

"నాదు సహోదరుండు సుజనస్తవనీయ నయప్రసక్తిఁ బ్ర
హ్మాదుల మెచ్చఁ డే నతనియజ్ఞమునం గడుఁ బూజ్యురాలనై
వేది యలంకరింతునని వేవురిలోపల నాడుకొందు నీ
వేదియులేక సర్వగుణహీనుఁడవౌట యెఱుంగఁ దమ్ముడా!

ఒకడు యజ్ఞము చేసినచో నతని యప్పగారిని ఒక పెద్ద పీటమీద కూర్చుండఁబెట్టి పూజ చేయుదురన్న యొక వైదికాచారము దీనివలన తెలియుచున్నది. అది యీ పద్యములోని సొగసు.

ఈ రీతిగా నక్కగారుచేసిన హితమును వాడు మన్నించినట్లుగా మన్నించెను.

ఈ గ్రంథములలో ప్రసిద్ధములైన రెండు మూడు కథలలో నిగమశర్మో పాఖ్యానమొకటి. అక్కగారువచ్చి తమ్మునికి హితోపదేశము చేయుట సామాన్య సంసారములలోనే యొక యాచారము. సామాన్య జీవితములోని యొక ఘట్టమునకు ప్రాధాన్య మిచ్చినట్లు మన్నింతురు. తమ్మునికామె హితోపదేశము చేయకముందు నామె కూర్చున్న పద్ధతి నితడు వ్రాసెను.

"కుడివలన నింతయోరగా కొమరుమెఱసి
బిడ్డ చనుద్రావ నిట్లను బిసరుహాక్షి."

ఆమె తమ్మునికి తల ద్రువ్వుచు తలలోని యీరు ఈరుపెనతో లాగి చిట్లించుచు తన మరదలు తనకు తమలపాకు లందించుచుండగా ప్రక్కన బిడ్డ పాలు త్రాగుచుండగా తమ్ముని కీమాటలు చెప్పెనని యున్నది. ఇది సామాన్య సంసారములలోని శోభ. దీనికొఱకు నీ ఘట్టమును భావుకులు మెచ్చుకొనుట కలదు.

అతడు కొన్నాళ్లు సరిగానే యుండెను. తరువాత నొకనాటి రాత్రి యింటిలోనున్న సంపదనంతయు దొంగిలించి తల్లినగలు భార్యనగలు మూటగట్టి అర్ధరాత్రమున నడవినపడి పారిపోయెను. ఇంటిలో నందఱు మరునాటి ప్రొద్దున లబోయిలు దిబోయిలు.

కాని యా రాత్రిపూట దొంగలు వానిని బాణములతో కొట్టిరి. వాని యొడలంతయు పెద్ద పెద్ద గాయములయ్యెను. వాని ప్రాణములు మాత్రము మిగిలెను. దొంగలు వానిని దోచికొని పారిపోయిరి.

మరునాడు వానినొక కాపుకొడుకు చూచెను. వాని నింటికి దీసికొనిపోయి రక్షించెను. వానికి వైద్యము చేయించెను. ఈ నిగమశర్మ తన దుష్ట చరిత్రమునుదాచి తానొక సత్పురుషునివలె తాను దొంగల పాల బడ్డట్లు ఆ కాపు కొడుకుతో చెప్పెను. ఆ కాపుకొడుకు నమ్మెను.

వారిద్దరికి స్నేహమయ్యెను. ఇతనికి నెమ్మదించెను. వారియింటిలో నొక కోడలున్నది. ఆమె కొన్ని వికారచేష్టలు కలది. వీరిద్దఱికి సంబంధము కుదిరెను.

తలపుండ్లు గడిగించి తను బ్రతికించెగా
నడవి చోరాహతుండైనఁ దెచ్చి;

మొదలైన భావములులేక నామె నంటఁ్రకాగెను. ఆమె మగని పజ్జ పండుకొనియుండి యితనిని గూర్చియే యాలోచించును.

పొన్నాకుపై తేనె సన్న చంద్రిక మోవి
మాధుర్యమనక వేమాఱుఁబొగడి
యామని బుగబుగలంగ చంపకదామ
గంధంబనక పెక్కుగతులనెన్ని

యిది యింకొక పద్యము. అతడామెనుగూర్చిచేసిన వలపోత. మొదటి చరణములోని పలుకబడి గొప్పది.

మోవి మాధుర్యము, పొన్నాకుపై తేనెవంటిదట. నిలువదు.

సామాన్యముగా నాంధ్ర సారస్వతమున ప్రసిద్ధములైన పద్యముల ప్రసిద్ధియంతయు నొక పలుకుబడిమీద, ఒకమాట మెలపుమీద, ఏదోయొక విలక్షణమైన సాహిత్య ప్రక్రియమీద నాధారపడి యుండును. ఈ పద్యము యొక్క ప్రసిద్ధి చరణముమీద నాధారపడి యున్నది.

నిగమశర్మ యాకాపు పడుచును లేవదీసికొని పోవలయునని యెదరు వేచియుండెను. ఆ యూరిలో నొక జాతరచేసిరి. చీకటి పడినది. వాడామెను లేవదీసికొనిపోయెను. ఆ కాపుకోడలు కంచెయంత కాపురమును పాలవంటి కులమును పాడుచేసికొని లేచిపోయెను.

వారిద్దఱును నొక పల్లెచేరి బోయవారిలో కలిసిపోయిరి. వారు కల్లుత్రాగుట, వేటాడుట, అడవులలో తిరుగుట.

వారదియొకమోస్తరయిన కాపురమును సాగింపజొచ్చిరి.

కొన్నాళ్లకీ కాపుకోడలు చనిపోయెను. అంత నిగమశర్మ యొక మాల స్త్రీని పెండ్లామెను. ఆమెయందు వారికొక కుమారుడుకూడ పుట్టెను. ఈ సంసారము కొన్నాళ్లుసాగెను.

ఒకనా డతడు కుక్కలు వెంటరా నడవిలోనికి వేటకు వెళ్లెను. పవ లెల్ల వేటాడి రాతిరికితిరిగి వచ్చువేళకు వానియిల్లు దగ్ధమై యుండెను. పెండ్లాము, కొడుకు పరిజనమునందఱు నింటిలో తగులబడిపోయిరి. వాడు మూర్ఛపోయి మరల మేల్కాంచి యిట్లు దుఃఖించెను.

> "ఎల్లఱు నెల్లచోధనములిచ్చి మృగాక్షులఁ గొంద్రుగాని యో
> పల్లవపాణి! యేఁబరమపావన వంశమునిచ్చికొంటి నీ
> నల్లనిరూపు నిక్కమనినమ్మి ధ్రువంబదిగాక నేఁడు వి
> ద్యుల్లతికాధికాభినయధూర్వహమౌట యెఱుంగనింతయున్."

ఇతఁడు తన బ్రాహ్మణ్యమును కామమునకు వెలకట్టెను. తనవంశము నిచ్చి దానిసౌందర్యమును కొన్నాడట! నిక్కమని నమ్మినాడట! ఈమాటలో నెంతయో యర్థమున్నది. ఏది నిక్కమని నమ్మినాడు ? ఆమె సౌందర్యము నిక్కమని నమ్మినాడా ? కులముకంటె యౌవనము కామభోగము నిక్కమని నమ్మినాడా? కామ ప్రవృత్తియే ప్రధానముగాని తక్కిన వానికి ప్రాధాన్యములేదని నమ్మినాడు కాబోలు! ఈ యొక్క మాటయు పలు మందిజీవుల పెడతల యూహాలను వ్యాఖ్యానము చేయుచున్నది. దీనిని సరిగా గ్రహించినచో పలుమంది యాధునికులు బాగుపడవచ్చును. ఆమె నల్లనిరూపు చివరకు విద్యుల్లతికాధికాభినయధూర్వహ మైనదట. మెఱుపు తీగకంటె నెక్కువైన యభినయ భారమును వహించినదని యర్థము. ఒకటి : నిమిషములో నంతరించిపోయినదని; రెండవది : మెఱుపు తీగ వచ్చినంతనే కనులు మిఱుమిట్లుగొని వెంటనే చీకట్లుగొనును. దాని శరీరముయొక్క నల్లదన మట్లున్నదని—

> "ఈ కడజాతినాతికిహీహీ! మహిదేవుడు చిక్కెనంచు నన్
> రాకకుఁబోకకుఙ్ జనపరంపర కెంపగుచూడ్కి జూచి యం
> బూకృతమాచరించుటకు బుద్ధిఁదలంకకలంకముక్త చం
> ద్రాకృతిఁబోల్చు నీముఖమునం దమృతస్థితిఁగాంచి మించుటన్."

ఈ పద్యముగూడ చాల ప్రసిద్ధమైనది. ఈ పద్యముయొక్క సౌందర్యము కూడ విలక్షణమైన యమకముమీదనే యాధారపడి యున్నది. ఇహిహీ— మహిదేవుడు. రాకకు—పోకకు, పరంపర—కెంపగు; తలంక — కలక;

అంబూకృత మాచరించుట – ఉమ్మివేయుట; తలంకన్ – భయపడును; కలంకముక్తచంద్రాకృతి – మచ్చచేత వదలిపెట్టబడిన చంద్రుని యాకారము.

ఇతడిట్లేడ్చి యేడ్చి యా పెండ్లము బిడ్డలను చూడకుండ తినలేను త్రాగలేనని యడవిలో బడిపోవును. నడువలేక క్రిందపడిపోవుచు మరల లేచుచు, అట్లే పెక్కుదినమ్ము లనేక యోజనమ్ములుపోయి చిట్టచివరకు పుండరీక క్షేత్రమును చేరెను. అక్కడ క్షేత్రములో తీర్థములో స్నానమాడెను. స్వామిని చూచుచుండెను. వానికి రెప్పమూతపడుటలేదు.

ఒకయింత ఱెప్పవేయక చూచు బెఱవారి
దలగొట్టుకొని దుఃఖ జలధిమునుగు
ఖిలము తెఱవుమంచుఁ బృథివిలోఁ జొరబాఱు
సమధిక స్తంభోద్భవము గమించు
తిరియువాఁడనుఁబోలె దెసలకుఁ జెయిచాచు
దొరఁగు నస్రాంబుధిఁ దొప్పఁదోగు
హా! పోయితే; యనియఱచు భార్గ్యగుఱించి,
బహువిధాసక్తి విభ్రాంతిఁబొందుఁ
జేరగారాని దర్శనస్థితి వహించు;
బాడబస్ఫూర్తి లోఁ గొన్నసగిదినుండు
దానవారాతి కాఁబూని తపవతార.
దళకమును మున్నెఱాల్చె నా ధరణిసుపుడు.

ఇతడు పూర్వపుణ్య ఫలముచేత నెన్నిపాపములు చేసినను వికుంఠపురమునకు పోబోవుచున్నాడు.

భక్తులు సారూప్యమును పొందుదురు. భగవంతుని కేరూప మున్నదో ఆ రూపమునుపొందుట సారూప్యమనిపేరు. ఈ పద్యములో విష్ణుమూర్తి యొక్క దశావతారములు వాని దుఃఖము యొక్క స్థితితో శ్లేషగా చెప్పఁ

బడినవి. మొదటిది మత్స్యావతారము. పెలవారిన్ ఱెప్పవేయక చూచు - పెలలుపెలలుగావచ్చు నీటియందు చేపఱెప్పవేయక చూచును. ఇతడు ఇతరులను ఱెప్పవేయక చూచును. ఇది మత్స్యావతారము.

తలకొట్టుకొని దుఃఖజలధి మునుగును. కూర్మావతారము. తాబేలు తలను లోపలకు లాగుకొని కఠినమైన సముద్రములో మునుగును. ఇట్లే తక్కిన యవతారములుగూడ. తిరియువాడు - బిచ్చగాడు; అస్రాంబుధి - 1. సముద్రమువంటి కన్నీళ్లు, 2. పరశురామావతారము.

'చేరగారాని దర్శనస్థితి వహించు.'

వానియూహ యెవడును పొందలేడన్నట్లున్నాడు.

దర్శనములారు. షడ్దర్శనములు. అందులో బౌద్ధదర్శనమొకటి. అది చేరగారానిది. అనగా శూన్యమనియర్థము.

దానవారాతి - విష్ణువు;

ఇట్లు వాడు చనిపోయెను. వానిని తీసికొనిపోవుటకు యమభటులు వచ్చిరి. వాడు పెద్ద మొఱ్ఱపెట్టెను. అదివఱకే యమభటులు వానిని పాశములతో బంధించిరి. ఆ మహాపవిత్రక్షేత్రమున పూర్వము భగవంతుడు తన చక్రాయుధమును రక్షగానుంచెను. ఆ చక్రాయుధమువాని మొఱ్ఱవిని వాని బంధములను త్రెంచ్చెను. యమభటులు పారిపోయిరి.

అప్పుడు విష్ణుభక్తులువచ్చిరి. వారు వీనిని గరుత్మంతునిమీద నెక్కించి తెల్లదీవికి తీసికొనిపోనారంభించిరి. అప్పుడు :

ఉత్తాలఫణి ఘుగ్గరుత్తాల వృంతాని
లాశాంత ఘర్మాంబువయ్యె మేను
ప్రత్యగ్రముక్తా తపత్త్రీభవ చ్ఛేష
వారితాతపమయ్యెఁ జారుమౌళి
సూత్రవతీశదోర్వేత్ర దత్తావకా
శామరంబయ్యెఁ గటాక్షవిహృతి
భృగుభరద్వాజ ప్రభృతికృత స్వస్తి వా
గ్భరముఖరములయ్యెఁ బార్శ్వతలము.

లరుణకిరణ సహస్రాభ మభ్రగంబు
నగు విమానంబుపై నెక్కి నిగమశర్మ
తీంద్రఁబుద్ధీశు కోదండు తండ్రిఁబోలి
పరమధామంబునకుఁ బోవుపథమునందు.

ఆజానుదీర్ఘంబులై హారిన్మణిమయ
స్తంభంబులకు కులస్వాములగుచు
దివ్యగంధముల నుద్రేకించి విద్యుదం
కురరేఖలకు జోడు కోడెలగుచుఁ
దలచుట్టుఁదిరిగి రాఁగలిగి పాండుర పద్మ
పత్రంబులకుఁ బ్రాణబంధులగుచు
సకలంబు వెలిగింపఁజాలి బాలార్క బిం
బములకు ననుబింబపంక్తులగుచు
నాల్గుచేతులు గాంచన నలిన మాలి
కలు వెడఁద కన్నులాస్య ప్రభలుచెలంగఁ
గుముదుఁ డను పేరఁ బరమేశుఁగొలిచి నిలిచి
యున్నవాఁ డాతఁడిప్పుడు నో మునీంద్ర !

ఆంధ్ర సారస్వతములో నీ పద్యముల కివియేసాటి. ఇట్లే యితర మహాకవులలోకూడ కొన్ని పద్యములుండును. వానికవియే సాటియని చెప్పదగిన పద్యములు. అనగా నా సందర్భములో నట్లు మరియొకడు వ్రాయలేడని యర్థము. మరల ఆ కవియే అట్లింకొకచోట వ్రాయలేడని చెప్పవచ్చును.

నిగమశర్మ సారూప్యమును బొందెను. శ్రీమన్నారాయణునితో సమానమైన రూపమునుపొందెను. అతని మేను (శరీరము) —

ఉత్తాల - ఉన్నతమైన, ఫణిభుక్ - గరుత్మంతునియొక్క, గరుత్ - ఱెక్కలనెడి: తాలవృంత — విసనకఱ్ఱలవలని; అనిల—గాలిచేత; ఆశాంత — చక్కగా చల్లబడిన; ఘర్మాంబువు - చెమటనీరుకలది అయ్యెను.

ప్రత్యగ్ర—క్రొత్తదైన; ముక్తాతపత్త్రీభవత్—ముత్యాల గొడుగువలె చేయఁబడిన; శేష — ఆదిశేషునిచేత; వారిత — అడ్డగింపబడిన; ఆతపము — ఎండకలది; చారుమౌళి—అతని అందమైన శిరస్సు; అయ్యెన్—ఆయెను.

సూత్రవతీశుఁడు — విష్వక్సేనుడు: దోః — చేయి; కటాక్షవిహృతి— కడగంటిచూపుయొక్క విహారము.

ఈ పద్యములో మొదటిచరణమున ఉత్తాలగరుత్తాల—అన్నశబ్దములచేత చేయబడన యమకము లోకోత్తరముగనున్నది. సమాసముల కూర్పును ఇతరులు చేయలేనిది.

ఇతఁడు పరమేశ్వరునివద్ద కుముదుడను పేరుతో పార్శ్వచరుఁడుగా నుండెను. అతనికి నాల్గుచేతులు. అవి ఆజానుదీర్ఘమ్ములై హరిన్మణిమయ స్తంభమ్ములకు కులస్వాములుగా నున్నవట! నాలుగుచేతులు బంగారు తామర పూమాలలు, వెడదకన్నులు. మొగమునందలి కాంతులు — ఇందు క్రమాలంకారము.

ఇతడు భగవంతునివద్దనున్న పార్శ్వచరులలో శ్రీమన్నారాణునకు మిక్కిలి ప్రియుడయ్యెను.

ఇది యొకకథ. ఈకథ యింత యందముగా వ్రాయబడినది.

ఒకకథ అందముగా వ్రాయబడుట వేఱు. ఆ కథయొక్క యౌచిత్యము యొక్క స్వరూపము వేఱు. మన పురాణములయందు నిట్టికథలు చాలగలవు. ఒక డనేక పాపములుచేయును. చివరికాలములో భక్తుడగును. వాడు మోక్షమునకు పోవును. ఈ కథ అంతకంటె చెడ్డది. వీడు భక్తుఁడుకూడ కాలేదు. ఆ క్షేత్రమునందు చనిపోవుటవలన వీడు వైకుంఠమునకు పోయెను.

మతమిట్లయినచో సృష్టికి చాలనష్టము. ఎవడును మంచి ప్రవర్తనతో నుండవలసిన యవసరము లేదు. ఇట్టి సిద్ధాంతములు సంఘములోని శాంతికి చాల యపాయమును గలిగించును. వాడు చేసినన్ని పాపములు చేయును. చివరకు భగవంతుఁడా! నన్ను రక్షించుమనును. ఆ భగవంతుడు

రక్షించునా ? బ్రతికి నన్నాళ్లు సాధువుగా బ్రతికి సత్కారములుచేసి బ్రతికిన వాడు మోక్షగామికాడు. పీడగును. ఇది న్యాయముగాలేదు. అందుచేత నిచ్చట నొక పద్యమున్నది.

చేరువచేరువై కడుఁబచేళిమమై తనుడాయుపూర్వ సం
స్కారతపః ఫలంబున భజద్వృజినావళి నాశకృన్నృ కం
ఠీరవ దేవనిత్య స సంగమ తీర్థరాజ వా
ర్ధారలనాడి తత్పరమధామపతిన్ బలుమాఱుఁ జూచుచున్.

ఈ నిగమశర్మ పూర్వజన్మలయందు బహు తపస్సు చేసినవాడు. ఆ తపస్సు పచేళిమమై - పక్వమై; వానికి మిక్కిలి దగ్గరగా వచ్చినది. ఎట్లు పరిపక్వమైనది? ఈ జన్మలో కాలేదు. అనగా వాడుచేసిన తపస్సు ఫలానా అప్పటికి ఫలించునని వ్రాయబడి యున్నది కాబోలు ! ఇది యొక లాటరీ వంటిదో ! ఆనాటివరకు బిచ్చగాడు. ఆనాడు వానికి రెండు లక్షలువచ్చెను.

భగవంతుని లక్షణమే యిట్లుండగా రాజ్యములు లాటరీమీద నాధార పడుటలో తప్పేమి యనిపించును.

ఇంతకుమించి యొకయూహా చేయవచ్చును. ఈ నిగమశర్మ యా మాలెతను పెండ్లియాడు వరకు దుష్టుడే ! ఏకాగ్రత లేనివాడు. మాలెతను పెండ్లియాడిన తరువాత వానికేకాగ్రత వచ్చినట్లున్నది. ఏకాగ్రత యనగా మానవజన్మ యెత్తిన తరువాత పరమార్థ భూతమైన లక్షణము. వాడు ఆ పెండ్లము బిడ్డలు కనిపించకుండ నేను త్రావను తినినని కూర్చుండెను. అట్టి స్థితి పరమయోగి లక్షణము. వాని కదియే కావలయును. ఇంకొకటి యక్కరలేదు. దీనినే భాగవతమున " కామోత్కంఠత గోపికల్ " మొద లైన పద్యములో చెప్పిరి.

ఇందులో నింకొక విషయమున్నది. ఈ నిగమశర్మకు ఏకాగ్రత కుదిరినది కాని, ఆ యేకాగ్రత భగవంతునిమీద కుదరలేదు. ఆ యేకాగ్రత విషయము వాని భార్యయు, పిల్లలును. వారిని తీసివేసి భగవంతు నచ్చట నిల్పినచో వాడు ముక్తుడగును. మన పురాణముల యందలి పలుకథ లిట్టివి.

ఇట్లుండగా మరి వీనికి వైకుంఠమున చేరుట ఎట్లు సంభవించెను?

ఇది పాండురంగ మహాత్యము. పుండరీక క్షేత్రముయొక్క మహాత్యము.

ఒక కాలము ఒక దేశము పవిత్రములై యున్నవి, ఏకాదశి, శివరాత్రి, మొదలయిన దినములు పవిత్రములుకదా! ఆ దినములలో చనిపోయినవాడు ఉత్తమగతులకు పోవునని మనవారు చెప్పుదురు. అది కాలము.

రెండవది దేశము. ఆ దేశమునందే క్షేత్రములని నిరూపింపబడినవి. తిరుపతి మహా క్షేత్రమున్నది. అక్కడ నున్నది నారాయణునియొక్క యవతారము. ఎన్నిచోట్ల విష్ణ్వాలయములు లేవు? ఆ దేవతలు పేదవారేమి? ఈ వెంకటేశ్వరస్వామి యింత ధనవంతుడేమి? ఇది దేశమహిమ యనగా క్షేత్రమహిమ యనగా. ఆ క్షేత్రముయొక్క మాహాత్మ్యమటువంటిది. ఇది ప్రత్యక్షముగా కనిపించుచున్నది. మోక్షముపచ్చుట అప్రత్యక్షమైన విషయము. కొందఱ్ ప్రత్యక్షమును చూచి అప్రత్యక్షము నంగీకరింతురు. కొందఱు ప్రత్యక్షము నంగీకరింతురు. అప్రత్యక్షము నంగీకరింపరు. ఎవరి కర్మ వారిది. నిగమశర్మ కర్మ నిగమశర్మది. అతడు పూర్వ సంస్కార తపఃఫలంబున కుముదుడయ్యెను.

## అయుత నియుతోపాఖ్యానము

పూర్వము వింధ్యపర్వతము మేరు పర్వతముతో స్పర్థవహించి పెరుగ మొదలుపెట్టెను. నక్షత్రములు మొలపూసలుగ పెరిగెను. అంతకుపూర్వమే కాశీ మహా నగరమునందు అగస్త్యమహర్షి వేయిమంది శిష్యులతో కాపురముండెను. ఆయనవద్ద ఆ వేయిమందిలో నిద్దఱు శిష్యులు కలరు. ఒకని పేరయుతుడు, రెండవ వాని పేరు నియుతుడు. ఆ శిష్యులన్నచో నగస్త్య మహర్షికి చాలప్రేమ. వారినిగూర్చి యగస్త్యమహర్షి యిట్లనుకొనెను.

వాసోనిగ్రహమెన్నరా కలియు నీర్వట్టుంగణింపర్ తలల్
మూసెంగాయన రంగముల్ బడలినన్ జాటింప రట్లుండ నీ
యాసాయమ్ముగనానిశాశ్వతముగానామ్నాయముల్ గ్రోల్చుచో
నాసీన ప్రచలాయితంబయిన లేదాహా! వితర్కింపగన్ –

వాసోనిగ్రహము — వాసస్సు — వస్త్రము. నిగ్రహము – అడ్డగించుట; అనగా కట్టినగుడ్డనుగూర్చి విచారించరు; నీర్వట్టు — దప్పిక;

ఆసాయమ్ముఁగ - సాయంకాలము పర్యంతము; ఆనిశాత్యయముఁగా- తెల్లి వాఱు వరకు; నిశయొక్క అత్యయము - నిశయొక్క నాశనము అనగా తెల్లవాఱుట; ఆమ్నాయములు - వేదములు; క్రోల్చుచోన్ - వర్ణించుచో;

ఆసీన ప్రచలాయితము - కూర్చున్నచోటినుండి కదలుట.

ఇదియొక గొప్ప పద్యము. శబ్దముల కూర్పుచేత రామకృష్ణుని తీవిని వెలార్చుచుండును.

అగస్త్యుడు వారిద్దరకు పెండ్లి చేయవలెనని నిశ్చయించి బ్రహ్మ దేవునికడ నిద్దరు కూతుండ్రు గలరనివిని యాయన దగ్గరకు పోయెను. ఆ బ్రహ్మదేవుడు అగస్త్యుడిట్లు వచ్చుటకు సంతసించి అగస్త్యుని స్తోత్రము చేసెను.

"హుంకారములులేవె యుపపురందర హాఠ
 త్పాటనంబునకుఁ జాల్పడవుగాక!
భ్రూభంగములులేవె యాభీల వింధ్యగ
 ర్వ స్తంభనమునకు రావుగాక !
చులుకాకృతులులేవె జలరాశినిశ్శేష
 శోషణక్రీడకుఁ జొరవుగాక !
జాఠరాగ్నులులేవె జటతాపి వాతాపి
 తనుదాహమున నెదుర్కొనవుగాక !
నిష్ఠ నీమాడ్కి లోకప్రతిష్ఠగుఱిచి
దుష్టనిగ్రహ శిష్టసంతుష్టిహేతు
రోషభీషణ రేఖానిరూఢగాఢ
లీలఁగ్రీడించు ప్రోడలు లేరుగాక.

ఇదియు నొక యాశ్చర్య కరమైన పద్యము. అందఱును హుం అందురు. ఏమి లాభము? అగస్త్యుడు హుం అనగా ఉపపురందరుడు నహుషుడు పెల్లగింపబడెను.

భ్రూభంగములు - కంటిబొమ ముడులు; అనగా కోపచిహ్నములు చుళుకము - పుడిసిరి; జఠరము - పొట్ట; జాఠరాగ్ని - క్షుధాగ్ని

ఆ యిద్దఱు కూతుండ్ర పేర్లు- ఒకామె పేరు గాయత్రి, రెండవ యామె పేరు సావిత్రి. అగస్త్యుడు వారిద్దఱిని తనవెంట తెచ్చెను. తన శిష్యుల కిద్దరకును చూపించెను.

అయుతుడు పెండ్లి కొప్పుకొనలేదు. నియుతు డొప్పుకొనెను. అగస్త్యు డాయిద్దఱు బాలికలను నియుతునకేయిచ్చి పెండ్లిచేసెను.

అగస్త్యున కయుతునిమీద కోపమువచ్చెను. వానిని వెడల నడచెను.

అయుతుడు గురు గృహామునుండి వెడలిపోయి తాను దుఃఖింప నారంభించెను.

"ఉర్వీధరము లెక్కియుఱుకనే కుచకుంభ
యుగమొల్లఁగాక తానుఱుకుమనిన
వాఁడి కైదువులపై వ్రాలనే నిడుచూపు
వాలొల్లఁగాక తా వ్రాలుమనిన
మున్నీట సుడివడి మునుఁగనే నతనాభిఁ
గ్యనొల్లగాక తా వ్రాలుమనిన
జెప్పిగురుఁడేమి పనిచినఁ జేయలేనె
కావె తనసొమ్ము మామక కాయకర్మ
గతులు మొట్టోయనంగ లింగంబుగట్టు
జంగమన నంగనలఁగూర్ప జనదుగాక.

వాఁడికైదువులు - పదునుగల కత్తులు. ఈ పద్యములో ఉక్తివైచిత్ర్యము కలదు. స్త్రీలయొక్క కుచములు కొండలతో, చూపులు కత్తులతో, బొడ్డు సుడిగుండముతో, నూగారు పాముతో కవులు పోల్తురు. దాని నీపద్యములో చమత్కారముగా త్రిప్పి చెప్పినాడు. లేదా ఉపమాలంకారము దీనియందు ధ్వనిత మగుచున్నదని చెప్పినను చెప్పవచ్చును.

ఈరీతిగా నయుతుడు మిక్కిలి విరక్తుడై తపస్సుచేయ నారంభించెను. మహోగ్రతపము చేసెను. అతని తపస్సునకు మిన్నునుండి నిప్పులుకురిసెను. అట్టితపస్సు చూచినచో నింద్రుడు నిలువలేడు. అతనికి నిప్పుత్రొక్కినట్లగును. మాడు పట్టున తేలుకుట్టినట్లగును. ఆవ త్రాగినట్లగును. ఆ యింద్రుడు వృద్ధబ్రాహ్మణవేషము వేసికొని నలుగురు శిష్యులను వెంటబెట్టుకొని దూడ

తోడి యొకయావును నడిపించుకొనుచు నయుతునివద్దకు వచ్చెను. వచ్చి యతని యాశ్రమములో కూర్చుండి విశ్రమించి యచ్చట స్నానాదులుచేసి యయుతునివద్దకు వెళ్ళెను. అయుతుడు అతిథిపూజచేసి "స్వామీ! మీరెచ్చటివార"ని యడుగగా ఆ దొంగయింద్రు డిట్లనెను. "నా యాశ్రమము హిమవత్పర్వతము మీదనున్నది. అన్ని యాశ్రమములలో గార్హస్థ్య ముత్తమమైనది. నేను దాని నాదరించుచు ననేకతీర్థములు సేవించితిని. కంచి, శేషాద్రి, శ్రీరంగము, ప్రయాగ, గయ, జగన్నాథము, పుండరీకమునన్నియు సేవించితిని.'' నీ వెవరని యడుగగానయుతుడు తన కథ యంతయు జెప్పెను. దానికి వృద్ధబ్రాహ్మణుడు కోపించి "ఓయీ! జ్ఞానమను అమృతపుజల్లును మన్మథాగ్ని సోకకుండచేయుట కష్టము. గృహస్థధర్మము మిక్కిలిమంచిది –

"కీలారముననుండి పాలింటికే తేర జనుధాన్యముల చేలబండి యొరుగ" కీలారము – అవులమంద; మొదలుగా గృహస్థధర్మముల నెంతో పొగడెను.

అప్పు డయుతుడు స్త్రీ సంగమమును చాల దూషించెను. వృద్ధబ్రాహ్మణునకు కోపమువచ్చెను. లాభములేక పోయెను. ఇంద్రుడు ఇంక తన పని సాగదని వెంటదెచ్చిన కామధేనువు నచ్చట వదలిపెట్టి తనదారిన తాను పోయెను. ఆ కామధేనువు పుండ్లుపడి యొత్తుపడినదానివలె నుండెను. అయుతునకు దానిని చూడగా జాలివచ్చి దానిని పోషింపనారంభించెను. ఆ ధేనుపరిచర్యలో ధ్యానము, పూజాద్రవ్యములు తెచ్చుట, రుద్రాక్షలు త్రిప్పుట మంత్రమునన్నియు మూలపడెను. క్రమముగా నా యావుబలిసెను. గుండువలె బలిసెను. బలిసి యేడాదికేడాది కీనుచుండెను. ఆ యడవిలో నామె యథేష్టముగా ద్రిమ్మరుచుండెను. ఆ యావుచేతలు దుర్భరములయ్యెను. దానినిచూచి అయుతుడిట్లనుకొనెను.

"వత్సనాభీ గంధవహామయ్యె నీయావు
పైగాలి నీవార పాకములకుఁ,
గఠినకుద్దాల వక్త్రములయ్యె నీ జన్నె
మునుదెక్క లక్కంద మూలములకుఁ,

జటుల దవాన లచ్ఛటయయ్యె నీ గిడ్డి
కటు జిహ్వా బర్హిర్ని కాయములకు,
నారణోచ్చారణోద్భృతులయ్యె నీ తొట్టు
కంఠహ్రుంకృతు లేణ గర్భిణులకు

నాకు మొగమోడియాఁ గాదనరు తపస్వి
లేల ? యీ మైలపూయక దూల దీని
వత్సయుతముగ నీవనీ వాటమునకు
లాడి గావింతునంతఁ దొలంగు దూఱు.

ఈ యావుపై నుండి వచ్చెడిగాలి నివ్వరిపంటలకు వసనాభి గాలివంటి దైనది. దీనిడెక్కలు కందమూలములకు తప్పుగోలలైనవి. దర్భలకు దీని నాలుక దావాగ్నియైనది. ఇదిబలిసి సర్వమును నాశనము చేయుచున్నది. నా మొగమోటమిచేత ఋషులేమియు ననుటలేదు. దీనికి లాడివేయుదునని దానిమెడలో నొకకఱ్ఱ్ట్ట లంకెవేసి వదలిపెట్టినాడు. దానిని చాలా బాధ పెట్టినాడు. ఆ కామధేనువునకు కోపమువచ్చినది. ఆమె వీనిని శిక్షించవలయు ననుకొనెను. అక్కడికి కొంతదవ్వున వాధూలుడను ముని తపస్సుచేసుకొను చుండెను. అతడు మహాజ్ఞాని. అతనిచుట్టును పుట్టలేచెను. ఈ కామధేనువు పోయి యా పుట్టను మట్టించెను.

"మట్టినబిట్టు మండిపడి మౌనిసముద్ధతుడయ్యె మేనిపై
పెట్టినపుట్ట నెట్టుకొని బీటలువాఱ శ్రవశ్శకుంతముల్
చట్టుపలెత్తి పుంగటికి సాఁగఁదలంప జటాచ్ఛటాచ్ఛవిన్
ద్రుమ్మలు గట్టినిద్రలు మరుద్భుగధీశకులమ్ము మేల్కొనన్."

ఈ పద్యము ఆ మౌనియొక్క తపస్సునంతయు చెఱిచినట్లుండెను. ఆవు కాళ్ల మట్టగింపు ఘోరముగానవిపించును.

ద్విరుక్తటకారము, శ్రవశ్శకుంతములు, జటాచ్ఛటాచ్ఛవి, మరు ద్భుగధీశకులము, పద్యమునంతయు కుక్కినట్లు చేసినవి.

చట్టుపలు - ఱెక్కలు: మరుద్భుక్ - పాము; ఆ ఋషి లేచి ప్రక్క నున్న యయుతునిచూచి వానిని నీవొక కప్పవుకమ్మని శపించెను.

అయుతుడు కాళ్ళ వ్రేళ్ళపడెను. తనకథ చెప్పికొనెను. వాధూలముని జాలివహించెను. గృహస్థధర్మ మెందుకు వదలిపెట్టితివిరా పిచ్చివాడా? నేనింతవాడనన్న గర్వ మెవ్వరికిని పనికిరాదు. నీవు కప్పవై నరసింహదేవుని సేవించుము నీ కొకపెండ్లము దొరకును. ఆమెయందు సంతానమును కనుము. అప్పుడు నీకు భగవత్కరుణ కలుగును. అనిచెప్పి యాముని తన దారిని తాను వెళ్ళిపోయెను. అయుతుడు అనేక తీర్థయాత్రలుచేసి పుండరీక క్షేత్రమునందు నృసింహస్వామినిచేరి యక్కడ కప్పయయ్యెను. ఒకనా డచ్చటికి కాన్యకుబ్జనగరపు రాజుకూతురు తన చెలులతో వచ్చి స్వామిని సేవించి యీ రత్నాలు బంగారము మూటగట్టినట్లున్న కప్పనుజూచి దానిని బట్టుకొని దానితోనాడుచు ఆటకొఱకు నచ్చటనున్న యొకమునిపైన నీ కప్పనువిసర, ఆ ఋషి కోపించి వీరునందఱను కప్పలుగాఁ శపించెను. వీరందరు కప్పలైరి. వానికి భార్యలైరి. కప్పగానున్న అయుతునకు వారి యందు సంతానము కలిగెను.

ఈ చరిత్రము అద్భుతము. అద్భుత రసైకపాత్రము.

తెనాలి రామకృష్ణయ్య వ్రాసిన ప్రతిపద్యము గడుసుదనమునకు నిలుకడగానుండును. పలుకుబడిక్రొత్త, కల్పనక్రొత్త, అంతయు నొకయద్భుత రసము. తన కవితయంతయు నద్భుతమని చెప్పుటకేమో చివరి కథ యిది వ్రాసి ఆ అయుతునికథ అద్భుతరసైక పాత్రమని కావ్యము నించుమించుగా ముగించెను.

నిగమశర్మకథలో కొంతయుండెను. ఈ కథలోనదికూడ లేదు, అతని రచనయా! సర్వత్ర అద్భుతముగా నుండును. ఈ కథ యెందుకువ్రాసెనో తెలియదు. గృహస్థధర్మము గొప్పదియని చెప్పుటకు వ్రాసెనా?

పాండురంగక్షేత్ర మాహాత్మ్య మిదియా?

కవిత్వమనేక దశలలో నుండును.

మొదటిది కవియైనవానికి సొంతమైనయొ కశైలి యుండవలయును.

రెండవది వాని పలుకుబడియందు ప్రత్యేకమైన వైలక్షణ్య ముండ వలయును.

ఇవి రెండును తెనాలి రామకృష్ణయ్యకు సమృద్ధిగా కలవు.

మూడవది కథ నడుపుచున్నప్పుడు భిన్నభిన్నాంశములను స్వకల్పనలతో నింపించగలిగి యుండవలయును. అలంకారములు, లోకోక్తులు; ప్రౌఢమైన భాషాప్రయోగములు మొదలైనవానితో రచన యాశ్చర్యముగా నుండునట్లు చేయవలెను. ఇదియు తెనాలి రామకృష్ణయ్యకు సమృద్ధిగా కలదు.

నాల్గు-కవి తాను తీసికొన్న కథలో తగినంత పుష్టిలేనిచో కథాంశములు కల్పించుటయందు, రసమును మలచుటయందు, దానికి పుష్టిని సమకూర్చవలయును. పాఠకుని హృదయమును నిత్యవ్యగ్రముగా చేయవలయును.

అయిదు-కథ నెన్నుకొనుటలో నిజముగానున్నది మహాకవియొక్క యదార్థమైన శక్తి.

కథలనేక విధములు. కొన్నింటియందు రసము ప్రధానము. రసములు తొమ్మిది. కొన్నింటియందు భగవద్భక్తి ప్రధానము. కొన్నింటియం దొక మహాపురుషునిచరిత్ర ప్రధానము. కొన్నింటియందు సృష్టిలోని కొన్ని మహారహస్యములు ప్రధానము. ఇంకననేక విధములుగా కథలుండును.

ఇన్నివిధములైన కథలను తీర్చవలయును కదా! కవులలో రెండు రకములున్నారు. ఒకడు వట్టికవి. వాడు కథను చెప్పికొనిపోవును. రెండవవాడు శిల్పియైనకవి. వాడు కథనుచెప్పుటలో చిత్రచిత్రములైన శిల్పములు చూపించును.

ఇట్లు పోనుపోను మహాకవులలోకూడ తారతమ్యములుండును.

ఇదియొక యగాథమైన విషయము.

కాని మొదటి రెండు గుణములుకలవారే చాలమంది కవులు.

తెనాలి రామకృష్ణయ్య అక్కడ మేటి.

# పారిజాతాపహరణము

ఈ గ్రంధము వ్రాసినాయన నంది తిమ్మన్న. ఈయనకు ముక్కు-తిమ్మన్న యనికూడ పేరు.

"ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు" అని ప్రశస్తి. ఈయన పలుకు ముద్దుగానుండునని యర్థము.

శ్రీకృష్ణుడు స్వర్గమునకు బోయి పారిజాత వృక్షమును పెకలించి కొనితెచ్చిన కథ యిందలి యితివృత్తము.

శ్రీకృష్ణున కనేకులు భార్యలు. వానిలో రుక్మిణీ, సత్యభామయు, నెక్కువ ప్రేమాస్పదలు. ఇద్దఱును కులమును రూపమున్ మగని కూరిమియున్ గలవారే. ఇద్దరు నా గర్వము కలవారే. అందుచేత వారిలో రవ రవలు పుట్టెను.

ఒకనాడు శ్రీకృష్ణుడు రుక్మిణి యింటనుండి రుక్మిణితో జూదమాడుచుండెను. అప్పుడాకాశమునుండి నారదుడు వచ్చెను అరివేరము-కయ్యము ఆయన అరివేరంపు తపసి. వచ్చిన నారదునివారు పూజచేసిరి. ఆ నారదుడు శ్రీకృష్ణుని పొగడెను. ఆ నారదుడు వచ్చునప్పుడు పారిజాతపువ్వులను తెచ్చెను. దానిని స్వర్గమునుండి తెచ్చెను. శ్రీకృష్ణుడా పుష్పమును రుక్మిణిదేవి కిచ్చెను. కాని యిచ్చుటకు మున్ను మనసులో దీనివలన సత్యభామకు కోపమువచ్చునేమో యనుకొనెను. కాని యచ్చటనున్న రుక్మిణి కీయనిచో నామెను పరిహాసము చేసినట్లగును. ఆమెయు సంశయపడెను. కాని నారదుడు తీసికొమ్మని కనుసన్న చేసెను. ఆమె తీసికొన్నది. ఆమె ఆ పువ్వును తలలో పెట్టుకొనునప్పటికి.

"వలిగుబ్బలి ముద్దుపట్టి లేతనెల ధరించినట్లమరెను. వలిగుబ్బలి - హిమవత్పర్వతము — ఆయన ముద్దుపట్టి పార్వతీదేవి.

27162

అంత నారదు డిట్లనెను.

> " పరిమళము సెడదు వాడదు
> పరువము తప్పదు పరాగభర భరితంబై
> నిరతము జగదేకమనో
> హరమగు నీ కుసుమరాజ మంబుజ వదనా."

''అలి నీలాలక నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధు సంగరంబునకు నుల్లాసమ్ముఁ గల్పించు ను
జ్జ్వల దీపాంకురమై రతిశ్రమతనూ సంజాత ధారాళ ఘ
ర్మలవంబుల్ తొలగింపగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్.''

లతాంతాయుధు సంగరంబునకు – మన్మథయుద్ధమునకు – సంగమమున కుత్సాహము కల్పించునని యర్థము. సురటి – విసనకఱ్ఱ.

ఆయన భగవంతుడు. ఆమె భగవతి. నారదు డిట్లనవచ్చునా ? యని కొందఱి సందేహము. నారదుడు తాతగారి వంటివాడు. వీరు పసిపిల్లలు. కొందఱు వృద్ధులు యౌవనములోనున్న పడుచువాండ్రతో దగ్గిర బంధుత్వము నున్నచో ముఖ్యముగా ప్రేమయు చనవు నధికముగా నున్నచో నింత స్వాతంత్ర్యమును తీసికొందురు. ఇది లోకసహజము. నిజమునకు స్త్రీ పురుష సంగమము సృష్టిహేతువు. అది ధర్మబద్ధమైనప్పుడు దోషములేదు. అది సృష్టిహేతువని ధర్మబద్ధమై యుండవలయునని లోకము తుచ్ఛ కామ ప్రవృద్ధబుద్ధియై దాని యందసభ్యబుద్ధి కల్పించుకొనెను. తల్లి తండ్రుల సంగమములేక పుత్రోత్పత్తిలేదు. చెల్లెలి నెవరికోయిచ్చి పెళ్లిచేయుట సంతానము కొఱకే.

నారదు డింతటితో నూరకుండక " ఓయమ్మ రుక్మిణీ ! నీవీ పుష్పమును తలలో తాల్చుటవలన సవతులందరువచ్చి నీ పాదములమీద వ్రాలుదురు. ఇన్నాళ్లును కృష్ణుడు సత్యభామకు వశంవదుడని విందును. ఇప్పుడు తెలిసినది. ఆ సత్యభామ

చక్కని దాననంచు నెలజవ్వనినంచు జగంబులోన పే
రెక్కిన దాననంచు పతియెంతయు నా కనురక్తుడంచు దా

నిక్కుచు విఱ్ఱవీగుచు గణింపదు కాంతలసత్య యింతకున్
బ్రుక్కకయున్నె నీ మహిమసూచిన బోటులువిన్నవించినన్."

అనికూడఅనెను. ఆతడు సత్యభామ పేరెత్తి యిట్లనుట న్యాయముగాలేదు, కాని యాయనకు భయము. తాను పెట్టఁదలచుకొన్న పోట్లాట యూరకే పూవిచ్చి వెళ్లినచో సరిగా కలుగదేమో! యని.

ఒక రాజాంతఃపురములోఁగూడ రాజకీయము లుండును. ఒక రాజునకు పదిమంది భార్యలున్నచో వారి వారి ప్రతినిధులు పదిచోట్ల రహస్యముగా నుందురు. ఆ భార్యవద్ద నేమి జరిగినది? యీ భార్యవద్ద నేమి జరిగినది? అన్న వార్తలు ప్రతి భార్యయు తెలిసికొనుచుండును.

ఈ రుక్మిణియొక్క యంతఃపురములో నట్లే తక్కినపదుగురు భార్యల ప్రతినిధులును కలరు. వారు వారు తమ తమ రాణులవద్దకుపోయి ఈ కథ యంతయు చెప్పిరి.

తక్కిన యందరును సర్దుకొని యూరకుండిరి. మరియు నచ్చట నారదుడు ప్రధానముగా సత్యభామ పేరెత్తినాడు గాని తమపేరు లెత్తలేదు కదా!

సత్యభామ తన చెలికత్తె రుక్మిణి యంతఃపురమునకుపోయి రాలేదని ప్రొద్దుబోయెనని యెదురు చూచుచుండెను. అప్పటికే ప్రొద్దుపోయెను. అప్పుడు సత్యభామ యెచ్చట నున్నది?

'తన శృంగార వనంబులోన గిరిప్రాంతం, బక్కఁగాదిద్దితీ
ర్చిన పూదేనియ యేటికాలువదరిం, జెంగల్వపుప్పొళ్లు నిం
చిన చంద్రోపలవేదిపై సరసగోష్టిన్ బోటియుండాను న
వ్వనజాతాయతనేత్ర శౌరిగుణముల్ ప్రావ్రాకుచ్చి వర్ణించుచున్."

ఇది యాయన ముద్దుపలుకు.

చంద్రోపలవేది — చంద్రకాంతపు రాతితోవేసిన యరుగు; ఆ సమయములో నామె శ్రీకృష్ణ దేవుని గుణములు పొగడుచున్నది. ఈ మాటలో నందమున్నది. తానాస్వామి గుణములనిచ్చట పొగడుచుండును ఆ సమ

యములో కూడ పొగడుచుండెను. సరిగా నప్పుడే యీవార్త వచ్చును. ఆమె కెక్కువ కోపము వచ్చుటకువీలైన సమయమని సూచించున్నది. అప్పుడామె కుడిబుజము, చూచుకము, కన్ను కంపించినవి. స్త్రీలకు కుడివైపునందలి యవయవము లదరినచో శుభముకాదు. పురుషుల కెడమవైపదరినచో శుభముకాదు. అంతటి స్త్రీలకువచ్చెడి యాపద ఏమి ? తమ భర్త మరియొక స్త్రీయందనురక్తుడగుట. అప్పుడే రుక్మిణివద్దనుండి రావలసిన చెలివచ్చినది.

ఆమె మంచికోపముతో వచ్చినది. ఆమె యిట్లన్నది - అనుచుండగా 'కనుగవ నెఱసంజ నొడమగా'- ఆమె కన్నుల యందెఱ్ఱని సంధ్యాకాల ముదయించగా - ఎఱ్ఱదనము కోపమునకు లక్షణము. ఎఱ్ఱసంజ - ఎఱసంజ; తెలుగులో సామాన్యముగా ద్విత్వాక్షరములు ద్విత్వములేకుండగూడ వాడబడును. సన్నమాట - సనమాట.

లోకములో ఆశ్రితులు తమ కాశ్రయమిచ్చిన వారితో నభేద ప్రతిపత్తిగా నుందురు. వారి దుఃఖములు తమవి. వారి సుఖములు తమవి. వారి కోపములు తమవిగా నుందురు.

"అమ్మా ఏమని చెప్పుదును ! అచ్చటికి నారదుదు వచ్చెను. అ మురారికి పారిజాత పుష్పమునిచ్చెను. ఆయన

''మిన్నంది వేగ కయికొని
కన్నుల నొత్తికొని మ్రొక్కి గారవమొసగన్
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను;
అన్నెలఁతయుఁ గొప్పులోన నవ్విరిదాల్చెన్ .''

ఆ కృష్ణుఁడు మిన్నంది ( ఎక్కువ సంతోషించియని తాత్పర్యము ) ఆకాశమంటినాడు అన్నట్లు— కాని యీ మిన్నందియన్న మాటలో కృష్ణుఁడు తరువాత స్వర్గమునకువెళ్లి పారిజాతమును తెచ్చునన్న యర్థము దూరముగా నున్నది.

అక్కడ జరిగినది వేఱు. ఇది చెప్పినది వేఱు. కృష్ణుఁడు సంశయించుటగాని రుక్మిణి సంశయించుటగాని యిది చెప్పలేదు. ఆ పుష్పమామె ధరించినంతనే రాజబింబాస్య రుక్మిణి తేజరిల్లె, సానబట్టిన మకరాంకు శస్త్ర మనగ.

మకరాంకు శస్త్రమనగా మన్మథ బాణము; ఈ మాటనిది కల్పించి చెప్పినది. ఈ చెలికత్తె మనస్సులో సత్యభామ యొక్కర్తె కయే కృష్ణునకు తగినది, రుక్మిణి తగనిది, యని యభిప్రాయము.

అంతియేకాదు, ఆ రుక్మిణియట తలలో నా పువ్వుఁదాల్చి మూడు లోకములు తానే యేలుచున్నట్లు—

ఆ కుసుమమ్ము, దాల్చిన మహా మహిమమ్మునఁ దోడిఁ కామినీ
లోకము మచ్చరంబు మదిలోనఁదొలంగి భజించుచుండ, న
స్తోక నిజప్రభావములుసూపెడు గద్దియమీద నెక్కి ము
ల్లోకముదాన యేలుగతి లోలవిలోచన యేమిసెప్పుదున్.

ఈ పద్యములో క్రియలేదు. ఏలుగతి — అని యాపినది. ఉన్నదియని గర్వపడుచున్నది యని యా మొదలైన విషయములేదు. అక్కడికి అపి వేసినది. ఇది లోకసహజము. ఒక కోపముతో నున్నవారు వాక్యమును పూర్తిచేయరు. అది యవతలివారికి కోపమెక్కించుటలో నొకమార్గము.

"ఎంతకులేఁడు నారదమునీంద్రుఁడు శౌరివినంగ రుక్మిణీ
కాంతవినంగ, నేను వినఁగా బలికెం; బతిఁగూర్చుదాన నా
యంతటి వారులేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీగుచున్.
వంతునవచ్చు సత్యగరువంబిఁ కఁజెల్లదటంచు, మానినీ!"

ఈ పద్యములోనున్న విశేషమేమనగా " నేను వినగా " ననుట — తానెవ్వతె ? తానొక చెలికత్తె. ఒక పరిచారకురాలు. తనకేమంత ప్రాధాన్యము ? తన ప్రాధాన్యము తనకు. ఉన్నచో సత్యభామకుకూడ నుండ వచ్చు. పరిచారకులయొక్క యహంకారము విచిత్రముగా నుండును.

ఈ మాటలన్నది యెవరు ? నారదుడు. అతనికేమి లెక్క ? కాని యిది యంతయుపోయి కృష్ణునిమీన పడవలయును. ఇంత గొప్పచెలికత్తె యచ్చట నున్నదని నారదున కేమితెలియును ? ఎంతదో యంతది యొక చెలికత్తె యున్నదని తెలియవచ్చును.

అని చెలికత్తె చెప్పఁగా దెబ్బతిన్న త్రాచుపామువలె సత్యభామ మండి పడెను. సత్యభామ తన కోపమును వెల్లడించెను. పుష్పమును రుక్మిణి కిచ్చినచో నిచ్చికోనిమ్ము, ఆ నారదుడు మా పేరెందుకెత్తుకోవలయును ? సరే ! ఆ నారదునకు పోట్లాటలు పెట్టుటయేపని. నా భర్త ఆ నారదుని వారింపవలదా ? కృష్ణుఁడిచ్చినచో నిచ్చుఁగాఁక, రుక్మిణి యే మొగముపెట్టి తీసికొన్నది. ఇన్నాళ్లు నేనే సవతులందఱిలో గొప్పదానివలెనుండి నే డేమొగముపెట్టికొని తిరుగుదును ? నేనెట్లు వారితో మాటాడెదను. ఓసీ! ప్రాణములెంతతీపి. అనగా నామె తన ప్రాణములు వెంటనే పోవలెనని వాంఛించినదన్నమాట. ఓసి. ఇట్టిమాటలువినికూడ నేను బ్రతికియున్నానుం ఇంకనెట్టివిచూతునో! ఆ కృష్ణుఁడు రుక్మిణీమీద తనకున్న ప్రేమ యెంతయెంత దాచి నాదగ్గఱ ప్రేమ చూపుచున్నాడు. సరే ! కృష్ణుఁడచ్చట నున్నాడు. భర్త అచ్చటనున్నాడుగనుక నామెకిచ్చినాడు. ఈ సవతులందఱు ఆమెను సేవించుటకు పోదురా ?

కొందఱు లోకములో మేలువచ్చినను కీడువచ్చినను తలయొగ్గుదురు. అది నాచేతకాదు. ఓసి! అతని ప్రేమలేమిచెప్పుదును? నామాట జవదాటడే ! నా చెలులకు లంచములిచ్చును.

కృతకాద్రి కందరా కేళీనిగూహన
వేళా పరస్పరాన్వేషణములు
పోషిత మాధవీ పున్నాగపరిణయో
త్సవ కల్పితానేక సంభ్రమములు
చాతురీనిర్జిత ద్యూతపణాదాన
కలితచేలాంచ లాకర్షణములు
సాయం సమారంభ చక్రవాక ద్వంద్వ
విరహావలోకన విభ్రమములు
సాంద్రతర చంద్రికాకేళి చంక్రమములు
విధుశిలామయ వేదికా విశ్రమములు
ఫలకచిత్రిత నిజరూప భావనములు
మఱచెనో కాక, రుక్మిణి మాయఁదగిలి.

కృతకాద్రి - కల్పించిన కొండ. ద్వారకాపురి సముద్రపుటొడ్డున నున్నది. అచట కొండలుండవు. కొండలలో విహరించవలయుననగా నెట్లు ? వారు మహాధనవంతులు గనుక అవీయివీ పేర్చి కొండవలె చేయుదురు. అందులో గుహాలు మొక్కలు మొదలైనవి పెంచి చేయుదురు.

కందరా—గుహా; కేళీ—ఆట; నిగూహనము—దాగికొనుట; దాగుడు మూతలాడుదురన్నమాట ఆ సమయములో ఒకరినొకరు అన్వేషణములు — వెదుకుటలు.

పరస్పరాపేల్లనములని మరియొక పాఠము. అది అన్వేషణములకంటె మంచిపాఠము. ఎందుకనగా వారొకరినొకరు వెదకికొని యొకరినొకరు చూచినంతనే కౌగలించికొని చుట్ట వేసికొందురని యర్థము.

మాధవీ — బండిగురివెంద; పున్నాగము — వానిరెంటికి పెండ్లిచేయు నప్పటి తొందరపాట్లు.

చాతుర్యముచేత గెలిచిన జూదపుపందెము నిమ్మని చేలాంచలాకర్షణములు చీరలుపట్టికొని లాగికొనుటలు.

సాయంకాలములయందు చక్రవాక దంపతులు విరహామనుభవించుచుండగా వీరు చూచి విభ్రాంతిపొందుటలు. అయ్యో, మనకు వియోగము వచ్చినచో నిట్లుండును కదాయని;

> ధనమిచ్చి పుచ్చుకొన్నను
> మనమున నోర్వంగవచ్చు; మగఁడింతులకున్
> జన విచ్చిపుచ్చుకొన్నను
> మనవచ్చునె ? యింక నేటిమాటలు చెలియా ?

అని యామె కోపగృహామునకుఁ బోయెను ఆచటనెంతయో బాధ పడుచుండెను. చీకటింటికడ మంచముమీద మబ్బుచివరనున్న చంద్రరేఖవలె నుండెను. మాసినచీర, నగలు లేకపోవుట, వాసెనకట్టు;

మాత్సర్యమను విషమామెకెక్కెను. మనకపు పాము కాటువేసినట్లు. ఆ లక్షణములన్నియు కనిపింప నారంభించెను.

మదించిన యేనుగుయొక్క తొండమునందలి తామరపువ్వువలె నామె తిరుగుచుండెను.

ఈమె యిచ్చటనిట్లుండగా కృష్ణునకు లోపలహాడలు. ఆ చెలికత్తె వెళ్ళి చెప్పియుండును. అది దుర్మార్గురాలు. ఏవోయేవోకల్పించి చెప్పును. అని శ్రీకృష్ణుఁడు తనకొడుకైన ప్రద్యుమ్నుని మౌనికప్పగిప్పగించి తాను సత్యభామయొక్క యంతఃపురమునకు బయలుదేరెను. తన కొడుకైన ప్రద్యుమ్నుని మౌనికప్పజెప్పి యనగా ప్రద్యుమ్నుడప్పటికి పెద్దవాడైనాడని యర్థము. ఇతనికాలిచెప్పు అతనికాలికి సరిపోవుచున్నదన్న మాట. శ్రీకృష్ణుఁడు తన యీ శృంగారరసములో ప్రద్యుమ్నునికి పనిచెప్పుట ఆ కొడుకున కెంత తెలియకపోయినను న్యాయముగాలేదు. కాని దీనివెనుక నొకరహస్య మున్నది ప్రద్యుమ్నుఁడు మన్మథుఁడు. సర్వజగత్ స్త్రీ పురుష సంగమ వ్యవహారనిర్ణేత. వారు వారిద్దరు జగన్నాథులు. ఇద్దరికిని లోకము లోకమే, తాము తామె. ఇదియొక లీల.

> "అరదమునెక్కి కేతన పటాంచలచంచలమైన ఱాల్మితోఁ
> దురగజవంబు మున్నడవఁద్రోచి కడంగెడు తత్తరమ్ముతోఁ
> దిరిగెడుబండి కండ్లపగిదిన్ భ్రమియించు మనంబుతోడ శ్రీ
> హరి చనుదెంచె సత్యసముదంచిత కాంచనసౌధ పీఠికిన్."

ఇదియొక యాశ్చర్యమైన పద్యము. ఆయన రథము నెక్కినాడు. ఆయన తాల్మి—ఓర్పు—జెండాకుకట్టిన గుడ్డ చివరివలె చంచలముగానున్నది. ఆయన తత్తరము—తొందరపాటు రథమునకుకట్టిన గుఱ్ఱములకంటె ముందు పోవలెననిపించుచున్నది. అతనిమనస్సు బండి యాకులవలె తిరుగుచున్నది ఆయన సత్యభామయొక్క ప్రకాశించుచున్న బంగారపు మేడదగ్గరికి చనుదెంచెను.

చనుదెంచెననగా వచ్చెను. చనెన్ అనగా వెళ్ళెను. చను + తెంచు — ఇవిరెండు ధాతువులు ఇట్టివానిని శబ్దపల్లవములందురు. ఈ చనుదెంచు అన్న ధాతువువాడుట మూలముగా శ్రీకృష్ణున కచ్చటకుచేరిన తృప్తి వ్యజ్యమానమగుచున్నది అమ్మయ్య, వచ్చినాము—అన్నట్లు. పద్యములోనున్న తొందరయంతయు చరితార్థమైనట్లు.

ఇచ్చటనొక కొంచెము భేదమున్నది. సత్యభామది కాంచనసౌధము. రుక్మిణిది మణిసౌధము. చెలికత్తె చెప్పినదికదా రుక్మిణీసతి మణిసౌధమున నుండగానని. ఆమె పట్టమహిషి. ఆమెది మణిసౌధము. ఈమె తక్కినయేడు గురుభార్యలలో నొకతె. తక్కినభార్యలవి కాంచనసౌధములు. లేదా తక్కిన యారువురివి కాంచనసౌధములుకూడ కావేమో !

ఇక్కడ సత్యసముదంచిత కాంచనసౌధ వీథి. సత్యాసముదంచిత కాదు. సత్యభామా సముదంచితకాదు, సత్యసముదంచిత. శ్రీకృష్ణుడామెను 'సత్య' అనును. అది ప్రియమైనపేరు. సత్య ఇంటికివచ్చితిని. సత్య నాకొఱ కెదురుచూచుచుండును. సత్య ఏమనునో ! సత్య ఎట్లున్నదో ! ఈ ప్రేమలో నున్న సత్య అన్నశబ్దమునే వాడినాడు. అచ్చటికూర్పులో సూక్ష్మముగా ధార కొంచెము విరిగిన లక్షణమున్నది. దానిచేత నీప్రేమ వ్యంజిత మగుచున్నది.

శ్రీకృష్ణుఁడు సత్యభామ సౌధములోనికి వెళ్లెను. సౌధమంతయు చిన్న బోయియున్నది. అచ్చట నెవ్వరును చిలుకలకు మాటలు నేర్పుటలేదు. నెమళ్ల నాడించుటలేదు. వీణలు వాయించుటలేదు. హంసలను నడిపించుటలేదు పారిజాత పుష్పవృత్తాంత మెవ్వరో చెప్పియుందురని శ్రీకృష్ణుడనుమాన పడినాడు. కోపగృహమును చేరినాడు. తానువచ్చినసంగతి యామెకు తెలియకుండ చెలికత్తెలకు సైగలుచేసి ముసుగుపెట్టుకొని పండుకొని యున్న యామెసజ్జచేరి తానొక సిసనకఱ్ఱఁబూని యామెకు విసరుచుండెను. ఆ విసరుట యెట్లున్నదనగా "తద్వపుః కీలిత పంచసాయకశిఖిన్ దరికొల్పుచు నున్న కైవడిన్". ఆమె శరీరమునందు తగుల్కొనిన మన్మథాగ్నిని మంటలుగా రేపుచున్నట్లున్నది.

ఆ ముసుగులోనున్న సత్యభామకు పారిజాతపు క్రొత్త వాసనలు వచ్చినవి, ఆమె ముసుగుతీసిచూచెను. పతి విసనకఱ్ఱపుచ్చుకొని విసరుచుండెను. ఆయనను చూచినంతనే యామె కన్నులయందు నీళ్ళు గిర్రునతిరిగెను. ఆమె మరల ముసుగిడుకొనెను. ఆ ముసుగులోకూడ ఆమె కన్నీళ్లు జార్చుచుండెను. ఆ ముసుగులో జార్చుచున్న కన్నీళ్లుకూడ వర్ణింపబడెను. అది చాల యనవసరము. ఆమె మనస్సునందున్న యగ్నినిచల్లార్చుటకు మేఘమువంటి

యూయన వచ్చెనని, ఓయీ! యగ్నీ నీవింక వెళ్లుమని యగ్నిని బయటికి పంపించు వాని మిత్రుడైన వాయువువలె నామె నిట్టూర్పువిడిచెను. ఎంత పెద్దనిట్టూర్పు విడిచెననగా నామె కప్పికొనిన దుప్పటియొక్క చివళ్ళు లేచెను.

"వనిత కుచద్వయంబున్నఁబయి వ్రాసిన కుంకుమపత్రభంగము
ల్జనిత నితాంతఘర్మ కణజాలముచేతఁ గరంగి మెల్లమె
ల్లన వెలిపట్టుపయ్యెద కెలంకులజాఱుట యొప్పె మానసం
బున నెలకొన్న క్రోధరసముర్వడఁ బెట్టుచునున్న కైవడిన్."

ఆమె స్తనములమీద వ్రాసిన కుంకుమముతోడి యలంకారములు ఆమె చెమటచేత కఱగి తెల్లనిపట్టుపయ్యెద చివళ్ళయందు జారెను. అది యామెలోనున్న క్రోధరసము బయటికి వచ్చినట్లుండెను.

అప్పుడు శ్రీకృష్ణుఁడామెను చాలబతిమాలెను. బతిమాలి ముసుగును లాగెను. చేతిలోనున్న తామరపువ్వుతో నామె కొట్టబోయెను.

చివరకు కృష్ణుడు దిక్కులేక యామె పాదములమీద వ్రాలెను.

"జలజాతాసన వాసవాది సురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమచ్చో వామపాదమ్మునం
దొలగంద్రోఁచె లతాంగి, యట్లయగు, నాథుల్ నేరముల్ సేయ పే
రలుకం జెందినయట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే"

జలజాతాసనుడు - బ్రహ్మ, అతడు లతాంతాయుధుని కన్నతండ్రి. మన్మథుడు శ్రీకృష్ణుని కుమారుడుకదా! లోకమునందలి సర్వస్త్రీల ప్రేమలను పాలించువాడు మన్మథుడు. ఇతడు వానితండ్రి. అతనితలను కాలితో త్రోసెను.

అతడు మిక్కిలి కోపముపొందవలయును. కాని యామెకాలిస్పర్శచేత తాను పులకరించిన శరీరముకలవాడై తనకు మన్మథ సామ్రాజ్యపట్టాభి షేకము జరిగినట్లు ఇట్లన్నాడు.

"ననుభవదీయ దాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁబూని తాఁ
చినయది నాకు మన్ననయ; చెల్వగు నీపద పల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానముఁ దాఁకిన నొచ్చునంచు నే
ననియెద; నల్కమానవుగదా యికనైన నరాళకుంతలా !"

నేను నీ దాసుడను. నన్నుతన్నుటలో తప్పులేదు. పైగా నిది నన్ను గౌరవించుట. నా యొడలు పులకరించి ముళ్లముళ్లవలెనున్నవి. నీ కాలికి గ్రుచ్చికొని నొప్పిపెట్టలేదుగదా ! ఇంకనైన కోపము మానుము. ఓసి అరాళకుంతలా ! అన్నాడు. అనగా వంకరలైన ముంగురులుకలదానా ! తల ద్రువ్వుకొనలేదుకనుక ముంగురులు లేగియున్నవి. అందుచేత నరాళ కుంతలాయన్నాడో ! అసలామె కుంతలము లరాళములే నిజముగా శృంగారరసములోనిది యొక క్లిష్టఘట్టము. కోపములో కార్యమన్నిన చో లోకములో నిద్దఱు భర్తలే యుండరు. [illegible] మహా రసికుడు. రెండవ [illegible] వట్టి అవివేకుడు.

సత్యభామ [illegible]గా చాల తప్పుచేసినది. కృష్ణుడు కోపించి వెడలి పోయినచో కథయేమి లేదు. ఆమె జీవితాంతము కృతినిందకు [illegible] సినదే. అట్టిస్థితి నామె కల్పించికొన్నది. కాని శ్రీకృష్ణుడు పరమపురుషుడు. ఆయన మానవస్వభావము తెలిసినవాడు. పరమేశ్వరుడు. ఆయన చిన్మయరూపుడు. అన్నియు తెలిసి ప్రవర్తించువాడు. ఆయన యీ గాథను సాగించినాడు. ఇది లోకమునందు శృంగారరసమునకు లక్ష్యభూతమైనది.

ఈ తన్నుట రతివేళ కాదు. అప్పటిస్థితి వేఱు. ఇది పట్టికోపను నభిన యించుసమయమునందు. ఆమెయు ప్రేమచేతనే యిట్లుచేసినది. ఎంతప్రేమ యున్నను ప్రవర్తనలో నొక హద్దుండవలయును.

ఆమె చాల విచిత్రమైన ప్రకృతికలది. ఇట్టి స్త్రీలుండరు. ఆమె యట్లుచేయగా నతడట్లనగా స్త్రీయైనది వెంటనే మెత్తపడి భర్తయొక్క కవుగింటికిదూరును. అప్పుడతడామెను లాలించును. నిజముగా నట్లు జరుగ వలయును.

ఇక్కడ నింకొకరీతిగా జరిగినది. ఆమె లేచికూర్చుండి మరల శృంగార రసమే యారంభించినది. ఓయి పశువులకాపరి ! నీకు భావజ మర్మ కర్మ

ములు తెలియునా? నీకు మాయందు ప్రేమలేదు. ఈ దొంగ వేషములు నీతో పుట్టినవి. ఈ మాయలు నీకు వెన్నతో పెట్టినవి. నేను నిన్నునమ్మి మోసపోయితిని. నీవిచ్చటి కెందుకు వచ్చితివి? పారిజాత వాసనలు మాకు చూపించి మమ్మెకసక్కెము చేయుటకు వచ్చితివి,

మానంబె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు; మాన మఖిల స
మ్మానములకు మూలంబగు,
మానరహితమయిన బ్రతుకు మానినికేలా!

ఇదివరకు చూపించఁబడిన యనౌచిత్య మంతయు నీ పద్యములోనున్న భావముచేత పరిహరింపబడినది. ఈ భావమే ముందుకూడ విస్తరించఁబడును. సత్యభామ ప్రధానముగా నభిమానవతి. ఆమె కాలితో తన్నినప్పుడు కోపమువచ్చి కృష్ణుఁడు వెడలిపోయినచో నామె భరణముమీఁద బ్రతికెడి స్త్రీ కాదు. ఆమె విషము త్రావియో, యురి పోసికొనియో తప్పకుండ మరణించెడు స్త్రీ. ఈ రహస్యము శ్రీకృష్ణునకు తెలియును. అందుచేత నాయన యట్లు ప్రవర్తించెను.

ఉవిద యెవ్వతె నోచియున్నదో యీశమం
తకరత్నమింక నౌదల ధరింప,
నీరైవతకశైల చారుకూట విటంక
కేలి కింకెవ్వతె పాలుపడునొ,
యెవ్వతె కబ్బునో యీ వసంతారామ
కర్పూరకదళికాగారవసతి
లీల నీ మణిసౌధ జాలకంబులనిన్ను
గూడియెవ్వతె వార్ధిఁ జూడఁగలదొ

యకట! నేఁబెంపఁ బెరిఁగిన శుకమయూర
శారికా బృంద మెవ్వతెఁ జేరునొక్కొ
నన్ను నాతోడి సవతులు నగకమున్న
పంత మలరంగ నిన్ను మెప్పింతుఁగాన.

ఆమె చనిపోవుటకు సిద్ధముగా నున్నది. ఆమె భగవంతునితో కడపిన ప్రతి నిమిషము జీవితముతో కడపినది. ఆమె బంగరు మేడయొక్క గవాక్షములు మణులతో చేయబడినవి. అందుండి తాను స్వామితోకలసి సముద్రము చూచుచుండునట!

నను నెవ్వతెఁగాఁ జూచితివి ? యని మాట్లాడలేక పోయినది. తన్ను సవతులు సన్వోకముందు అతనిని మెప్పించుతునన్నది. అనగా మరణింతునని యర్థము.

ఇదియొక స్త్రీ సృష్టి. పరమ సుకుమారముగా చేయఁబడిన సృష్టి. ముక్కు తిమ్మన్న యొక్క ప్రతిభ యంతయు నిండున్నది. అప్పుడామె పడిపోయినది.

"ఈసునఁబుట్టి డెందమునఁ హెచ్చిన కోపదవానలమ్ముచే
గానిలియేడ్చెఁ బ్రాణవిభుకట్టెదురన్నలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోము పయి చేల చెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయ కంఠ కలకంఠ వధూకల కాకలీధ్వనిన్."

ఈ పద్యము చాలప్రసిద్ధమైనది.

అప్పుడు శ్రీకృష్ణుఁడామెను కౌగలించుకొని కన్నీరుతుడిచి యిట్లన్నాడు.

ఓ లలితేంద్రనీలశకలోపమకైశిక ! యింతవంత నీ
కేల ? లతాంతమాత్రమునకే గలుగ ? న్వీను నీకు దేవతా
కేలివనంబుసొచ్చి, యనికి న్బలసూదనుఁదెత్తి వచ్చినన్
దీలుపడంగఁదోలి యిటఁదెచ్చెదనిచ్చెద పారిజాతమున్.

ఈ పద్యములోని మొదటి సంబోధనము పరమ రమ్యమైన సమాసము.

ఒక్క పువ్వుకోసమింత యెందులకు ? నేను స్వర్గలోకమునకుఁబోయి యింద్రుని తోటలోని పారిజాతముయొక్క పెల్లగించి నీ తోటలో నాటుదును.

అప్పుడైనను సత్యభామ స్వామిని తిరిగి కౌగలించలేదు. అనునయ మాడలేదు. క్షమాపణ యడుగలేదు.

అని పలుకు నంబుదశ్యా
ముని గర్జితమధురవాక్యముల సత్యా మా
నిని నీపలతిక వోలెం
గనుపట్టె సఖీమయూరికలు సెలరేఁగన్.

ఆయన మేఘములవలె నల్లనివాడు. ఆ మేఘముయొక్క గర్జితమే యీ తియ్యని మాటలు. నీపలతిక కడిమితీగ. ఆమె యట్లున్నది. అనగా చివురించి నట్లున్నది. చెలికత్తెలన్న నెమళ్లు చెలఁరేగినారు. చెలఁరేగినది చెలికత్తెలు. ఆమె ప్రసన్నురాలైనది.

ఆమె భావములో కృష్ణునకు తానొక్కతెయే భార్య. ఇంతకు ముందటి సీసపద్యములో ఈ శమంతకరత్న మెవ్వతె ధరించును? మొదలైన మాటలలో తాను చనిపోగా కృష్ణుఁడు మరి యొకర్తును పెండ్లియాడు నన్నట్లున్నది. ఆయనకింక నేడుగురు భార్యలు కలరు. మరి యేమి? సంఖ్యా పూరణము చేయవలయునా? ఆ సత్యభామయొక్క ఠీవి, యభిమానము, ఆమె గర్వము విలక్షణమైనవి. ఎంత సుకుమారమైన సృష్టిచేసినాడు ముక్కు తిమ్మన్న! ఎంత విలక్షణమైన సృష్టిచేసినాడు ముక్కుతిమ్మన్న!! ఎంత రహస్యమైన సృష్టిచేసినాడు ముక్కు తిమ్మన్న!!!

# ఆముక్తమాల్యద

ఈ గ్రంధ మాంధ్రభాషలో మహా ప్రౌఢమైన ప్రబంధము. కర్త శ్రీ కృష్ణదేవరాయలవారు. ఆయన విజయనగర సామ్రాజ్య చక్రవర్తి. కవిత్వములోకూడ నంతటివాడే. ఈ గ్రంధము వైష్ణవ మతమును సమర్థించుటకు ప్రచారము చేయుటకు వ్రాయబడినది. విజయనగర చక్రవర్తులు మొదట శైవులు. లేదా స్మార్తులు. తరువాత వైష్ణవులు. ఈ గ్రంధము యొక్క అవతారికలో కృష్ణరాయల వంశం చెప్పబడియున్నది. ఆ పద్యము లన్నియు పెద్దన్న మనుచరిత్రములో నున్నవి. మరి నాలుగైదు పద్యములవ కూడ నున్నవి

ఇది ప్రౌఢ ప్రబంధము. అనగా వ్యాఖ్యానము లేకుండ నర్థము కాదు. ఇది యెన్నో కల్పనలు కలిగిన గ్రంధము. వర్ణనలలో దీనినిమించిన గ్రంధముండదు. ఇట్లు కల్పించుట యెవ్వరికి సాధ్యము కాదన్నను నన వచ్చును. ఈ గ్రంధము ప్రధానముగా నావర్ణనా శక్తి చేతనే నిలచియున్నది.

కాని యిందులో కథ యున్నది. ఒకటి విష్ణుచిత్తుని కథ. రెండవది కేశిధ్వజ ఖాండిక్య సంవాదము, మూడు గోదాదేవి కథ. నాల్గు మాల దాసరి కథ. ఈ మాలదాసరి కథవంటికథ అనగా నట్టిరచన సృష్టిలో నెవ్వడును చేయలేడు. ఆంధ్రభాషలో నాముక్తమాల్యదలో తప్ప మరి యేసారస్వతము నందుండదు, అట్లు వ్రాయుట యసంభవము.

విలుబుత్తూరని యొక గ్రామమున్నది. అది అరవదేశము. ఆ పట్టణమును వర్ణించినాడు శ్రీ కృష్ణరాయలు. ప్రతి పద్యము నొక యద్భుతమైన కల్పన. అందులో నొకపద్యము మరియు ప్రసిద్ధము.

> తలఁబక్షచ్ఛటగ్రుచ్చి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
> స్థలి నిద్రింపఁగజూచి యారెకు లుపస్నాతప్రయాతద్విజా
> వలి పిండీకృత శాటికల్య విదదావాసంబుఁ జేర్పంగ రే
> వుల డిగ్గన్వైసఁ బాఱువానిఁగని నవ్వ న్వాలిగోప్రౌఢముల్.

బ్రాహ్మణులు ప్రొద్దుట స్నానముచేసి తెల్లని తడిబట్టలుపిండి యెద్దున పెట్టుదురుకదా ! బాతులు మెడ వెనుకకుత్రిప్పి రెక్కలలో గ్రుచ్చికొని చలికి పండుకొని యున్నవి. అవి బ్రాహ్మణుల బట్టలనుకొని రాజభటులు వానిని శర్గ్రహస్థుల కప్పజెప్పుటకనిపోగా నవి యెగిరిపోయినవి.

ఆవిల్లి పుత్తూరునందు విష్ణుచిత్తుఁడను వైష్ణవ భక్తుఁడు కలడు. అతడు పండితుడు. కాని మహా తపస్వి. గొప్ప విష్ణుభక్తుఁడు. గొప్ప అన్నదాత. న్యాయార్జిత విత్తముతో ఆసేతుశీతాచలము నుండి వచ్చిన వైష్ణవుల కన్నముపెట్టును.

> "ఆసిష్టానిధి గేహసీమనడురే యాలించినన్ మ్రోయు నెం
> తే నాగేంద్రశయానుపుణ్య కథలుం దివ్య ప్రబంధాను సం
> ధానధ్వానము 'నాస్తి శాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
> పోనాస్త్యోదన సౌష్టవంచ కృపయాభోక్తవ్య' మన్ బల్కులున్,"

అతని యింటిలో సర్ధరాత్రమునందుకూడ నీమాటలు వినిపించునట. ఒకటి విష్ణువుయొక్క పుణ్య కథలు; రెండు దివ్యప్రబంధముల యొక్క పఠనము. దివ్య ప్రబంధములనగా తిరువాయిమొళి, మొదలయిన యాళ్వారులువ్రాసిన ప్రసిద్ధ ద్రావిడ గ్రంథములు. మూడు అయ్యా కూర అయిపోయినది. పదార్ధములు చల్లబడినవి. పప్పు అయిపోయినది. భోజన సౌష్టవము లేదు. దయచేసి భోజనము చేయవలయును – అని – ఈమాటలు సంస్కృతములో నున్నవి.

అతడిక్కడ నిట్లుండగా, మధురా నగరమున్నది. ఆ నగరముయొక్క వర్ణనమున్నది, ఆ యూరునకు రాజున్నాడు. ఆయనపేరు మత్స్యధ్వజుడు. అతడు రాజ్యము చేయుచుండగా నొకప్పుడు గ్రీష్మర్తువు వచ్చినది. ఇవి యన్నియు వర్ణనలే. అందులో నొక పద్యము.

> "తారుణ్యాతిగచూత నూత్నఫలయుక్తైలాభిఘారస్వన
> ద్ధారాధూపిత శుష్యదంబుహృత మాత్స్యచ్ఛేద పాకోద్గతో
> ద్గారవుం గనరార్చు భోగులకు సంధ్యావేళలం గేళికాం
> తారాభ్యంతర వాలుకాస్థిత హిమాంతర్నారి కేళాంబువుల్.

దోరమామిడి కాయలలో నూనెపోసి చేపలువేసి వండి తిన్నారట. భోగులు తిన్నారు. ఆవేడి తట్టుకొనలేక సాయంకాలములయందు లేత కొబ్బరి బొండములనీరు త్రాగుచున్నారట.

ఈ గ్రంథము పెద్దన్నవారు వ్రాసి కృష్ణదేవరాయల పేరు పెట్టి నాడని కొందరు చెప్పుదురు. ఇట్టి పద్యములెన్నో ఆ మాట నిజము కాదను టకు సాక్ష్యములు. మరియు పెద్దన్నగారి శైలి వేఱు. శ్రీకృష్ణరాయలవారి శైలి వేఱు. ఇంత విస్పష్టమైన రెండు శైలులు వ్రాయగలిగిన కవి యుండ డని చెప్పవచ్చును.

ఈ మధురానగరమునకు దగ్గరనే వృషపర్వతమని యున్నది. ఆ పర్వతముమీద విష్ణ్వాలయ మున్నది. ఆ స్వామికి తెప్పతిరునాళ్లు జరుగు చున్నవి. ఆయుత్సవము చూచుటకొక పరదేశ బ్రాహ్మణుడువచ్చి ప్రక్క నున్న మధురా నగరమును దర్శించుటకు వచ్చెను. మధుర ప్రక్కనే వైఘయి నది కలదు. అందులో స్నానముచేసి ఆ రాజపురోహితుని యింటిలో భోజ నముచేసి తనతోడి యితర బ్రాహ్మణులుకూడ తోడుగా పండుకొని యేదో యేదో చదువుకొను చుండగా రాజుగారు తానుంచుకొన్న భోగినీకాంత యింటికి నలంకరించుకొని పోవుచుండెను. అప్పుడు ఈ పరదేశి బ్రాహ్మణుం డొక సుభాషితమును చదువుచుండెను. దానిలోని తాత్పర్యమేమనగా వయస్సునందే మోక్ష ప్రయత్నము చేయవలయును. అని. ఈ మాట విన్నంతనే రాజునకు తల తిరిగెను. ఆతడు తిరిగి యింటికివచ్చెను. మరియు చాలవిచారించి చివరకు నిర్ణయించెను. ఏ దేవత మోక్షదాతయో వానిని సేవించుదునని నిశ్చయించికొనెను. ఆ బ్రాహ్మణునకు కొంత ముడుపు పంపెను. తనవద్దకువచ్చెడి పలుమంది పండితులను పిలిపించి మీ శాస్త్రాలలో ఏ దేవుడు మోక్షమిచ్చునో నిర్ణయింపుడనెను. ఎవడు గెలుచునో వానికి బీరపూవులవోని బంగారు నాణెములు జాలరులో గట్టి వ్రేలాడదీసి దాని నిత్తుననెను.

సభలో పండితులు చర్చలు చేయుచుండిరి.

ఆ సమయములో విల్లి బుత్తూరుతో విష్ణుచిత్తుడు తులసిదండకట్టి స్వామిమెడలో వేయబోవుచున్నాడు. అప్పుడు భగవంతు డిట్లనెను. "ఓయీ మధురలో నిట్లు జరుగుచున్నది, నీవుపోయి నా మహిమను ప్రకటించి ఆ

వీరవూనాణెములను సంపాదింపుము. ఆ రాజు ఇహామును రోసినాడు. వానిని వైష్ణవుని చేయుము. అనగా విష్ణుచిత్తుండు భయపడినాడు. ఇతడు పండితుఁడు, ఇతనికి వాదన ఏమిటి ? పండితులితనిని చీల్చి ముక్కలు చేయుదురు.

స్వామీ ! నన్నునితఃపురా పఠితశాస్త్ర గ్రంథ జాత్యంధు, నా
రామక్ష్మాఖనన క్రియాఖర ఖనిత్రగ్రాహి తోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధ కరుస్భవద్భవనదాసు న్వాదిగాఁ బంపుచో
భూమీభృత్సభ నోటమైన నయశంబు ల్మీకుఁగాకుండునే.

స్వామీ నేను పూర్వము శాస్త్రగ్రంధములేమి చదువలేదు. అందుచేత జాత్యంధుడను. ఎప్పుడును నీతోటలో నేల త్రవ్వుటచేత త్రవ్వుగోలవలన నా చేతులు బొబ్బలు కట్టినవి. నేను నీతోటలో పనివాడను. నన్ను పంపినచో రాజసభలో మీకు తలవంపులుకదా ! ఇచ్చట భూమీభృత్సభయన్న శబ్దమున్నది. రాజశబ్దము తరువాత సభా శబ్దము వచ్చినచో నపుంసక లింగమగును. రాజసభ మగును. ఇచ్చట పర్యాయశబ్దమైన భూమీభృట్ఛబ్దమును రాయలవారు వాడిరి.

"గృహాసమ్మార్జనమో, జలాహారణమో, శృంగారపల్యంకకా
వహానంబో, వనమాలికాకరణమో, వాల్లభ్యాలభ్యధ్వజ
గ్రహాణంబో, వ్యజనాతపత్రధృతియో, ద్రాగ్దీపికారోపమో
నృహారీవాదమునాకు ! లేరె యితరుల్నీలీలకున్ బాత్రముల్."

స్వామీ! నీ యిల్లు ఊడ్చుటయా ? నీ పల్లకీని మోయుటయా ? పువ్వులు గ్రుచ్చుటయా ? ఓ నృహారీ ! నాకు వాదములెందుకు ? ఇది నీ లీలయైనచో దానికి పాత్రులైనవారు ఇతరులులేరా ?

అనగా విష్ణువు లక్ష్మివంకఁజూచి నవ్వి నేను వీనిచేతనే గెలిపించెదను చూడు అన్నాడు. అని విష్ణుచిత్తునితో "ఓయీ ! ఇచ్చట నీ యిష్టమా ? పద. నీచేత గెలిపింతును. వెనుక నేనున్నాను గదరా" అని. అంత విష్ణుఁచిత్తుడు మాటాడకుండ మధురకు బయలుదేరెను.

మధురకుచేరి రాజసభకు వెళ్ళెను. లోనికి ప్రవేశించెను. రాజతని ప్రతిభ కొలదిమాటలలోననే గ్రహించి యితడు వాదించుట కనుమతి

యిచ్చెను. అతడొకని తరువాత నొకనిగా వాదుల నోడించెను. అందఱి నోడించెను. ఇతడు వాదించుచుండఁగా రాజు ప్రేలాడకట్టిన బీరపూవుల వంటి నాణెముల జాలెము తెగి క్రిందపడెను. ఆకాశమునందు దేవదుందుభులు మొఱసెను. పూలవాన కురిసెను. అప్పుడిట్లయ్యెను.

"అద్ధావాగ్విబుధం బహోవచన కవ్యాహార మాహా వచ
స్సిద్ధం, బాఃకృతతాంగతః కలిరితి శ్రీసూక్తివిధ్యాధరం
బిద్ధౌద్ధత్యమగాల్లయంహి కుధియా మిత్యున్నదత్కిన్నరం
బద్దీ రాగ్రణిగెల్పుటుత్సవము నందయ్యెన్న భంబంతయున్."

అద్ధా – ప్రశంసావాక్యము. అద్ధాయన్న మాటయాడిన విబుధము– దేవతలు కలదియు; కవ్యము – పితృదేవతలకిచ్చు నన్నము; కవ్యాహారులు – పితృదేవతలు: వారు అహో అన్నారు. ఆం – ఈయుత్తరము సంస్కృతములో కోపము మొదలైనవానిని చెప్పును. కలికృతతాంగతః – కలికృతయుగ లక్షణమును పొందెను అని విద్యార్థులన్నారు. కిన్నరులు, కుధియా – దుష్టబుద్ధులయొక్క, యౌద్ధత్యం – పొగరుబోతు తనము, లయం అగాత్ – లయమును పొందెను అన్నారు. ఆ ధాత్రీసురని గెల్పుటుత్సవమునందు ఆకాశమిట్లయ్యెను తరువాత నెవరిదారిన వారుపోయిరి. రాజతని నూరేగింపించెను. ఆ సమయములో విష్ణుమూర్తి గరుత్మంతుని మూపునందుండి విష్ణుచిత్తునకు కన్పించెను.

"ఇంగిలికంబునం దడిపియెత్తుకసీసపు రెంటిమో యన
న్నింగి గరుత్పరంపరల నిగ్గునలేఁదొగరెక్కెఁ; నంత వీ
చెం గలశాబ్ధి మీఁగడల జిడ్డెలిఁగించెడు కమ్మగాడ్పు; నిం
డెం గడుమ్రోత; పెన్దిరువడిఁగని రాఖగరాజు మూఁపునన్."

గరుత్మంతునియొక్క ఱెక్కల కాంతిచేత నాకాశము తొగరు వన్నె వహించెను. వచ్చినగాలి పాలసముద్రముమీది మీగడల జిడ్డు వాసన వేసెను. అట్లాకాశమున తోచిన భగవంతుని విష్ణుచిత్తుఁడు స్తోత్రముచేసెను. దశావతారములను వర్ణించెను. శ్రీరామావతారము నిట్లు వర్ణించెను.

పవిధారాపతనంబుఁ గైకొనని యప్పౌలస్త్యుమై సప్తధా
తువులం దూఱు పరిశ్రమంబునకు నుద్యోగించెనా; సప్తసా
ల విభేదంబొనరించి నిర్వ్యాకసలీలన్ జన్న యుష్మన్మరు
జ్జవనాస్త్రంబొసఁగు న్సిరుల్ రఘుకులస్వామీ రమావల్లభా.

ఇంద్రుఁడు వజ్రాయుధముపెట్టి కొట్టగా పౌలస్త్యుడు (అనగా రావణాసురుడు) వానికేమియు దెబ్బతగులలేదు. అట్టివానిని చంపుటకు వాని శరీరములోనున్న ధాతువులను భేదించవలెను. ఆ ధాతువులసంఖ్య యేడు. సప్తధాతువులు. రాముఁడు సప్తసాల విభేదనముచేసెను. ఏడు తాడిచెట్లను నఱకెను. ఆ సప్తధాతు విభేదనముకొఱకు ఈ పరిశ్రమముచేసెనా! యన్నట్లున్నదట! అటువంటి రామునిబాణము సిరులొసగుగాఁత !

ఈ పద్యము మనుచరిత్రములోగూడ నున్నది. అంత విష్ణుచిత్తుఁడు మరల విల్లిపుత్తూరుపోయెను. అచ్చట సుఖముఁగానుండెను. అచట నుండు చుండగా నొకనాడు తనతోటలో తామరపూలు పూచిన దిగుడుబావిప్రక్క నున్న తులసితోటలో నతనికొక చిన్నపిల్ల కనిపించెను. అతనికి పిల్లలులేరు. ఆ పిల్లను తీసికొనిపోయి భార్యకిచ్చెను. ఇద్దఱు నాపిల్లనుపెంచిరి. ఆమెకు క్రమముగా యౌవనమువచ్చెను. ఆ యింటిలో నెప్పుడును హరికథలు విష్ణు సంగీతములు, విష్ణుగాథలు, భజనలు. ఆమెకు క్రమముగా విష్ణుభక్తి హెచ్చెను. విష్ణుభక్తియేకాదు. విష్ణువునందు ప్రేమకలిగెను. ఆమె మనస్సులో భగవంతుని పెండ్లియాడుదమని నిశ్చయించెను.

వారు మహాధనవంతులు ఆమెకు ముగ్గురు చెలికత్తెలుకలరు. ఒకామె పేరు మరాళి. ఇంకొకామెపేరు హారిణి. మూడవయామెపేరు స్రగ్విణి. వారిమెరహస్యమును తెలిసికొనిరి. ఆమె యొకనాడు కృష్ణకథలుచ్చరించుచు :

"నాఁడు మనమున్న నెట్లో పూఁబోఁడులార"
యనిన వారలు మగుడ నాయమకు ననిరి
"యింతినాఁడుండ కెందుఁబోయితివి నీ" వ
టన్న నచ్చెరువడి వారి కతిపపలికె.

'సకియలార; త్రైకాలిక జ్ఞానవంతు
లైన ఋషులట్లు పలికెద, రంతయెఱుక
యెదఁ గలిగెనేని యెఱిఁగింపుఁడేను మొదల
నెవ్వతె' నటన్న; మఱి వారలిట్టులనిరి.

"దివిజ ద్రుప్రసవంబుఁగాంచిన సపత్నింజూచి, చూపోప కిం
తవు జిల్గుంబని యంతసేసి మది నీర్ష్యాక్రోధ ముల్సందడిం
ప విరింబోకద్రుమునంబునైకొని, పతి న్మదన్న ద్రమానెల్లఁ దే
నవధింబెట్టిన సత్యవీ వహహా, కావా భామినీ" నావుడున్.

మన మా దినములలోనున్న నెట్లుండెడిదోయన్నది గోదాదేవి. ఆమె పేరు గోద. ఈపేరు ప్రసిద్ధమైనదే. గోదావరీనది యున్నదికదా! గోదా అన్న పేరును శబరి యన్న పేరును గలిపి గోదావరియైనదందురు.

అప్పుడు చెలికత్తెలు 'అప్పుడు నీవున్నావు!' అన్నారు. గోద తానప్పు డెవ్వతె? నన్నది. వారు నీవు సత్యభామవన్నారు. ఆమెకు పూర్వజన్మజ్ఞాన మంతయు వచ్చెను.

ఆమె యిట్లుగా నెంతయో భగవద్భక్తురాలై కృశించిపోయి చాల బాధపడుచుండగా విష్ణుచిత్తుడుచూచి విల్లిపుత్తూరులోని స్వామితో చెప్పగా ఆయన యామెను శ్రీరంగమునకు దీసికొనిపొమ్మనెను. అతఁడు దీసికొని పోయెను. ఆమెయచ్చట రంగనాథుని సేవించుచుండెను. తాను పూలదండ కట్టి ముందాదండ తానుతాల్చి తరువాత స్వామికివేయుచుండెను. అందుచేత నామెకు 'ఆముక్తమాల్యద' యన్నపేరు వచ్చెను. చివరకు వారిద్దరకు విల్లిపుత్తూరులో వివాహము జరిగెను.

ఇది యాముక్తమాల్యద మొత్తముమీది కథ. ఈ గ్రంథ మేడా శ్వాసములు. ఈ కథ ఈ ఏడాశ్వాసములమీద పఱచఁబడినది.

ఈ గ్రంథములో ప్రధానమైనవి ఋతువర్ణనములు. ఆ వర్ణనముల కవధిలేదు. ఆ కల్పనలకంతులేదు. రెండవ యాశ్వాసములో గ్రీష్మ ఋతు వర్ణనము. నాల్గవయాశ్వాసమున వర్షర్తు శరదృతు వర్ణనములు.

మరియు విశిష్టాద్వైతమతము బహువిధములుగా వర్ణింపఁబడినది.

మధ్య మూడవ యాశ్వాసములో ఖాండిక్యకేశిధ్వజ సంవాదమన్న మరియొక కథకలదు. నాల్గవ యాశ్వాసములో యామునాచార్య చరిత్ర కలదు. ఆరవ యాశ్వాసములో మాలదాసరి కథకలదు. ఏడవ యాశ్వాసములో నొక దుష్ట బ్రాహ్మణుఁడు బ్రహ్మరాక్షసుడెట్లయ్యెనో ఆ కథకలదు.

కాని యామునాచార్య మాలదాసరి కథలుమాత్రమే యిందు వ్రాయఁబడును.

## యామునాచార్య కథ

ఈ కథ శ్రీ విష్ణుమూర్తి తనభార్యతో చెప్పినట్లున్నది. విష్ణుచిత్తుఁడు గెలిచినప్పుడు స్వామి యిట్లన్నాడు : "ఈ విష్ణుచిత్తుఁడును యామునాచార్యుఁడును వీరిద్దరు నా దర్శనము నుద్ధరించినవారు" అని. దర్శనమనగా షడ్దర్శనములలో నొకటి. షడ్దర్శనములని యున్నవి. ఆయా మతముల యొక్క సిద్ధాంతములను నిరూపించు గ్రంథముల పేరు దర్శనములు. బౌద్ధ దర్శనము, సాంఖ్యమత దర్శనము, ద్వైతదర్శనము, అద్వైత దర్శనము మొదలుగ. ఈ యామునాచార్యుఁడు విశిష్టాద్వైత దర్శనమును సముద్ధరించెనని యర్థము.

ఈ యామునాచార్యుఁడు చిన్నప్పుడు వేదశాస్త్రములు చదువుకొను చుండగా నప్పుడు పాండ్యదేశము నొకరాజు పాలించుచుండెను. ఆ రాజు వెఱ్ఱిశైవమ్ము ముదిరి హరుడె పరతత్త్వమనును. అతడు జంగమార్చన చేయును. వీరభద్ర పళ్లెరములుపట్టును. శైవమతములు కట్టించును. వీర శైవమునుఁబూని జందెమునుఁ ద్రెంచివేయును. లింగముఁ దాల్చినవారే పాపముచేసినను లెక్కచేయడు. జనులు గంజాయి త్రావుదురు. కల్లు త్రావుదురు. వారు శివలింగమును ధరించినచో చాలును. కాని యతనిభార్య వైష్ణవురాలు.

"వింగడంబైనట్టి ముంగిట నెలకొన్న
బృందావనికి ముగ్గు వెట్టుఁదాన;
దశమినాఁడేక భుక్తము సేసి, యవలి నాఁ
డోర్చి జాగరముతో నుండునిట్టు;

కారసిపో నీదు; పైనిద్రఁ గాఁకుట
కోలుపాడు మత్పుణ్యకథలఁ ద్రోయు;
నేమంపు మూనాళ్లు కామింప దధినాథు
మఱునాఁడు కన్నును మనసుఁదనియ

నారజపువన్నెఁ బ్రియుసెజ్జకరుగుఁ గూర్మి
నరుగుచో నాభిఁదుడిచి కప్పురపు నాభిఁ
బెట్టు; నిట్టుల మద్భక్తి పుట్టియును ని
జేశునెడ భక్తి చెడదు మదిష్టమగుట."

(వింగడము — విస్తారము; సుందరము)

అనిచెప్పి భగవంతుడిట్లనును. "బ్రహ్మయు శివుఁడును నా శరీరములే వారిపూజ నా పూజయే. అయినను తారతమ్యము కలదు.

ఆ రాజు తామసప్రవృత్తితో ప్రవర్తించుచుండెను. అందుచేత నా భక్తులను నిరాకరించుటతప్పు. ఆ రాజుభార్య నా భక్తులకు రహస్యముగా దానములు చేయుచుండెను. విష్ణుభక్తులు రాజగృహముయొక్క వడమటి ద్వారమ్మునచేరి యామెవలన దానములుమొదలైనవి గ్రహింతురు. అప్పుడీ యామునాచార్యుఁడు రాణివద్దకుపోయి యామెతో తాను వాదమ్మునేసి శైవులను గెలిచెదననెను. ఆమె సంతోషించి యా రాత్రిపూట రాజుతో చెప్పెను.

"భూవల్లభ "డెట్టెట్టా !
తా వాదము నేసి శివమతంబు జయింపం
గా వచ్చెనొ ? చూతముగా,
రావింపు'మటన్న నాఁటిరాత్రి చనంగన్"

మరునాడు యామునాచార్యుఁడు రాజదర్శనమునకు పోయెను. అతడు వాకిటనున్న రావిచెట్టును సాక్షిగాచేసి లోనికిపోయెను. అతనినిచూచి జి ట్లనియెను.

"సంగతియె యోయి యిసుమంత లింగబావు
తత్త్వనిర్ణయవాదంబు దరమె నీకు !

నోడితేనియుఁబట్టి మొఱ్ఱోయనంగ
లింగమును గట్టకుడుగ, మెఱింగినొడువు.

సంగతియనగా నొక ప్రయోజనముండి రాజదర్శనమును వాంఛించుట. లింగణా—అనగా పొట్టిగుఱ్ఱము. ఆ వాదములకు నియమములు యామునాచార్యుఁడోడినచో రాణియు నతఁడును లింగములు ధరించవలయును. అతఁడు గెలిచినచో తాను చక్రాంకితములు వేసికొనును. వైష్ణవులు చక్రాంకితములు వేసికొందురు. అనగా సన్నని లోహచక్రమును కాల్చి భుజములమీద నంకితము వేసికొందురు.

అంత యామునాచార్యుఁడు శైవులనందఱను గెలిచెను.

"నీ వేమంటివి రమ్మం
చావలివానికిని మగిడి యట్లనె వానిం
గావించి, యొకఁడొకఁడు రా
నా విప్రుఁడు వాదసరణి నందఱఁ గెలిచెన్."

విష్ణుచిత్తుఁడు వాదించునప్పుడు కూడ నీ పద్యమునే రాయలవారు వ్రాసిరి. "నీ వేమన్నావు ? రా" అని వాదములో నాడుట గడుసుదనమని రాయలవారి యుద్దేశ్యము కావలయును.

అప్పుడు యామునాచార్యుఁడు విష్ణుదేవుండె పరతత్త్వమనియు, విశిష్టాద్వైతంబె మతంబగుటయున్ బ్రతిష్ఠించినన్ :

ఆ యెడను నొక్కపలు కెదు
రై యుండెడు పిప్పలమున నాయెను విన" నో
హో ! యిది నిక్కము నృప ! నా
రాయణుఁడె పరంబు, కొల్వుమతని" నటంచున్.

ఆ రావిచెట్టుమీద నిట్లు వినిపించెను. శైవు లోడిపోయిరి. రాజు వైష్ణవుఁడయ్యెను.

పాండ్యదేశమునకు నెప్పుడును మేనల్లుడు రాజ్యాధికారియగును. అందుచేత రాజు తన చెల్లెలిని యామునాచార్యునకిచ్చి పెండ్లిచేసెను.

అరణముగ నతని కర్ధరాజ్యమిచ్చెను యామునాచార్యుఁడు రాజై దిగ్విజయము చేయుటకు బయలుదేఱఁగా వర్షాకాలము వచ్చినది. ఆగి శరత్కాలమున బయలుదేఱుమని మంత్రులుచెప్పగా రాజాగెను. ఇచటనొక పెద్ద వర్షాకాల వర్ణనమున్నది.

ఇల్లిల్లుదిరుగ నొక్కింతబ్బు శిఖ; యబ్బె
నే నింటిలోఁ బూరియిడి విసరక
రాఁజదు; రాఁజిన రవులు కోల్పొసాలఁ
గాని కల్గదు; మఱి దానఁగలిగె
నేనికూడగుట మందైనఁ జెన్బొగ, సుఖ
భుక్తి సేకూర; దాభుక్తి కిడినఁ
బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము; దీఱ
నారుల కొదవుఁ బునఃప్రయత్న

మాజ్యపట ముఖ్యులయమెన్న; దాలయాంగ
దారులయమెన్న రంతిక కారజనికి,
పచన నాంధోగృహిణి రామిఁబడుకమరుఁడు
వెడువెడనె యార్పనొగిలి రజ్జడిని గృహులు."

(శిఖ – నిప్పు.)

శ్రీకృష్ణరాయలవారి వర్ణనలు పరమసహజములుగానుండును. కాని కొన్నికొన్ని మాటలు జాగ్రత్తగాచదివి తెలిసికొనవలయును. తెలిసికొన్నచో నెంతయైన యానందము కలుగును.

తఱువాత మరలనంతటి శరదృతు వర్ణనమున్నది. అప్పుడా యమునాచార్యుఁడు దండయాత్ర బయలుదేఱి సర్వరాజులను గెలిచి యింటికివచ్చి యజ్ఞములుచేసి భోగము లనుభవించుచు కూర్చుండెను.

ఇతఁడు జన్మచే రాజుగాదు. నిజముగా నతఁడుపొందవలసినది యోగసామ్రాజ్యము. ఇది వ్యతిక్రమము. ఇఁసితాత ఎంతో నైష్ఠికుఁడు. ఇతని రాజ్యవ్యసనము నెవరు మన్నింతురు ? అని శ్రీరామమిశ్రుడన్న పండితుఁడు భావించెను. అతడు యామునాచార్యుని పితామహుడైన నాథమునికి

శిష్యుడైన పుండరీకాక్షునకు శిష్యుడు. ఆయన యీ యామునాచార్యుని భోగలాలసనుగురించి భయపడి యామునాచార్యునకు అలర్కశాకమలవాటు చేయించెను. అలర్కమనగా ముళ్లయుచ్చింత కూర. అది యొకరుచిగా నుండును. దానిని తిన్నచో విజ్ఞాననాశంబగును.

ముల్లు దలకొనని ననకపు
బల్లవములతోడ ముక్తిభామ చెవులకుం
బల్లేరు బువ్వులగు పువు
లుల్లసిలు నలర్కశాక మొదుగుగ గొనుచున్.

మోక్షలక్ష్మి చెవులకు ఈ ముళ్లయుచ్చింత పువ్వులు పల్లేరుపువ్వుల వలె నుండుట.

ఈ రామమిశ్రుడు ప్రతిదిన మాకూర తెచ్చియిచ్చును. రాజైన యామునాచార్యునకది చాలరుచిగానుండెను. రాజునకు ప్రతిదినము నొక బ్రాహ్మణుడు తెచ్చియిచ్చుచుండెనని తెలిసెను. యామునాచార్యు డతని పిలిపించి నీ కేమికావలయును? అనియడిగెను. అతడు "మీ పెద్దలుకూర్చిన నిక్షేపమొకటి కావేరీనదియొక్కలంకలోనున్నది. దానిని నీకుచూపవచ్చితి" ననిచెప్పి రాజునచ్చటికి దీసికొనిపోయి శ్రీరంగపతిని చూపించెను.

అంతట యామునాచార్యునకు వైరాగ్యము కలిగెను. అతడు తన కొడుకునకు రాజ్యమిచ్చి తాను సన్యసించి వెడలిపోయెను.

## మాలదాసరి కథ

ఈ కథ యొక యాశ్చర్యమైన కథ. శ్రీ రాయలవారి యనేక పద్యములు ఇతరకవుల పద్యములవలె నోటికివచ్చునట్లుండవు. అర్థగాంభీర్యము కొఱకు నెమ్మదిగా చదువుకొనవలయును. మాటలకూర్పులో గడుసుదన ముండును. పలుకుబడిలో కుదింపు ఉండును. నడుమనడుమ నిఘంటువులలోని మాటలుండును. పాఠకుడు శ్రమకోర్చినచో బ్రహ్మానందము నందును.

ఒక పేర్కొనరాని కులమునందు విష్ణుభక్తు డొకడుకలడు. శ్రీమహా విష్ణువు వామనావతారము వహించిన పుణ్యభూమికి మూడామడదూరమున

నొక పల్లెటూర నతడు నివసించును. అతఁడు బ్రాహ్మవేళ చనుదెంచి యా స్వామిని మంగళ కైశికిరాగముతో పాడి సేవించును. ఇచ్చట నితని యాకారము వర్ణింపబడినది. అతఁడు తన చెక్కిళ్ళయం దానందాశ్రువు లుబుకగా పాడి తనబడుపుఁనుదించికొని తాండవమాడును. అతని చేతిలో వీణయుండును. అది కిన్నరవీణ. దానిపేరు చాండాలిక. అది చిన్నది. దాని కొక్కటియే తంతియుండును. అతఁడు ప్రొద్దెక్కువఱకు పాడును.

"అట్లు దడవుగఁగొల్చి సాష్టాంగ మెఱఁగి
గర్భమంటపిఁ గడిగిన కలఁక జలము
లోని రా తొట్టినిండి కాలువగఁ జాఁగి
గుడి వెడలివచ్చునది శూద్రుఁడిడఁగ గ్రోలి.

ఇట్లు దినములుఁ గడుచుచుండగా నొకనాటి యర్ధరాత్రమున కోళ్ళ గుడిసెలో నొకపిల్లి దూరగా కోళ్ళుఅచెను. అతఁడు వేళయైనదని బయలు దేఱెను. దారిలో మరులతీగెత్రొక్కెను. మరుఁతీగెత్రొక్కినచో మనుష్యులకు దారి తెలియదు. అడవిలో నూరక తిరుగుచుందురు. అతఁడిట్లు తిరిగి తిరిగి చివరకు తెల్లవాఱునప్పటికి నిర్జనమైన యొకయడవిలోనికి చొచ్చి వెళ్లు చుండెను. ఆ సీమ నానా ఘోరముఁగనుండెను. పాఁశ్రేను ఉత్తరేణు, కసింద కొరింతపొదలు. పూర్వమెప్పటివో వడ్లగరిసెలక్రింద లాగలుత్రవ్విన యెలుకలు. చీమలు బియ్యమునులాగగా అవియెండి యేవో లేచినమొక్కలు. తిండిలేక మీసాలాడించు బక్కపిల్లులు. పూర్వమది యూరుకావలయును. పాడైపోయిన యేతాలు. అతఁడు కాళ్ళలో గ్రుచ్చుకొనిన ముళ్ళను, పల్లేరుకాయలను జాగ్రత్తగా తీసికొనుచు పోవుచుండెను. పోయిపోయి యితఁడొక పెద్ద మఱ్ఱిచెట్టును చూచెను. అచ్చటనొక సన్నని కాలిత్రోవ చూచి దానివెంటపోయెను. ఆ త్రోవ మరియు కళ్మలముగానుండెను. ఆ దారిలో మెదడుజుఱ్ఱివైచిన మనుజులపుఱ్ఱెలు, దంతములతో మాంసమును గీరిన బొమికెలు. మానవశరీరములలోని బొమికెలకోసము పోరాడుచున్న కుక్కలు—ఇట్లు కనిపించెను. మరియు నాడకుక్కలు ముంగాళ్ళమీద సాగి పైకి దొంగచూపులు చూచుచూ బొమికెలెత్తుకొని పారిపోవుచుండెను. అనగా చెట్టుమీద నెవరోయున్నారు. వారు చంపుదురనిభయము. మాంసపు

ముక్కలు తోరణముగా సెండకట్టఁబడినవి. వానినితన్ని రావులుగులెత్తుకొని పోవుచుండెను. ఎవరోకొట్టఁగా దెబ్బతిని రొండిన చేతులుపెట్టుకొని కోతులు పారిపోవుచుండెను. దానిని చూచి మాలదాసరి పైన నెవఁడోయున్నాఁడు, వాడు మనుష్యుఁడుకాడని నిర్ణయించుకొనెను. అప్పుడు వానికి వాఁడు కనిపించెను. వాఁడు చచ్చినమనుష్యుని శవమును గోచిగాపెట్టుకొనెను. తల్లక్రిందులుఁగానున్న పన్గుతలకాయలవలెనున్నది వానిమొగము. పాయగా తీసిన పెద్ద గడ్డముతో కోరలతో వానిమొగమట్లు కన్పించుచుండెను. వాఁడు ప్రేవులను జందెముగా వేసికొనెను. ఆ జందెము జారుచుండగా దానిని కసరి సర్దుకొనుచుండెను. వానికింత పెద్దపొట్ట. భేతాళికలను బండతిట్లు తిట్టుచుండెను. వానిపేరు కుంభజానువు. వాఁడొక బ్రహ్మరాక్షసుఁడు.

మాల దాసరివానిని చూచి తప్పుకొందమనుకొనెను.

"వాఁడునుఁ గంటిఁబోకుమని వ్రాలె మహీ న్విటపాళి నుగ్గుగా
వీఁడును మున్ను రేవగటివేళకు మానిసియౌటఁ బోరిలో
వాఁడిమిఁ గొంతకాలమిల వ్రాలుట, లావరియౌట, నిల్చియా
వాఁడిశరంబుచే నడువ, వాఁడది ద్రుంపుడువీఁడు నుద్ధతిన్."

కనపడినావులే పారిపోకుము, అని వాడు చెట్టు దూకివచ్చెను. మాల దాసరి పూర్వము యుద్ధభటుఁడు. బలవంతుఁడు. బాణముతో కొట్టెను. వాఁడా బాణమును త్రుంచెను. వాఁడుచొచ్చినప్పు డితఁడుదూకెను. వాఁడు కొట్టినచో తప్పుకొనెను. వాఁడు పైనఁబడఁగా పిడికిళ్లబలిమిలోఁ బడక నిలిచెను. వాఁడు చంపుటకురాఁగా వీఁడుగ్రుద్దెను. చివరకు మాలదానరి తప్పించుకొని పారిపోవ యత్నింపగా వాఁడు తన రాక్షసీచయమును పిలిచెను. ఆడరాక్షసులు వచ్చిరి. వారును వచ్చిరి. అందఱు పట్టుకొనిరి. మాలదాసరి పెనగుచునేయుండెను. చివరకు దాసరిని మఱ్ఱిచెట్టువద్దకులాగిరి. వానిని కట్టివేసిరి. ఆ రాక్షసుడిట్లనెను. "నన్నింత బాధపెట్టిన నిన్ను న్యాయముగా చంపనురా" అని దాసరిని కోలుకొక్కెఱగా పడఁద్రోసెను. కోలుకొక్కెఱయనఁగా నెడ్లకు లాడములువేయుటకు పగ్గములు వేసి పడఁద్రోయుపద్ధతి. (ఈమాట బహుగ్రంథములయందు బహువిధములుఁగా నున్నది. ఒక గ్రంథములలో 'గోలగర్గెర' యనియున్నది.) వానినిఁజంపుటకు

వానినెత్తురోడ్చుటకు కత్తిని, పాత్రను తేఁబంచెను. అపుడు దానవరి దైన్యము లేకుండ ధర్మమును చెప్పెడువానివలె నిట్లుచెప్పెను :

వినుమొకమాట రాత్రిచర వేగిరమేటికి? నిన్ జయింతు రే
యనిమిషులైన? భాజనగతాన్నము నే నిఁక నెందుఁబోయెదన్ ?
జనఁగక ప్రాణరక్షణ ముపేక్షయొనర్చుట పాప మిందుకై
కనలకు, నాకు మేనియెడఁ గొంతయులే దిదివోవుచేయురున్.

ఓయి రాత్రిచరా! రాక్షసుఁడా! అనిమిషులైనఁ దేవతలైన, నిన్ను జయింతురా? నేను భాజనగతాన్నమును. అనగా కంచములో వడ్డించుకొన్న అన్నమువంటివాడను. నేను నీతో పెనగితిని. ప్రాణరక్షణ చేసికొనకపోవుట పాపము. అది ఆత్మహత్య క్రిందికివచ్చును. కోపపడకు నాకీ శరీరము మీద పెద్దకాంక్ష లేదు.

హీనజన్మ మణుట ఎవ్వడే నొకప్రాణి
సంతసిలుట ముక్తిఁబొందఁ గనుట
మేలెకాదె; శిబియు మేల్పొంతిగాఁడె న
శ్వరపు దేహమునిమ్మి పదము గొనుట.

నాది హీనజన్మము. చండాలజన్మను. అది పోవుచున్నది. ఎవరో ఒక ప్రాణి! నీవు సంతోషించుచున్నావు. నేను మోక్షము పొందఁబోవుదును. శిబిచక్రవర్తి నశించిపోవు శరీరమునిమ్మి మోక్షము పొందినాడు. అది మేలుకదా

మనుజునకు మృత్యువనేక విధములుగా వచ్చును. ఈ శరీరమూరకే పోకుండ ఆకలిచే బాధపడువాని నొక్కని రక్షించుట న్యాయముకదా! నీవు దేవయోనివి. జంతువులలో మానవులకంటె మీకు శక్తి ఎక్కువ. మీకు జ్ఞానముకూడ నెక్కువ. మనుష్యమాంసము తినుట దురాహారము. చనిపోయినతరువాత నుత్తమలోకములు చెడునుఁగదా! నేడుగాకున్న రేపైనను మీరైనను చచ్చెడుదే! మీరును దేవత లన్నదమ్ములు. వారు సాధువులై యుండగా మీరసాధువులై యుండుటచేతనేకదా, వారికి పరముకలుగుట. మీకు పరముచెడుట జరుగుచున్నది. అనగా బ్రహ్మరాక్షసుడిట్లనెను :

"చంపకు చదువుల, మేము ప
ఠింపని శాస్త్రములే? మా పఠింపని శ్రుతులే?
యింపవవి నమ్మ వే 'ప్రథమాం
పిబ తేవహ్ని' యనెశ నూటవుగాదే!

ఓయి! అగ్నిహోత్రుడు సర్వాశికదా! ఆయన దేవతయేకదా! దేనిని పడినదానిని తినునుగదా! గరుత్మంతుడు హరికి శ్రీ విష్ణుమూర్తికి హితుడు కదా! అతడు పాములనుచంపి తినుచుండునుగదా! మాకు మీరు జాత్యన్నము.

నిదురయుఁ గూడుఁబోఁ జదివి, సేనిటఁ గన్నదియేమి? యెవ్వఁడీ
చదువుల యర్థవాదపు మృషల్వినిబేల్వఁకు, నీవు మాయెడం
జదువుల మాటలాడి కనఁజాల వొకానొక మెచ్చు, నొక్కఁ 'డీ
చదివిన కూరసింత చవి, చాలఁగఁ దె' వ్వనను మెచ్చుదక్కగన్.

ఓయీ! నేను బ్రహ్మరాక్షసుఁడను. అనగా పూర్వము బ్రాహ్మణుఁడను. నేను నిబ్రాహారములులేక చదివి యేమి బాగుపడ్డాను? మాదగ్గఱ చదువుల మాటచెప్పి నీవు ప్రశంసపొంచలేవు. ఇంతకును నీవు చదివినకూరవు అది యెక్కువ రుచి.

అనగా దాసరి నీవు సర్వజ్ఞుఁడవు. శాస్త్రములు చదివినవాఁడవు. నీతో నేను వాదించఁగలనా? నాదొక ప్రార్థనయున్నది వినుము. ఈ సమీపమున కురుగుడిలో వైకుంఠుఁడున్నాఁడు. నేను ప్రతిదినము నతనిని పాడివత్తును. అది నాకు వ్రతము. నేఁడు చివరిరోజు. నన్ను వదలుమనెను.

అంచునతఁడు వల్కఁ దరహాసినిఁ జెక్కిలిఁగొట్టి లెస్స పం
డించితివోయి దాసరి! వనిం దెరవాటులు గొట్టికొట్టి మే
న్వేంచి విరక్తి దాసరివి నిన్నఁ దా యయినాఁడ వీమమున్
గొంచెముఁజేసి త్రొడ్డోటికి కోఁదలపోసెదు మెచ్చితి నిన్నున్.

ఏ రాజ్యంబు నరుండునోరి కడివో నీబోధ మాలించు? నిం
కేరాజ్యంబు నరుండు బాసకయిమే నీఁదాన యేతెంచు? దీ

పార న్నేఁజననీమియున్నగిడి నీవారామియుండెల్ల; మే
లారంతు ల్వలు వల్కు లంత్యకుల యేలాచింత లేలావగల్.

తెరవాటులు – దారిదోపిళ్లు;

బ్రాహ్మణికి కోఁదలపోసెదు – ఏ రాజ్యపు మానిసిరా నీ మాటలు నమ్మెను? ఏ రాజ్యపు మానిసిరా మాట నిలబెట్టుకొనుటకు మేనీయగా తానే వచ్చెను ? నేను నిన్నువదలను. నీవు మరలరావు.

ఇందులో ఏ రాజ్యపు మానిసివనుట క్రొత్త పలుకుఁబడి. ఆనాఁడు కొంతమేఱ విజయనగరరాజ్యము, కొంతమేఱ గజపతులరాజ్యము–ఇట్లుండె డిది ఇది యానాటిమాట.

అనగా మాలదాసరి చెవులుమూసికొని హరిహరీ, యని నేను రాఁక పోయినచో విష్ణువుతో నింకొకవేల్పును సరిగా లెక్కించిన పాతకినౌదును ! అని ఒట్టువేసికొనెను.

బ్రహ్మరాక్షసుఁడు వానినినమ్మి వదలెను. వాఁడుపోయి చాండాలిక మీద స్వామినిగూర్చి పాడి తిరిగివచ్చి రాక్షసునితో నిట్లనెను.

నీ చెఱఁజాసి పోయి రజనీచర చక్రిభజింప ముక్తి పొం
దే చెర, యే చెఱందవులనే, నీఁక నుండగఁజూడు; పంచుచో
నేచరణంబు లేయుదర మేయు ర మేశిర మేకరంబు లీ
వాచరణంబు లాయుదర మాయు ర మాశిర మా కరంబులున్.

చెఱ – చెరసాల; రజనీచర–రాక్షసుఁడా ?; ముక్తిపొందు–మోక్షము యొక్క కూడిక: ఏచెర – వృద్ధిపొందినదయ్యా !, నేను వెళ్ళునప్పుడు నా యవయవము లెట్లున్నవో మరలనట్లున్నవో లేవో చూచికో అనగా రాక్షసుఁడు వాని నిజానికి నబ్బురపడి యొడలుపులకరించగా మధ్యాహ్నపు టెండకు వాని బట్టతల మాడుచుండగా పిచ్చియెక్కిన యేనుగువలె వాని చుట్టు ప్రదక్షిణించి వాని పాదములమీద పడి దాసరియొక్క యొక్కొక్క పాదము తన దంతములమీద నెత్తిపట్టుకొని "ఓయీ ! నీకు సాటియెవ్వరు ?

నీ ధైర్యము నీ నిజమును చెప్పరానివి. వీనియందు కురుంగుడినంబి కృపావలంబివైన నీకు నెవ్వరును సరిపోలరు.

అనఁగా-దాసరి రాక్షసుని కౌగలించుకొని :

"ఓయీ ! నీ దయవలన నీ నాఁడు నావ్రతము చెల్లినది."

"జాసలు బండికండ్లు మఱి ప్రాణభయంబున లక్షసేసి నం
గ్రాసము కృచ్ఛ్రలబ్ధముడు గన్వసమే ? యిది నీకచెల్లనో !
భూసురవంశ్య ! పుణ్యజన పుణ్యజనాంకము దావకీనమే
పో, సమకూరెడిం గులముపొత్తున దైత్యులకెల్ల నం కతన్.

జాసలు - వాగ్దానములు; బండి కండ్లు — బండి చక్రపుటాకులు; గ్రాసము - తిండి; కృచ్ఛ్రలబ్ధము — కష్టముమీదగాని దొరకదు. ఉడుగన్ వశమే — భోజనము మానివేయుట సాధ్యమా ? పుణ్యజనా! - ఓ రాక్షసుడా!; రాక్షసులకు పుణ్యజనులని పేరు. రాక్షసు లందఱు నీ మూలముగా పుణ్య జనులైనారు.

[శబ్దమునకు రెండర్థములుండును. ఒకటి యౌగికార్థము. రెండు రూఢ్యర్థము. యౌగికార్థమనగా వ్యుత్పత్త్యర్థము. రూఢ్యర్థమనగా వాడుకలోనున్న యర్థము. పంకజము-రూఢ్యర్థము తామరపువ్వు. యోగార్థము-బురదయందు పుట్టినదియని. సంభావన - యోగార్థము, గౌరవము; (రూఢ్యర్థము) యాచన; అట్లే పుణ్యజనుఁడు. రూఢ్యర్థము రాక్షసుఁడు. యోగార్థము పుణ్యముకల మనుష్యుడని.]

అని మరల దాసరి యిట్లనెను. "కడుపాకలితో నకనకలాడఁగా నన్ను వదలిపెట్టితివి. మేము మీజాతికి అన్నము. నామీదనొట్టు. నన్ను భక్షింపుము." అనగా రాక్షసుఁడు "ఏమయ్యా ! ఇట్లనుట న్యాయమా ? ఈ మనుష్యమాంసముతో నీ శరీరము నెన్నాళ్లు పోషించితిని ? ఎవడో మహానుభావుఁడు రాడా నన్ను రక్షించఁడా ? అని యెదురు చూచుచుండగా

మహానుభావుఁడవగు నీవు వచ్చి యిట్లనుట న్యాయమటయ్యా! నా శరీరము తినుమనుట దయయా! నన్ను రక్షించుమనుట దయగాని. నీవు దయతో నీ వీనాడు స్వామినిగూర్చి పాడినపాటయొక్క ఫలితమిమ్ము. నే నీ దుష్ట జన్మఁబాసెదన నెను. అంత దాసరి యిట్లనెను: "ఓయీ! ఒకనాటి సంగీత ఫలమే! ఒక్క నిముసము పాడినఫలముఁగూడ నీయను, దేనికీయవలయును? ఈ శరీరముకోసమా?

పక్షుల తనువెత్తి తిరిప తనువుఁదోన
        యెన్ని మార్లెత్త మీ యేను నీవుఁ?
కేసరి తనువెత్తి కీట తనువుఁదోన
        యెన్ని మార్లెత్త మీ యేను నీవుఁ?
మాతంగ తనువెత్తి మశక తనువుఁదోన
        యెన్ని మార్లెత్త మీ యేను నీవు?
ధరణీశ తనువెత్తి దాస తనువుఁ దోన
        యెన్ని మార్లెత్త మీ యేను నీవు?

సోమయాజుల మెన్ని మార్లాము, శ్వపచ
ఖనకులుల మెన్ని మార్లును గాము; సోము
గాములము నెన్ని మార్లును గాము వెండి
కంస రిపు భక్తుల మొకండె కాముగాని.

ఎన్ని జన్మలెత్తితిమి కాము? విష్ణుభక్తులము కాముగాని ఈశరీరము కోసము పుణ్యమమ్ముట పచ్చకర్పూరమిచ్చి యుప్పు తీసికొన్నట్లు" అనగా రాక్షసుఁడు.

సంగీత ఫలంబునఁ గో
సంగి సగమైనఁ దయపొసఁగ నీవే; మీన్
మ్రింగిన గ్రుక్క న్వారిధి
కిం గొరతయొ? కొదయొ విష్ణుకీర్తన కనినన్."

గోసంగి - మాలవాడు; చేప సముద్రములో నొక గ్రుక్కెడు నీళ్లు త్రాగినచో సముద్రమునకు లోటా ? నాకుఁ గొంత యిచ్చినచో నీ విష్ణు కీర్తనకు కొదువయగునా ?

అనగా దాసరి యిట్లనియె :

"ఏలా నొంచెద దేహమిట్లడిగి ? యొంతే బాస మేనం బలం
బో, లీలావటు గీత కీర్తనఫలంబో, నీయెడ న్మున్నుపా (బే)
తాళప్రశ్నలు మాని మేన్గొనుము; బేతాళచ్ఛలోక్తిన్ రుషం
దూలింపం దలఁ తేని; పుట్టుమఱి నూతుల్ద్రివ్వ బేతాళముల్."

ఓయీ! అదేహము-దేహముకాని దానిని; అడిగి ఎందుకు బాధించెదవు? మన యిద్దఱినడిమి యొప్పంద మేమిటి ? నా శరీరములోని మాంసమా ? కీర్తనఫలమా ? పాతాళప్రశ్నలు మానుము. చిక్కుప్రశ్నలని యర్థము. రాక్షసులు పెట్టెడు మిషమాటలుపెట్టి నన్ను ఢింకాకొట్టింపఁ దలంతేని నూతులుత్రవ్వగా బేతాళములుపుట్టును. (ఈమాట లోకములోని సామెత.)

అనగా సాలకటంకశేయుఁడు అనగా రాక్షసుఁడు. సాలకటంకట - అన్నది ప్రజాపతి సృష్టిలో నొకానొక రాక్షసస్త్రీ పేరు. దాని సంతానము సాలకటంకశేయుఁడు. వాడు సాల కటకటంబడి యిట్లన్నాఁడు. "అయ్యా ! విష్ణుభక్తులకు దయవలదా ? పూర్వము రామానుజాచార్యుఁడు గురువు చెప్పినమంత్రమును శ్రీరంగమునందలి గోపురమెక్కి యందరకు చెప్పఁగా గురువు కోపించగా నేమనెను. "స్వామీ ! నే నొక్కఁడను రౌరవనరకమునఁ బడుదును. విన్న ప్రజలందఱు మోక్షములకు పోపుదురుకదా" అనగా గురువు సంతోషించెను. ఇట్లు రాక్షసుఁడెన్నోచెప్పి దాసరి పాదమ్ములమీద పడి ఆపాట ఫలములో సగమువద్దు పాతిక యిమ్మనెను.

దాసరి యీాయనసెను, అప్పుడు రాక్షసుడు "కానిమ్ము నీవు నేడు స్వామినిఁగూర్చి యనేక కీర్తనలు పాడియుందువు. చివరి కీర్తన ఫలమైన

నిమ్ము. ఈయనిచో నేను నీకాళ్లు వదలను." అని మొండిపట్టు పట్టఁగా చివరకు దాసరిగుండెలో జాలి యుదయించెను. జాలికలిగి యిట్లనెను: "ఓయీ! స్వామియొక్క కైంకర్యమునకు ఫలితమింతయని నేనెట్లు చెప్పఁగలను ? కొంత తీసికొమ్మనుటకు నేనెవ్వఁడను. నిన్ను భగవంతుఁడే రక్షించును. ఊఁ అడిల్లు మనగా మాలదాసరి నోటిమాట వానినోటనేయుండెను, బ్రహ్మరాక్షసుఁడు వాని రాక్షసత్వము పోయి - పూర్వమతఁడు సోమశర్మ యన్న బ్రాహ్మణుఁడు—ఆ సోమశర్మయై నిలచెను. అతడు మహాభాగవతశ్రీ బొందెను. మాలదాసరికి ప్రదక్షిణముచేసెను. వానిని స్తోత్రముచేసెను. అతఁడు మరల పెండ్లాడలేదు. తీర్థయాత్రలు సేవించెను.

కనుక విష్ణుకీర్తనవంటిది మరియొకటి లేదు.

# వసుచరిత్ర

ఈ గ్రంథము తెలుఁగు భాషలో నున్నదని చెప్పఁబడు పంచ కావ్యములలో నొకటి. ఈ గ్రంథమును వ్రాసిన యాయన పేరు రామరాజ భూష ణుఁడు. భట్టుమూర్తి యని యాయన కింకొక పేరు. ఇది మహాశ్లేషకావ్య మని చెప్పుదురు. రెండర్థములు గల కావ్యములు వేఱే యున్నవి. రాఘవ పాండవీయము, నల హారిశ్చంద్రోపాఖ్యానము, రావణ దమ్మీయము మొద లైన గ్రంథము లున్నవి. అవి రెండు కథల జోడింపులు. ఇందున్నది ఒక్క టియే కథ. కాని యిందనేకములైన శ్లేషలున్నవి. ఇంచుమించుగా ప్రతి పద్యమునందు శ్లేషలు కొల్లలు కొల్లలుగా నుండును. ఈయన పెద్ద పండి తుఁడు. ఈ కథ చమత్కారమైనది.

చేది దేశము కలదు. వింధ్యకు దక్షిణమున చేది, చేర, పాండ్యాది దేశ ములు పూర్వముండెడివి. అందులోనిది యీ చేదిదేశము. ఆ దేశమునకు రాజధాని అధిష్ఠానపురము. సామాన్యముగా మన పూర్వకావ్యము లందొక పట్టణమును జెప్పెదరు. ఆ పట్టణము నందలి నాల్గు వర్ణములవారిని, కోటను, అగడితను, పూవులమ్మెడువారిని మిక్కిలి వర్ణింతురు. ఇందు నట్లే కలదు. ఆ యూరి ప్రక్క శుక్తిమతి యన్న నది ప్రవహించుచున్నది.

చెన్నగు నన్నదీ పులినసీమల దాఁగిలిమూఁత లాడుచున్
వెన్నెల రేలు కప్పురపు విప్పుటనంటుల నీడ నీఁగు రా
కన్నెల బోయునన్నులకుఁ గన్నులు మూయు దదీయ వాసనల్
మన్ననఁ గాంచి క్రప్పు దుమారము రేఁచు సమీర డింభముల్.

ఆ నదియొక్క యిసుకలయందు రాచకూతుండ్రు వెన్నెల ఱేలయందు దాఁగుడుమూఁత లాడుదురు. అచటనున్న గాలి కుఱ్ఱవాండ్రు కప్పురంపు పొడి వారి కన్నులలో చల్లి వారికి సహాయపడుదురు.

ఆ రాజధానికి రాజు వసు నృపాలుఁడు. ఆయన పేరు వసువు. పెద్దన్న గారు మను చరిత్రమును వ్రాసిరి. ఈయన వసుచరిత్రమును వ్రాసెను.

సామ్యము పట్టి పేరునందే ! మనుచరిత్రలో నున్నది మనువుయొక్క కథ కాదు. మనువుయొక్క పుట్టుక కథ. ఈ పుస్తకము మాత్రము నిజముగా వసువన్నరాజు కథ.

దేవతలలో వసువులని కొందఱున్నారు. వారెనిమిదిమంది. వారిలో నొక్కఁడే భారతమునందు భీష్ముఁడై పుట్టినాఁడందురు. ఈయన కూడ వారిలో నొక్కఁడే—యిచ్చట రాజై పుట్టినాఁడు.

హిమవత్పర్వతము కుమారుఁడైన కోలాహలమన్న పర్వతము శుక్తిమతీనది కడ్డముగా వచ్చి నిలువఁగా నీ వసురాజు తన కాలి బొటనవ్రేలితో వానిని గవ్వను మీటినట్లు మీటెను. అప్పుడు దేవేంద్రుఁ డితనితో స్నేహము చేసెను.

ఆ కోలాహల పర్వతము పాపము ! ఆ రాజుయొక్క కాలివద్దఁ బ్రాణాచారము పడియుండఁగా రాజు దానిమీద దయపూని దానిని కేళిశైలముగా మన్నించెను.

అతఁ డీరీతిగా మహాశౌర్యవంతుఁడై యుండఁగా వసంత ఋతువు వచ్చెను.

లలనాజనాపాంగ వలనావసదనంగ
తుల నాభికాభంగ దోఃప్రసంగ
మలసానిలవిలోల దళ సాసవ రసాల
ఫలసాదర శుకాలపన విశాల
మలి నీల గరుదనీక మలినీకృతధునీ క
మలినీ సుఖితకోక కులవధూక
మతికాంత సలతాంత లతికాంతర నితాంత
రతికాంతరణతాంత సుతనుకాంత

మకృత కామోదకురవ కావికలవకుల
ముకుల సకల వనాంత ప్రమోదచలిత
కలిత కలకంఠకుల కంఠకాకలీ వి
భాసురము వొల్చు మధుమాస వాసరంబు.

పద్యముయొక్క యర్థమట్లుంచి తాత్పర్యమేమనగా వసంతకాలపు దివసము వచ్చెను అని.

ఈ భట్టుమూర్తి గొప్ప సంగీత విద్వాంసుఁడు. ఇట్లు పద్యము వ్రాయుట మరియొక్కనికి సాధ్యము కాదు.

అట్లుండ నుద్యానపాలురు వచ్చి రాజుతో పూఁదోటలోని సౌందర్యమునుగూర్చి చెప్పుచుండిరి. ఈ మీ పూఁదోటతో చైత్రరథమును సాటి చెప్పుటకు వీలులేదు. కుబేరుని పూఁదోటకు చైత్రరథమని పేరు. ఇక్కడ నున్న యొక్కొక్క చెట్టే చైత్రరథము. తమరు వచ్చి పూఁదోఁటనుఁ జూడ వలయునని ప్రార్థించిరి. అంత రాజునకు పూఁదోటను జూడవలయునని పించెను. దానికోసము రథమును దెప్పించెను. దానిమీద నెక్కి పుష్పోద్యానమునకు వెళ్లెను. వెండి బెత్తాలవారు 'సాంగు భళా' యనఁగా తేరుఁ దిగి తోటలోనికి పోయి తోటలోని సౌందర్యమంతయుఁ జూచుచుండెను.

ఆ పూఁదోటలో ననేక దోహదక్రియలు జరుగుచుండెను. దోహదములనఁగా వేళకానివేళ వృక్షములను పూయించుటకు, ఫలింపజేయుటకు జేయు ప్రయత్నములు.

అప్పు డా కొండమీద నున్న ఒక కిన్నరదంపతులు "ఓ రాజా! నీకు కొద్దిలో అన్యదురాసదమైన యొక శుభము కలుగబోవుచున్నది" అని చెప్పి వెళ్ళిరి.

అంతట నా రాజు తనకు కలుగఁబోవు శుభము కొఱకెదురుచూచుచుండెను.

రాజులకు నర్మ సచివు లుందురు. అనఁగా వారు రాజున కెప్పుడును సంతోషము కలిగించుచుందురు.

అప్పు డొక నర్మసచివుఁడు రాజుతో నిట్లనెను: "రాజా! నా చే చాయన చూడుము. ఆ యాకాశములో నల్లని మబ్బులో కొన్ని చెట్లు గలవు. అవి నందన వనములోని వృక్షములు" అని అనఁగా రాజు నవ్వి

(7)

"ఓయీ! అది మన క్రీడాపర్వతము. అది యింద్రనీలమణులతోఁ గట్టిన ప్రదేశము. అవి నందనవనములోని చెట్లు కావు."

ఆ నర్మసచివుఁడు చాల సేపా కొండను పొగిడెను. వారిద్దఱును నా కొండ నెక్కి విశ్రమించుచుండఁగా వారి కొక్క కలస్వనమ్ము విన వచ్చెను.

> "వీనులవిందై, యమృతపు
> సోనల పొందై, యమంద సుమచలదళినీ
> గానము క్రందై, యాస్వన
> మానందబ్రహ్మమైన నధిపతి వల్కెన్."

అప్పుడు రాజు

> "నానాగాయన గాయనీమణుల గానం బుర్వి నాలింపమో
> నానాఁటన్ నగభేది వీటఁగల గన్ధర్వాప్సరోగీత వి
> ద్యా నైపుణ్యము లెన్నియేని వినమో! యందైన నిందైన విం
> దై నాదం బొనగూర్చునే మదికి నిట్లానంద సందోహామున్."

అనఁగా నర్మసచివుఁ డిట్లనెను: "ఓ రాజా! ఎవరో వీణతో కలిపి పాడుచున్నారు. ఆ సంగీతమునకు కోకిలలును నెమళ్ళును ప్రతిధ్వనులిచ్చు చున్నవి." అనఁగా రాజునకు మనసులో నొక యనురాగము కలిగెను. కలిగి నర్మసఖునితో "ఆ పాడెడివారెవ్వరో చూచి రమ్ము. మనముఁ గూడ నచ్చటికి పోదము" అని వానిని పంపెను. ఆ నర్మసఖుఁడు వెళ్ళి శుకశారికల ఘోష ఘుమఘుమితంబైన కోన నొకదానిని గనెను. అచ్చట నొక దివ్య మందిరమును జూచెను. అందులో స్త్రీలుండిరి. ఇతఁడు చెట్లచాటున నుండి చూడఁగా

> తరువుల పొంత పొంచి వసుధావరమిత్త్రుఁడు గాంచె నచ్చటం
> దరుణిఁ దమోవినీలకచఁ దామరసోదరప్రభం
> దరళవిలోచనం దతనితంబఁ దటిన్నిభగాత్రవల్లరిం
> దరుణ శశాంకఫాల నొక తన్విఁ దరంగవళిం దలోదరిన్.

ఆమె వీణావాదనము చేయుచున్నది. అంతట నర్మసఖుఁడామెను జూచి యామె సౌందర్యమున కాశ్చర్యపడి తన రాజును దీసికొనివత్తునని వెళ్లెను. వెళ్ళి రాజుతో చెప్పెను. "అయ్యా! అక్కడ వీణ వాయించు నొక్క యలివేణినిఁ గంటిని."

అని యామెను చాల పద్యములమీఁద వర్ణించెను. అందులో నిది యొక పద్యము.

నానా సూనవితాన వాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకన్ దపంబంది యో
షా నాసాకృతిఁ బూని సర్వసుమనస్సౌరభ్య సంవాసి యై
పూనెన్ ప్రేక్షణమాలికా మధుకరీ పుంజంబు నిర్వంకలన్.

ఇది ప్రసిద్ధమైన పద్యము. స్త్రీయొక్క అనేకావయవములు వర్ణించుటలో నామె ముక్కునుఁ గూడ వర్ణించెను. దీని కొక కథ యున్నది. ఈ పద్యమును పారిజాతాపహరణ గ్రంథకర్తయైన నంది తిమ్మన్న వ్రాసెననియు, అందుచేతనే యాయనకు ముక్కు తిమ్మన్న యని పేరు వచ్చినదనియు, ఆయనవద్ద నీ భట్టుమూర్తి యీ పద్యమును డబ్బిచ్చి కొన్నాడనియు, కొని యీ పద్యమును తన గ్రంథములో పెట్టుకొన్నాడు. ఇది కథ.

కథ నిజమో కాదో కాని పద్యముయొక్క గొప్పదనమును మాత్రము చెప్పుచున్నది. సారంగము–తుమ్మెద; గంధఫలి–సంపెంగపువ్వు. ముక్కును సంపెంగపువ్వుతో పోల్తురు. స్త్రీలయొక్క కంటి కాంతులను తుమ్మెదల వరుసగా చెప్పుదురు. తుమ్మెద యనఁగా, తేటి, యనఁగా తేనెటీగ. అన్ని పువ్వులమీఁద వ్రాలును గాని సంపెంగపువ్వుమీఁద వ్రాలదు. పువ్వులు స్త్రీలు, తుమ్మెద పురుషుఁడు.

ఇట్టివానిని కవి సమయము లందురు. మన కావ్యములలో చాల భాగము కలిగెడి శోభ యిట్టి కవి సమయములను నవలంబించియే పుట్టుచున్నది. అన్ని పువ్వులమీఁద వ్రాలెడి తుమ్మెద నామీఁద నేల వ్రాలదని సంపెంగపువ్వు

తపస్సుచేసి ఆ స్త్రీయొక్క ముక్కుగా జన్మించినది. ఈ సంపెంగియైన ముక్కునకు రెండు వైపులను చూపులను తుమ్మెదల బారులు వెలసెను.

"ఓయి రాజా! నేను వారి యెదుటికి పోలేదని వారినిఁ జూచి నీకు చెప్పుటకు వచ్చితిని."

అనఁగా రాజున కతని మాటలు తాను విన్న సంగీతముకంటె మధురముగా నున్నవి. ఆ రాజునకు వెంటనే యామెమీద ప్రేమ కలిగెను. విరహబాధ యుదయించెను. ఇంతకు ముందేకదా కిన్నర దంపతులు నీకు శుభమగునని చెప్పిరి. రాజునకు తొందర యెక్కువయ్యెను. ఇద్దఱును కలసి పోయిరి. రాజు వెళ్ళి అచట బంగారపు మేడఁ జూచి తీఁగల చాటుననుండి చివురుటాకుల సందుగా నామెను చూచెను.

కనుఁగవ పూర్ణకామమగుఁ గన్గవకన్నను బూర్ణకామమే
మనమతి చిత్రవృత్తి యగు మానసవృత్తికి మున్న చిత్రమై
తనువు రసోత్తరంగమగుఁ దత్తనువైఖరికన్న సంభ్రమం
బెరసి రసోత్తరంగమగు నీప్సితమానవమానభేదికిన్.

కన్నులు పరితృప్తి పొందినవి. సంపూర్ణమైన తృప్తిపొందినవి. అంతకంటె కూడ మనస్సు తృప్తమైనది. అయి చిత్రమైన వృత్తి కలిగియుండెను. మనస్సుకంటె కూడ అతని శరీరము రసోత్తరంగమయ్యెను. ఆ రాజుయొక్క కోరిక ఆ శరీరము కంటె రసోత్తరంగమయ్యెను. ఇది యాశ్చర్యకరమైన పద్యము :

జననాథోత్తము డింతి జూడ ననిమేషత్వంబుఁ గాంక్షించు; న
య్యనిమేషత్వము కాంత కాంతముఖ చంద్రాసేచనానందవా
సనఁ బ్రాపించినఁ గోరునప్పు డనిమేష స్వామిభావంబుఁ దా
న్గాన నెందున్ నృపు లుత్తరోత్తర పదానూనస్పృహా చంచలుల్.

అనిమేషులు — దేవతలు; నిమేషము — ఱెప్పపాటు; దేవతలు కనుఱెప్పలు మూయరట; అందుచేత ననిమేషు లనగా దేవతలు. అనిమేషస్వామి — ఇంద్రుడు; నృపులు—రాజులు; ఉత్తరోత్తర పదానూన స్పృహాచంచలుల్ — ఎప్పటికప్పుడు పైపైకి పోదమన్న ఆశచేత స్థిరత్వములేని వారు

ఈ లక్షణము రాజునకు ఆమె పాదమునుండి మొగమువఱకు వ్యాపించిన దృష్టిలో కూడ నున్నట్లు తరువాత చెప్పఁబడినది. చివఱకు రాజు ఇంకొక యూహయే లేనివాఁడయ్యెను అప్పుడు నర్మసఖుఁడు దగ్గఱకువెళ్ళి అతఁడు రాజుతో మాటాడువఱకు రాజునకు స్మృతి లేదు. నర్మసఖుఁ డిట్లనెను : "నేనొక సన్యాసివేషము వేసికొని, మహారాజా ! ఆమెవద్దకు పోయి ఆమె పుట్టుపూర్వోత్తరములు తెలిసికొని వచ్చెదను, నన్ను పంపుము" అనెను. రాజనెనుగదా ! "చాల జాగ్రత్తగా వెళ్ళి రావలయును. నీ తెలివి చూతును గదా, వెళ్ళు" మనెను.

ఇతఁడు యతి వేషమును బూని వెళ్లెను. అప్పు డామె చెలికత్తెలలో నొకతె

> "గంధగజయానగీతి ప్రబంధకలన
> నలరి యతి వియ్యమై వచ్చు నరిది మగువ
> లార ! కనుఁగొంటిరే యను నాళి వాక్య
> మొకటి వినవైన నిదె వేళ యొదవె ననుచు"

అతివియ్యము—ఈ అతిలోనున్న 'అ'కారము తెలుఁగులో సంధివలన 'య' అగును. అప్పుడు యతి వియ్యమగును. అందుచేత యతి వచ్చుచున్నా డని నీకెట్లు తెలియును ? అని శ్లేషమీద చమత్కారము చేసెను.

తరువాత యతి వెళ్ళగా నా స్త్రీలందఱు లేచి గౌరవించిరి. మీరెవ్వ రని యడిగిరి. ఈ దొంగయతి తన పేరు గౌతముఁడని చెప్పెను. అని "ఓ వలమాన మీన మిథునోపమ లోలవిలోచనాంత కాంతా !" అని పిలిచెను. రెండు చేపలతో సమానమైన కన్నులుగల యాడదానా ! యని యర్థము. కాని కూర్పు బాగుగా నున్నది కదా !

తెలుఁగులో చాలమంది కవులు పద్యములయందు ఒక్కొక్క చరణము రమణీయముగా చేయుదురు. తక్కిన పద్యము దానికి తీసిపోవును. దానికోస మా పద్యమంతయు నేర్చుకొనవలయును.

అంత నా యోగి తాను వసురాజు నాశ్రితుఁడనని తాను నా రాజును ఉద్యానవనమునకు చూచుటకు వచ్చితిమని, యిచ్చటనే యీ పిల్లను చూచితి

మని యామెను చూడఁగా తనకును రాజునకును వాత్సల్యమును, జాలియు, నాశ్చర్యమును గలిగినవనిచెప్పి "యీ మెను జూడఁగా లక్ష్మియో, పార్వతియో యన్నట్లున్నది. ఈ యమ్మాయి యెవ్వరో చెప్పుము".

అట్లనుటలో లక్ష్మి యనుటకు సింధునందన యని, పార్వతి యనుటకు అచలేంద్రనందన యని వాడెను. సింధువనగా సముద్రము. అచలేంద్రమనగా కొండ. అప్పుడా చెలికత్తెలు ఈమె సింధు నందన, అచలేంద్ర నందన ఇద్దఱును. అనగా నీమె సింధువనగా నది - నదికి పుట్టినది. కొండకును పుట్టినదియని యర్థము.

అసలు విషయమేమనగా శుక్తిమతి నదిని మొట్టమొదట కోలాహల పర్వతము అడ్డగించగా నీ పిల్ల పుట్టినది. ఇక్కడి చమత్కారమో యేమో యేమఁనగా నది స్త్రీ పర్వతము పురుషుఁడు. వాఁడామెను బలాత్కార ముగాఁ బొందెను. అప్పుడు పుట్టిన బిడ్డ యీమె. ఈమె బలాత్కార సంయోగ సంతానము. అప్పుడుకూడ మంచి పిల్లలే పుట్టుదురు కాబోలు ! ఆ చెలికత్తెలు ఆమె యీ జన్మ వృత్తాంతమును చెప్పిరి. కాని వర్ణించవల యునుఁ గదా ! ఈ శుక్తిమతి నర్మదా బహుదా వేత్రవతీ సరస్వతీ ముఖ్య నదులు చెలికత్తెలుగా ప్రతిదినము బ్రహ్మను సేవించి వచ్చుచుండును. ఒక నాడు తిరిగి వచ్చుచుండఁగా కోలాహలుఁడను పర్వతుఁడు శుక్తిమతి కెదు రయ్యెను. వాఁడు చాల అందగాఁడు. ఇచట నొక సీస పద్యము కలదు. అతఁడు తక్కువవాఁడు కాడు. అతఁడు

అనుపమ భాగ్యశాలి కచలాధిపమౌళికిఁ బుత్త్రుఁడై జగ
జ్జనని కనుంగు దమ్ముఁడయి, శంకరు ముద్దుమఱంది కుఱ్ఱయై
మనుతన భాగధేయ మహిమంబున మిన్నులు ముట్టివచ్చు ధ
న్యుని నతనిన్ భజించి నదియున్ విశదంబున నోరగాచనన్

అతఁడు హిమవంతుని కుమారుఁడు. పార్వతీదేవికి తమ్ముఁడు. పరమే శ్వరుఁడైన శివునకు మఱది. అతనిని చూచి శుక్తిమతి తప్పికొనబోయినది. ఆమెను జూచి యా కోలాహలుఁడు కామపరవశుఁడయ్యెను, అతఁడు తన ధైర్యమునుఁ గోల్పోయెను. ఆ నాఁటినుండి కోలాహలుఁడు శుక్తిమతి

మీద మనస్సుంచి బాధపడుచుండెను. అప్పటినుండి శుక్తిమతికూడ నతనియం దనురాగవతి యయ్యెను.

ఆ కోలాహలుఁడు తన కోరికను పట్టుకొనలేక ఒకనాడు శుక్తిమతి దగ్గరకు వచ్చెను. శుక్తిమతి యతనిని బూజించెను. మిక్కిలి గౌరవముగా మాట్లాడెను. 'తమ రిచ్చటికి వచ్చుట నాయందు ప్రేమచేత కదా!' యనెను. అతఁడు నవ్వి 'నీవు మంచి తెలివి కలదానవు. నా రహస్యమును వెంటనే కనిపెట్టితివి. నేను నిన్నెప్పుడును మనస్సులో భావింతును.

"ఆ పద్మోద్భవు నోలగంబునకు దివ్యద్వీపిను ల్విచ్చ రా
రో, పోరో. మఱియెందఱేనియును వారున్ మేము సంధింపమో
యే పద్మాననఁ జూవిరం జెలియ! నిన్నీక్షించినట్లుండదే
లా పల్మాటలు పూర్వజన్మ కృతముల్గాఁబోలు నీ నెయ్యముల్.

ఓలగము—సభ; ద్వీపినులు—నదులు;

ఈ పద్యము చాల సుకుమారమైన పద్యము. నీవు నాకెప్పుడెదురు పడినను తొలఁగి పోయెదవు గాని నిన్నెట్లు పొందుదునని నేనెప్పుడును దుఃఖ పడుచునే యుందును. నీ దయకోసము వచ్చితి ననెను. నన్ను రక్షించు మనెను.

అప్పుడు శుక్తిమతి భయపడి వినయముతో తన తక్కువఁదనమును చెప్పుకొనెను.

ఈ పద్యములన్నియు శ్లేషము. సామాన్యముఁగా చదివినచో తెలియును. చదువవలయును.

అప్పుడు కోలాహలుఁడు చిన్నబోయి మరియు దీనముగా మాటా డెను. శుక్తిమతి యిట్లనెను : "అయ్యా! నన్ను పొందినచో నీవు తేలిక వాడవగుదువు. పోయి తీర్థయాత్రలు చేయుము. నీవు కోరినచో రంభాద్య ప్సర స్త్రీలు వత్తురు," అనగా కోలాహలుడు మిక్కిలి దీనుఁడై రాగాంధుడై యామెను పట్టుకొనెను.

వేణి చలింపఁ గంపితనవీన మృణాళ భుజాగ్ర కంకణ
శ్రేణి నటింప, లోల శఫరీనిబిరీన కటాక్షకాంతి వి
స్ఫారణము చూప, హంసక గణక్వణనంబులు మీఱ; సైకత
శ్రోణి వివర్తితాబ్జ ముఖశోభితయై కడు సంభ్రమించినన్.

వేణి — 1. జడ, 2. నీటిపాయ; మృణాళము — తామరకాడ; కంకణము — 1. గాజు, 2. నీటిబొట్టు; శఫరీనిబిరీన కటాక్షకాంతి — శఫరి- ఆడు చేప.

సైకత శ్రోణి; వివర్తితాబ్జముఖ శోభిత వీనియందు విగ్రహ వాక్యములు చెప్పుటచేత శ్లేషలు సిద్ధించును. చేపలే కన్నులు - లేదా చేపలవంటి కన్నులు, సైకతమే శ్రోణి భాగము లేదా సైకతమువంటి శ్రోణి భాగము కలది. అబ్జమే ముఖము లేదా అబ్జమును వంటి ముఖము.

"ఈ రీతిగా నాగద్దఱి యమ్ముద్దరాలి బెద్దయుం బ్రొద్దు నిరోధించు సమయంబున."

అప్పుడు శుక్తిమతి వసురాజును రక్షింపుమని యఱచెను. ఆమె యొక్క శోకార్త నినాదములు వీరును వారును పోయి వసురాజుతో చెప్పిరి. "అయ్యా! మహారాజా! ఎవడో యొక పర్వతుఁడు శుక్తిమతి నడ్డగించెను. గ్రామములు చెడిపోయెను. ఇండ్లు పడిపోయెను. జంతువులు తిరుగుటకు వీలులేకుండెను."

ఈ రీతిగా చెప్పిరి. ఇందులో నున్న చమత్కారమేమనఁగా — ఒక నదికి కొండ యడ్డముఁగా వచ్చినచో నేమగును ? నది పొంగిపోయి యూళ్ల మీద పడును. దీనిని కవి యొకానొక పురుషుడొక స్త్రీని మానభంగము చేసినచో కలిగెడి ధర్మముయొక్క యుపద్రవముగా జెప్పెను.

అంత రాజు అభయమిచ్చెను. ఆయన పెద్ద సైన్యముతో బయలు దేరెను.

ఆ రాజు వచ్చుచున్నాడని యా పర్వతము కూడ భయపడ సాగెను. ఆ రాజు వచ్చి యా పర్వతమును తన కాలి గోటితో మీటెను. ఆపర్వతమెగిరి దూరాన పడెను.

ఈ దొంగ యతి ఆ రాజు చెలికాడు. వానికి కథ యంతయు దెలియును. వీఁడు మొదటనే తాను వసురాజు కృపచేత బ్రతుకుచుంటినని చెప్పెను. ఆ పిల్ల ఈ సందర్భములో పుట్టినదని వారు చెప్పఁబోవుచున్నారు. ఒక్కని కథ యొక్కరికి పూర్వమే తెలిసినట్లున్నది. మరి యెందుకయ్యా యింత రగడ పెంచుట యనగా —

పర్వతము. నది. దీని కది యడ్డము వచ్చుట. ఇద్దఱియందు స్త్రీ పురుష లక్షణము. లోకములో నదికడ్డమైనచో జరిగెడి భూతముల వికారము. ఈ రెంట నడుమ నభేద ప్రతిపత్తిగా శ్లేష సాహాయ్యముతో విలక్షణమైన యొక కవితా పద్ధతిని వెలయించుటకు.

ఒక కొండ యడ్డము వచ్చుట - నది పొంగుట పాయలు పాఱుట తరంగములు లేచుట — గట్లెగపాఱుట. పక్షులు లేచిపోవుట — జనమిబ్బంది పడుట — ఇట్టి పరిస్థితులలో నదులు వరదలమీద నున్నప్పుడు చూచుటొక సరదా. మనమందులో కొట్టుకొని పోకపోయినచో దూరమునుండి చూచుట యొక యాశ్చర్యము. ఒక యానందము.

ఒక చమత్కారపు మాట యున్నది, స్వామీ ! నక్క కుడివైపునుండి యెడమవైపునను తీర్చుట మంచిదా యెడమవైపుననుండి కుడివైపునకు తీర్చునా యని యడిగెనట.

ఒక చమత్కారియైన శాస్త్రిగారు చెప్పిన సమాధానమేమనగా 'నెట్లు పోయిననేమి మనలను కరవకుండ పోయినచో చాల మంచిది.' అని. ఆ రీతిగా పాంచభౌతికములైన విప్లవములు ద్రష్టల కాశ్చర్యజనకములు. సంతోష దాయకములు. చనిపోయినవారికి కాదు. బ్రతికియున్నవారికి. ఈ కథలోని రమ్యత నగమచ్చట నున్నది.

అప్పుడు పుష్పవర్షము కురిసెను. ఇంద్రుఁడు తదితర దేవనాథులతో రాజును చూచుటకు వచ్చెను. రాజేంద్రునకు నమస్కారము చేసెను. ఇంద్రుఁడు రాజును మిక్కిలి మెచ్చుకొనెను. ఇంద్రుఁడు వసురాజున కొక విమానమును బహుమానము చేసెను. ఆ విమానము ప్రతి దినమును బోలె

బంగారు నాణెములను కురియును. ఈ విమానము ముందు పుష్పక విమానముకూడ సరికాదట. అంత నింద్రుఁడు వెడలిపోయెను.

అంతట నా రాజునకు శుక్తిమతి తాను విహరించు దిగుడుబావి, కోలాహలము క్రీడా పర్వతముగా నుండెను.

అప్పుడు శుక్తిమతి గర్భవతి యయ్యెను. ఆమె యొక కుమార్తెను నొక కుమారుని గనెను. కోలాహలుఁడు తన కామెయందు బిడ్డలు కలిగినందుకు చాల సంతోషించెను.

అచటి మౌను లాపిల్ల పేరు 'గిరిక' యని పెట్టిరి. అమెను కాంతార దేవతలు ప్రోచుచుండిరి.

ఆ కోలాహలుఁడు తన కూఁతునకు సంగీతము నేర్పెను. ఈ రీతిగా నా చెలికత్తె దొంగ యోగికి ఆ పిల్ల యొక్క పేరును దాని పుట్టుకయును చెప్పగా చాల సంతోషించెను.

ఈ కథయంతయు రాజు చాటునుండి వినుచుండెను కదా! ఆ రాజీ కథ యంతయు విని యీ పిల్ల తన సొమ్మనుకొనెను.

దొంగ మౌని యిట్లనెను. "మేము దివ్యదృష్టితో చూచితిమి. ఈ పిల్లను వసురాజేంద్రుఁడు పెండ్లియాడును." అని జోస్యము చెప్పెను. అప్పుడా చెలికత్తె "అయ్యా! ఆ రాజెప్పుడు వచ్చును, ఎట్లు వచ్చును. ఈమె నెన్నడు పెండ్లియాడును." అని యాదుర్దా పడగా నా యోగి యిట్లనెను. 'నీకంత భయముగా నున్నచో మా మంత్రశక్తిచేత నా రాజు నిప్పుడే రప్పింతు'నని 'మజ్జ్యా' యని యఱచెను. రాజు "ఇదే వేళ" యని యెదుటికి వచ్చెను. ఆ రాజునుచూచి చెలికత్తెలందరు చకితలై లేచి నిల్చుండిరి. రాజు వారి దగ్గరకురాగా దొంగమౌని యాశీర్వదించెను. అచట నొక బంగారు పీటమీద కూర్చుండెను. ఆయనను జూచి గిరిక తానెంతయో కుతుకమూని యిద్దఱు నొకరినొకరు చూచుకొనుచుండిరి. వారిలో నొక చెలికత్తె పేరు మంజువాణి. ఆమె రాజును పొగడెను. గిరికను పొగడెను. మీ యిద్దరి సమాగమము చాల గొప్పగా నుండునవెను. రాజు తన నర్మసఖుడైన యా దొంగమౌనిని పొగడెను. ఆ దొంగమౌని చాటునకువెళ్ళి తన వేషమును

మార్చి మరల నచటికి వచ్చెను. ఆ చెలికత్తెలు ఈ రాజుయొక్క స్నేహితునిజూచి వాడే పీడనుకొనిరి. అంత గిరిక సిగ్గుపడి చాటునకుబోయెను. రాజామెచాటునకు పోవుటకు సంతోషపడలేదు. ఆ చెలికత్తెలువెళ్ళి యామెను దీసుకొనివచ్చిరి. బలవంతముగా తీసికొనివచ్చిరి. అయిన నామె మరల వెడలిపోయెను. రాజామెయొక్క వెడలిపోవుట కోర్వలేక యామె పోయిన జాడనే పోయెను.

అంతట రాజు తన నర్మసఖునితో తన కామెమీదగల ప్రేమయంతయు దానిమీద దీని మీదపెట్టి యొలుకబోసికొనుచుండెను. చివరికి రాజు తన యూరునకు వెళ్లెను. రాజామెనుగూర్చి మిక్కిలి దుఃఖపడుచుండెను.

ఈత డిట్లుండెను. ఎందుచేత ? మన్మథుడట్లుచేసెను. ఆ మన్మథుడూరకుండెనా ? ఆమెనుగూడ నట్లేచేసెను. అక్కడ నామె యిబ్బంది పడుచుండెను. ఆమె చెలికత్తెలు ఆమెకు కొంత యోర్పుతెచ్చుటకు వనవిహారము జలవిహారము చేయించిరి.

ఈ లక్షణములో విరహవర్ణనలలో మన్మథుని, వాయువును, చంద్రుని, తిట్టుట కావ్యములయందొక లక్షణము.

> "కొండటవిల్లు వేదలల కుండలిరాజట నారి యమ్ము నం
> తుండట బైటిపల్లియలు తున్మినవాడట యొండురెండు భ
> ర్గుండిది నిండు పౌరుషమొకో యని గెల్వవె ముజ్జగంబు లు
> ద్దండత నొక్కతుంట విలుఁదాలిచి యంటిన కందుతూపులన్."

ఇది మన్మథుని పొగడినపద్యము. శివుని త్రిపురాసుర సంహారము వర్ణింపబడ్డది. విల్లుకొండయట ! నారి ఆదిశేషువట, బాణము అనంతుడు విష్ణుమూర్తియట. మూడుపల్లియలు త్రుంచినాడట. ఇది గొప్పయాయని యోయి ! మన్మథుడా నీవు తుంటవిలు గైకొని మూడు లోకములు గెలువవా ?

> 'లోకత్రయీ జయోత్సేకమ్ముఁ దెలుపు నీ
> పడగ నారాయణ ప్రథమమూర్తి'

మన్మథుని జాపుటామీద చేపయుండును. అతడు మత్స్యకేతనుఁడు. దశావతారములలో మొదటిది మత్స్యావతారము. అందుచేత నిట్లు వ్రాయుట వాగ్గతమైన గొప్ప చమత్కారము. ఇట్లు వసుచరిత్ర కవిత్వములో వంద లుండును.

ఆ గిరిక చివరకు మూర్ఛపోయెను. ఇచ్చట నొక పద్యమున్నది. ఇది మహాప్రసిద్ధమైన పద్యము.

మోహోపదేశతమోముద్రితములైన
కనుదమ్ముల హిమాంబు లునుపరాదు
శ్రమబిందు తారకాగమఖిన్నకుచకోక
ములఁ జంద్రనామంబుఁ దలఁపరాదు
శీర్యదాశాపృంత శిథిలితాసుల తాంత
మసియాడ వీవన న్విసరరాదు
పటుతాప పుటపాక పరిహీనతను హేమ
మింకఁ బల్లవపు టార్చిసఁగరాదు

లలన కానంగ కీలికీలా కలాప
సంతతాలీఢ హృదయ పాత్రాంతరాళ
పూరిత స్నేహపూరంబు పొంగి పొరలఁ
జల్లని పటీరసలిలంబుఁ జల్లరాదు.

మోహమను చీకటిచేత ముద్రితములైన కన్నులను తామరపూవు లందు మంచునీరు చల్లరాదు. తామరపూవులు రాత్రిపూట ముకుళించును. వానిమీద మంచు కురిసినచో నింకను ముడుచుకొనిపోవును. ఇచ్చట నామె విరహిణిగనుక విరహబాధ తగ్గుటకు విరహజ్వరము తగ్గుటకు మంచు నీళ్లుపయోగింపరాదని యర్థము.

ఇట్లే పద్యమంతయు. ఈ పద్యముయొక్క గొప్పదనము ఈ శ్లేష లలో లేదు. ఒక లోకోత్తరమైన శబ్దచారుత్వములో నున్నది. ఈ పద్యములో భట్టుమూర్తి యొక్క శైలి పొందిన యొక యనిర్వచనీయమైన మాధుర్య సౌకుమార్యములు శబ్దశ్లిష్టత కలసిన యొకగుణము మరియొకచోట లేదని

చెప్పవచ్చు. మరియు నీ మొదటి రెండు చరణములలోని సౌందర్యము దాని కదేసాటి.

ఏ మంద మేమి సేయుద
మే మందని మందలింత మే మందమొ యిం
దే మందయాన నడుగుద
మేమందఱ మనుచుఁ దరళ హృదయాంబుజలై.

ఇదియొక రచన.

అంత నా చెలికత్తె లామెను విహార భవనమునకుఁ దీసికొని వెళ్ళిరి. అంత సూర్యోదయమయ్యెను. దాని వర్ణనయుండెను. మరల ప్రొద్దు క్రుంకెను. చంద్రుఁడు వచ్చెను. అంతలో నామె చెలికత్తె – దానిపేరు మంజువాణి. ఆమె వసురాజును పిలిచికొనివత్తునని వెళ్లెను. ఇచ్చట చంద్ర దూషణము కలదు.

"రా జీవాతులనేచు పాతకివి చంద్రా ! రాజవానీవు నీ
రాజత్వంబునఁ జక్రముల్మనియెనో, రంజిల్లి సత్సంతతుల్
తేజంబందెనొ, డిందెనో యహిభయోద్రేకంబు, తాఁజెల్ల రే
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే, రాజౌట దోషార్థమే."

ఓయి ! చంద్రుడా ! నీవు రాజీవాతులను బాధించెడి పాతకివి. రాజీవము-తామరపువ్వు. చంద్రుఁడు రాజీవములకు విరోధి – ఆ విరోధము వాని కెంతదూరము పోయినది ? ఆ రాజీవములవంటి కన్నులుగల స్త్రీలను గూడ బాధించుచున్నాడు. చక్రము – 1. భూమి. 2. చక్రవాకపక్షి; సత్సంతతులు – 1. సత్పురుషుల సమూహములు, 2. నక్షత్రముల సమూహములు. అహిభయము – 1. క్రతుభయము; 2. రాహుభయము; 1. కిరణము, 2. ధనము. దోషార్థమే. 1. దోషములకొఱకా ? 2. దోషమగా రాత్రికూడ.

ఇతులనేచు పాతకమదెంతట నంటటబోదు పాంథులో
కాంతక ! నిన్ను ఘోరతమమై, ఘనమై యజహాత్కళంకమై

వంతలఁబెట్టి యాఱుపది వ్రక్కలుసేయక పూర్వపక్ష పుం
గంతులకేమి చూచెదవుగా తుది నీ బహుళార్తి ఖేదముల్.

పాంథ లోకాంతక ! — పాంథులనఁగా బాటసారులు. వారు భార్య లను వదలిపెట్టియుందురు కనుక విరహులనిచెప్పబడుదురు. వారికి యముని వంటివాడా ! అజహత్ కళంకమై–జహత్ వదలుచున్న, అజహత్–వదలని; వదలని కళంకమై అనగా నిత్యము మచ్చకలవాడవై యని యర్థము.

ఆరుపది వ్రక్కలు – పదునాఱు కళలు; పూర్వపక్ష పుంగంతులకేమి– శుక్లపక్షమునాటి దర్జాలకేమి ! బహుళార్తి ఖేదముల్–బహుళ – అనేకము లైన; లేదా బహుళపక్షమునాటి ఆర్తి ఖేదములు.

పండితులు వాదనచేయునప్పుడు పూర్వపక్షము సిద్ధాంతము నని రెండుండును. చెప్పినది సరిగాలేదని దోషములు చూపించుట పూర్వపక్షము. దోషములు నిరాకరించి విషయమును స్థాపించుట సిద్ధాంతము. ఈ శ్లేషలో ఆ చర్చాలక్షణము స్ఫురించుచున్నది.

కమలించెగాక యంగజపరోధి శిరోధిఁ
దలకెక్కఁ జాలెనే హాలహాలంబు ?
క్రాచెఁగాక పయోధికాండ ప్రకాండంబుఁ
బైకిఁ బొంగించెనే బాడబంబు
తూరెఁగాక ముకుందతుంద ప్రఘాణంబు
వెడలెనే యొసఁ గాలి విపిన కీలి ?
యడఁచెఁగాక శిలోచ్చయచ్ఛదా హుంకృతు
ల్గరఁచెనే నీరుగా సురపహేతి

నీ కరణి నట్లు దయలేక లోకమేర్చు
నీ కరణియైన యాలయాత్రి నేత్రమునకు
ఖర కరాలోక గాఢ సిద్ధురతపోగ్నిఁ
బెటిలిపడ కున్కి ధర్మమొ ? కృపీట జన్మ !

కృపీటజన్ముఁడు – నీటియందు పుట్టినవాఁడు. కృపీటము – జలము; చంద్రుఁడు అత్రిమునీంద్రునన్నుఁ [illegible] పుట్టినాడని యొకప్రథ. [illegible] శిరోధి–

శివుఁడు. శిరోధి - మెడ; హాలాహలము శివుని మెడను కమలించినదిగాని తలమీదికెక్కినదా ? బాడబము సముద్రమును పొంగించినదా? ముకుందుఁడు- శ్రీకృష్ణుఁడు; తుందము — కడుపు, ప్రఘాణము — ముంగిలి;

ఇదియొక విలక్షణమైన యూహ - చాల గడుసుగా చెప్పఁబడినది. ఇట్లు కొంతసేపు మన్మథుని తిట్టి మఱికొంతసేపు చల్లగాలిని తిట్టెను. చివరకు

"ఆ జాబిల్లి వెలుంగు వెల్లికలడాయంలేక, రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమునఁ బటాగ్రంబొత్తి యెగ్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూ రాజత్కరాంభోజ కాం
భోజీ మేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగాన్."

జాబిల్లి — చంద్రుఁడు: రాకానిశా రాజశ్రీ సఖము - పున్నమనాటి చంద్రలక్ష్మికి చెలియైన మొగము; పటాగ్రము — చీరయంచు; కిన్నరవధువు యొక్క ప్రకాశించుచున్న చేతియందున్న కాంభోజీరాగమునకు మేళవించిన వీణాధ్వనివంటి ధ్వనియొక్క యమృత ప్రవాహముతోరమ్ముగాన్ నిండుగా నామె యేడ్చెను.

ఈయన గొప్ప సంగీతవిద్వాంసుడు. ఏ రాగమునం దేభావముండునో యతనికి చక్కఁగా తెలియును. అందుచేత నీ దుఃఖము కాంభోజీరాగములో నుండునని నిరూపించినట్లున్నది.

మనుచరిత్రలో "పాటున కింతులోర్తురె కృపారహితాత్మక" యన్న పద్యము; పారిజాతాపహరణములో "ఈసునబుట్టి డెందమున హెచ్చిన" యన్న పద్యము,

ఇందులో నీ పద్యము;

కథానాయిక లేడ్చుచున్నట్లు చెప్పబడినవి. దీనిమీద తెనాలి రామకృష్ణయ్య చమత్కారముగా నొకమాట యన్నాడని చెప్పుకొందురు.

పెద్దన్న ప్రియముగా నేడ్చెను.

ముక్కుతిమ్మన్న ముద్దుముద్దుగా నేడ్చెను.

భట్టుమూర్తి బావురుమని యేడ్చెనన్నాడట.

ఏది ఎట్లున్నను వసుచరిత్రలోని యనేక పద్యములు పెద్దన్నగారి యనేకపద్యముల ననుసరించి వ్రాయఁబడినవి.

అట్లుండఁగా వారియెదుట యెఱ్ఱనికాంతి కనిపించెను. ఏమిటయ్యా ఆ యెఱ్ఱనికాంతియనగా మంజువాణి రాజుయొక్క యెఱ్ఱని యుంగరమును దీసికొనివచ్చెను. ఆ యుంగరమును జూపించి యా మంజువాణి యిట్లనెను. "నేను చాల తొందఱగా పోయితిని. రాజసౌధమును చేరితిని. ఆ రాజ సౌధమును చూచితిని. అచట రాజుగారి కేళిసదనమును జూచితిని. అచట నెందఱో యందగత్తెలను జూచితిని. ఆ స్త్రీలు రాజునకు నిద్రలేదని చెప్పు కొనుచున్నారు. ఆ మాటలు విని నేను సంతోషించితిని. అచట నొక గొప్ప మంచమున్నది. ఆ మంచముమీద పూవులపొడియొక్క పరుపుమీదనొత్తిగిల్లి యొక చిత్రఫలకమును వీక్షించు రాజును చూచితిని. ఆ పటములోనున్నది మన చెలికత్తెయో యింకొకస్త్రీయోయని నేనచట చాటునదాగి చూచితిని. ఆ రాజు మిక్కిలి బాధపడుచున్నాడు. ఆ బొమ్మతో మాట్లాడుచున్నాడు. ఓసి! ప్రియురాలా! నీ కాఠిన్యము వదిలిపెట్టుమనుచున్నాడు. నా కా బొమ్మ మన చెలికత్తెదియేయని తెలిసెను. నేను బ్రహ్మానంద మందితిని. ఆ రాజు మంచమువద్ద యంత్రపుత్రికామండలి యున్నది. అనగా యంత్ర ములతో చేసిన బొమ్మల సమూహము. ఆ బొమ్మలు ప్రమాణము చేత సౌందర్యముచేత స్త్రీలవలెనే యున్నవి. నేనందులో నొక్కర్తెగా నిలుచుండి పకపకనవ్వి యిట్లంటిని: "ఓయి! రాజా! ఆ బాలికనెందుకు తిట్టెదవు. ఇంతులు తమంతతాము వరింతురా? మగవారిని నమ్మవచ్చునా? అందులో రాజులనా?" అన్నంతలో రాజు "ఇది యే దేవశాస్త్రీయో! ఆ శుక్తిమతి యొక్క చెలికత్తెయైన మంజువాణియో!"యని యూహించి మంచముమీద నొఱగెను. నేను మన చెలికత్తె గుర్తుగానిచ్చినది నేను తీసికొనివెళ్ళినదియైన మణిహారము నాతని కంఠమునందు వేసితిని.

ఆ రాజు హారములనుఁజూచి యీహారమును నేనెచ్చటనో చూచితిని. ఈ హారమును బొమ్మలోనున్న కన్య మెడలోని హారము నొక్కటియే" అని యా హారమును సంబోధించి యిట్లనెను:

"కమనీయ ద్యుతిధామమా ! విమల ముక్తాదామమా సేమమా ?"
అంచు నేదేదియోచెప్పి నన్ను రత్నపుత్రిక యనుకొనుచున్నాడు గదా
అందుచేత నన్నుజూచి నీవుసేమమా ? యని నన్నడిగెను. అప్పుడు నేను
రాయియైన యహాల్యస్త్రీయైనట్లు నేను నేనై నీ కథయంతయు జెప్పితిని.
అంత రాజు చిన్నగానవ్వి "ఓసీ ! నీ చెలికత్తెయందు నా ప్రేమను వీవే
చూచితివికదా ? మీ గిరిక గురుజనాధీనురాలు. తండ్రి యీవలె నేను
గ్రహించవలె. ఇంద్రుడు నా హృదయము నెఱిగి నాబదులు తాను వెళ్ళి
మీ గిరికను నాకొఱకు కోలాహలు నడుగునట. అందుచేత నేనూరకున్నాను.
ఈ సంగతి మీ చెలికత్తెతో చెప్పుమని రాజీ యుంగరమును నాకిచ్చెను.
ఆ గిరికకు ఆ యుంగరముమీద రాజుగారిపేరు చూచుటతోడనే రాజను
చూచినట్లే సిగ్గుకలిగెను. అంతట రాత్రి వచ్చెను. ఆ రాత్రి వర్ణనసాగెను.

ఇది నాల్గాశ్వాసముల కథ. తక్కిన రెండాశ్వాసములలో ఆ యింద్రుడు
వచ్చుట సంబంధము కుదుర్చుట, చివరకు పెండ్లియగుట జరుగును.

కథ తక్కువ. వర్ణనలెక్కువ. ఈ గ్రంథముయొక్క గొప్పదన
మంతయు వర్ణనలచేత శ్లేషలచేత మరి భాషాగతమైన యితర లక్షణములచేత
కొన్నిపద్యముల గడుసురచనచేత ప్రకాశించుచున్నది. ఆంధ్ర సాహిత్యములో
మరియు ప్రబంధములలో పద్యరచనయొక్కటి మిక్కిలి గొప్పవిషయము.
కృష్ణరాయలనాటి కవులలో నెక్కువమంది కవుల కీర్తిప్రతిష్ఠలు వారి
పద్యరచనమీద నాధారపడియున్నవి. సీసపద్యములమీద నాధారపడి
యున్నవి. ఈ గ్రంథములోని కొన్ని సీసపద్యముల మొదళ్ళు చూడుడు.

1. ఇమ్ములై మరు హజారమ్ములై పొదలుంథ
   పూజలికెలు వేఱ పూనవలదు
2. ఒకచాయ ననపాయపిక గేయ సముదాయ
   మొకసీమ నానా మయూర నినదము
3. తనకొప్పు నెఱికొప్పుననె పూని గౌరీ స
   మాఖ్య మించ జనించినట్టి యార్య

4. ఈ జాలపోరాదు హేరాళము జవాది
   ఈ రాలనడు చక్కనేల వలయు
5. అతులశైవలవతీశతము లీనెడు నీకు
   నా యిచ్చు విమలార్ఘ్య తోయమెంత ?
6. తలిరు బ్రాయము వాని నల రాజు వలరాజు
   నలరాజు తెగడు సోయగము వాని.

ఇట్లెన్నెనను జూపించవచ్చును. మరియు తక్కువ వృత్తములలోగూడ పద్యవు లెత్తుగడలు దింపుగడలు చిత్రచిత్రములుగా నుండును.

కావ్యము మొత్తముమీద శ్లేష లెంతయెక్కువో వృత్త్యనుప్రాసములు యమకములంత యెక్కువ. వృత్త్యనుప్రాసమనగా వచ్చినయక్షరమే మరల మరలవచ్చుచుండుట. యమకమనగా రెండక్షరములుగాని రెంటికన్న నెక్కువ యక్షరములుగాని మాటిమాటికి వచ్చుచుండుట.

కవి నేర్పుకొలది యిట్టిరచన సౌందర్యమును, మాధుర్యమును పండించుచుండును. కవి యప్రతిభుడైనచో విసుగుపుట్టించును. భావసమృద్ధి కలిగి చేసిన పద్యరచనలో నీ శబ్దాలంకారములు కవియొక్క ప్రతిభకొలది రామణీయకమును పండించిపోయును.

# కాశీ ఖండము

ఈ గ్రంథ రచయిత శ్రీనాథుఁడు. శ్రీనాథుఁడు ఆంధ్ర భాషలో బహుగ్రంథములు వ్రాసినవాఁడు. అందులో కొన్ని గ్రంథములు నిత్యమునాంధ్రులు చదువుచుందురు. శృంగార నైషధము, హరవిలాసము, భీమఖండము, కాశీఖండము—ఈగ్రంథములు చదువని సాహిత్యవేత్తయుండడు. శ్రీనాథుఁడు తెలుఁగు కవిత్వనులో గొప్ప ధారాశుద్ధి యనుగుణమును పద్యమునకు ప్రధానముగా స్థాపించివెళ్లెను. భట్టుమూర్తి నరసభూపాలీయ మన్న గ్రంథమును వ్రాసెను. అది తెలుఁగుభాషలో నొక యలంకార గ్రంథము. అందులో బహుకవుల రచనాగుణములను జెప్పుచు శ్రీనాథుని గురించి యిట్లనెను — శ్రీనాదుని పదప్రసిద్ధ ధారాశుద్ధి' యని.

శ్రీనాథుఁడనగా శ్రీనాథకవి, విష్ణుమూర్తి — రెండర్థములును. పదములచేత ప్రసిద్ధమైన ధారాశుద్ధియని కవి పరమైన యర్థము. పాదముల యందు ప్రసిద్ధమైన ధారాశుద్ధియనగా గంగానది — అది విష్ణుపరమైన యర్థము.

శ్రీనాథుఁడు కొండవీటి రెడ్డిరాజులు పాలించిన కాలమువాఁడు. ఆయన గొప్ప పండితుఁడు. హంపీ విజయనగరమువెళ్ళి యక్కడ డిండిమభట్టు అన్న యొక పెద్ద పండితునోడించి వాని ఢక్కా పగులగొట్టించెను. సామాన్యముఁగా తెలుఁగు కావ్యములలో నవతారికలలో కృతిభర్తయొక్కయు కృతికర్త యొక్కయు గొప్పఁదనములు సారస్వతములో రత్నములనఁదగిన పద్యములలో చెప్పఁబడియుండును. ఈయన కావ్యములలోఁకూడ నట్లే యున్నవి. మరియు నీయననుగురించికూడ చాల పద్యములుకలవు. దేశములు తిరిగి పలుచోట్ల శత్రువులనోడించి దిగ్విజయముచేసి కవితాజయస్తంభమును నాటిన మొదటి తెలుఁగుకవి యీయనయే యనవలయును. ఈయన పద్యము లఖండధారా సమన్వితములై యుండును. ఆంధ్ర సారస్వతములో తరువాతి తక్కిన సర్వకవులకు సీస పద్యరచనయం దీయనపెట్టినదే భిక్ష.

ప్రధానముగా సీసపద్యపు పంపిణీ యీాయన తిక్కన్నగారివద్ద నేర్చెను. కొంత నాచన సోమన్నవద్ద నేర్చెనుగాని సీసపద్యము నీయన తనమార్గమునం దాను పెంపొందించెను. ఈయన తెలుఁగు మాటలు సంస్కృత సమాసములు చిత్రచిత్రములుఁగా గుంఫించి సీసపద్యములను వందలుగా కురిపించెను.

ఇతఃపూర్వము వ్రాయఁబడిన కవులందఱు కొందఱీతనిని కొన్ని విషయములందు మించిపోయినను నీయన శిష్యులనియే చెప్పవలయును. ఈయన పద్యముల నకళ్ళే ఈయన ప్రయోగించిన తెలుఁగుశబ్దములే సమాసములయందు కొన్నిభాగము లీయనవే. అటువంటివాఁడు శ్రీనాథుఁడు.

కాని పరమసాహిత్యరస రహస్యదృష్టితో చూచినచో చాలమంది యీాయనకంటె నధికులు. అందఱనియే వాఁడు మిగిలినారు. లేనిచో నీయన దీప్తిముందు తెలుఁగులో మరియొకకవి నిలువలేకుండెడివాఁడు. తరువాత కవియే లేడనుటకు రాడనుటకు పుట్టుటకు వీలులేదనుటకు తగినంత భాషాశక్తియు, పద్యరచనాశక్తియు విజృంభించిచూపి వెళ్ళినవాఁడు శ్రీనాథుఁడు.

## వింధ్య గర్వాపహరణము

ఒకనాఁడు నారదుఁడు తీర్థయాత్రలు సేయించుచుండెను. దక్షిణదేశమున ననేక యాత్రలుచేసి వింధ్యపర్వతమును చూచెను. అప్పుడు వింధ్యము —

"స్థావరంబైన రూపంబు జలదవీథి
నావరించుచు మొదలనున్నట్లయుండ
జంగమంబైన రూపంబు సవదరించి
యెదురుగా వచ్చె వింధ్య మహీధరంబు."

ఆ కొండ నారదమహర్షికి నమస్కరించి "స్వామీ! నా యంతటి పర్వతముసృష్టిలో మరియొకటి యున్నదా? నాతో సమానముగా చెప్పదగినది మేరుపర్వత మొక్కటియే! ఈమధ్య నాకు నతనికి కొంత సరిపడుట లేదు. మీరు పక్షపాతముమాని మాయిద్దఱిలో నెవ్వరధికులో చెప్పవలసినది." అనఁగా నారదుఁడు "ఔనయ్యా! మేరుపర్వతముకూడ నాతో నిట్లేయన్నది.

మీయిద్దఱు గొప్పవాండ్రే. మీ తారతమ్య మెంతవారికిని తెలియ" దనెను.
వింధ్యపర్వతమున కీ మాటలు గిట్ట లేదు. ఆ పర్వతమిట్లన్నది :

"కంటికి నిద్రవచ్చునె ? సుఖంబగునే రతికేళి ? జిహ్వకున్
వంటక మిందునే ? యితర వైభవముల్ పనివేలు మానసం
బంటునె ? మానుషంబుగల యట్టి మనుష్యున కెన్నఁడేనియున్
గంటకుఁడైన శాత్రవుడొకండు దనంతటివాడు గల్గినన్."

"అయ్యా, నా కీ యీర్ష్య యొక జ్వరముగా పట్టుకొన్నది. ఇప్పుడు పోయి మేరుపర్వతముమీద దూకి నాశనము చేయుదునుగాని ఆ యింద్రుఁడు మా ఱెక్కలనుత్రుంచెను. సూర్యుఁడు మేరుపర్వతము చుట్టు తిరుగునఁట. నే నా సూర్యుఁడు కదలకుండ జేసెదను" అని వింధ్యపర్వతము విజృంభించి పెరిగెను. అంతలో సూర్యోదయమయ్యెను.

ఇచ్చట శ్రీనాథుఁడు కొన్ని పద్యములను వ్రాసెను. వానిని కావ్యము చదివియే గ్రహించవలయును. సూర్యునిరథము మింటికి లంఘించెను. ఆ సూర్యురథము అచ్చటచ్చట తిరిగి :

"నడచు రవి తేరుమింటి నన్నడిమి చక్కఁ
బ్రగ్గనఁగఁ దాఁకె వింధ్యపర్వతము చఱులఁ
గఠిన నిర్ఘోష నిర్ఘాత ఘట్టనమునఁ
బంకజాత భవాండ కర్పరము వగుల."

ఈ గీతపద్య మొక సీసపద్యము చివరది.

ఈ రీతిఁగా ననేక సంవత్సరములు సూర్యరథము నడచుటకే వీలు లేకపోయెను.

రెండువేలును నిన్నూటరెండు యోజ
నంబు లర్ధనిమేష మాత్రంబునందు
నంబరంబునఁబాఱు తీవ్రాంశు రథము
నిలిచె బహుకాలమిట్టిదే నియతిమహిమ.

సూర్యుని గమనవేగ మీ పద్యమునందు చెప్పఁబడినది. సూర్యరథ వేగము-అర్ధనిమేషమున రెండువేల రెండువందల రెండు యోజనములు

వెళ్ళునఁట. నేటి ఈ పాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞులు భూమి, నక్షత్రములు, చంద్రుఁడు, సూర్యుఁడు మొదలైనవాని గమనవేగములనుఁ జెప్పిరి. ఈ లెక్కలన్నియు మన పూర్వగ్రంథములందుఁ గూడఁగలవు. కాని కాలము గతించి యానాటి యోజనము మొదలైన దూరమును వారు చెప్పినవాని పరిమాణములు తెలియక యిప్పటి తెలిసిన పరిమాణములతో వానిని పొంతన పరచక యాధునికులు అవి తప్పని సులభముఁగాఁ జెప్పుచున్నారు.

ఇదియంతయు ఖగోళశాస్త్రవిషయము. జ్యోతిశ్శాస్త్రములో రెండు భాగములు. 1. సిద్ధాంత భాగము. అనగా మానవుల జాతకములు, దేశముల జాతకములు మొనలైనవి. రెండవది ఖగోళ సిద్ధాంతములు. ఆకాశము, నక్షత్రములు, గ్రహములు. వాని నడకలు – ఇవి.

ఈ విషయములో నన్నయ్యగారొకరు, తరువాత శ్రీనాథుఁడొకడు గొప్పగా తెలిసి వ్రాసినవారు.

సంస్కృతములో కాళిదాసు గొప్ప జ్యోతిర్వేత్త. ఆ కవికులగురువు యొక్క గ్రంథములలో ఖగోళ విషయము లనంతములు కలవు. తెలుఁగులో నన్నయ్యగారిలో నొండురెండు గలవు, శ్రీనాథునిలో చాల కలవు.

ఈ కాశీఖండములోననే యెక్కువఁగా కలవు.

ఇట్లు సూర్యగమనావరోధము జరుగగా

పూచిన కొరవి పూఁబొదరింటి చందానఁ
  గత్తెర యొక్కచోఁ గదలకుండె
నొకచోఁ దగుల్పడె నుపకారి కొఱటికిఁ
  దరమైన రోహిణీ తారకంబు
నొకచోఁ బునర్వసు వూఁగె వృత్తముకొమ్మ
  నుడివడ్డ ముత్యాల నోఁగువోలె
శయనించె నొకచోట శ్రవణ నక్షత్రంబు
  గుంటిమీదటి ప్రత్తి కొడుపువోలె

స్వాతిచిత్తలు తోరణ స్తంభయుగము
ననుకరించుచు నొక్కచో నత్తమిల్లెఁ

జిలుతవోయిన మూకుటి చెలువుఁదాల్చి
హత్తెనొకచో విశాఖ వింధ్యాద్రియందు.

కత్తెర-కృత్తికా నక్షత్రము.

ఈ గ్రహములుకాని, కొన్ని నక్షత్రములుకాని బహు నక్షత్రముల గుంపులు. కృత్తికా నక్షత్రము మహాగ్ని జ్వాలల సమూహము. ఈ నక్షత్రమే శివాకృతి యందురు.

మనదేశములో ఇప్పుడు కత్తెర, శుభ కార్యములుగాని వివాహములుగాని చేయకూడదందురు. ఈ కృత్తికానక్షత్రము పూచిన యెఱ్ఱగోరింట పొదవలె నున్నదట. కొరవి యనగా ఎఱ్ఱగోరింట. కొరడు ఒక యాయుధము. లేదా మ్రోడు. ఈ పద్యమంతయు నక్షత్రములయొక్క లక్షణములను చెప్పునదే! వాటి స్వరూపములట్టివి యని.

ఇట్టి విజ్ఞానము మన దేశములో పూర్వమునందు చాల సార్వజనీన ముగా నుండెడిది. నేటికిని పల్లెటూళ్ళలో వృద్ధులైన రైతులకీ విషయ పరిజ్ఞాన మెక్కువ.

అపుడు దేవతలును మునులును బ్రహ్మలోకమునకు వెళ్ళి బ్రహ్మను స్తుతించిరి. బ్రహ్మకు వీరు వచ్చిన పని తెలియును. బ్రహ్మ యిట్లనెను : 'మీరు వచ్చిన పని నాకు తెలియును. కాశీక్షేత్రమున నగస్త్యుడు తపస్సు చేయుచున్నాడు. మీరు పోయి యాయన నభ్యర్థింపుడు. ఆయన పూర్వము వాతాపిల్వలులను రాక్షసులను చంపినవాఁడు. అనగా వారు వారణాసీ పట్టణమునకు పోయిరి. వారణాసి యందు సర్వక్షేత్రములను సేవించిరి. అగస్త్యుని దర్శించుటకు పోయిరి, అగస్త్యుఁడు వారికి నాతిథ్యమిచ్చి వారు వచ్చినపని యడిగెను. వారు అగస్త్యుని భార్యయైన లోపాముద్రాదేవిని గూడ స్తుతించిరి. స్తుతియించి యగస్త్యునితో తమ వచ్చినపని చెప్పిరి. బ్రహ్మ తమరిని యాయన దగ్గఱకు పంపించినాడని చెప్పిరి. అగస్త్యుఁడు ప్రయత్నము చేయుదువనెను.

వారు వెళ్ళిన తరువాత నగస్త్యునకు కాశీక్షేత్రమును వదలుట యిష్టము లేకపోయెను. ఆయన కాశీ పట్టణమును వదలి పోవుటకు చాల

కష్టపడెను. అచ్చటి గంగ, లోలార్కుఁడు, కేశవుఁడు, విశాలాక్షి, వటుక భైరవుడు అందఱి దగ్గఱ సెలవు దీసికొనెను.

కలహంసి ! రారాదె కదలి నాతోఁగూడి
నీవేల వత్తమ్మ నెమ్మినుండి
కదళికాకాంతార! కదలిరా నన్నుఁగూడి
నీవేల వత్తమ్మ నెమ్మినుండి
శ్రీ విశాలాక్షి విచ్చేయు నాతోఁగూడి
నీవేల వత్తమ్మ నెమ్మినుండి
నాతోడఁగూడి యంతర్గేహ ! యేతెమ్ము
నీవేల వత్తమ్మ నెమ్మినుండి

రండు ననుగూడి యో పరివ్రాట్టులార !
వత్సలతగల్గి మీరేల వత్తురయ్య
పరమ నిర్భాగ్యుడైన నా పజ్జఁబట్టి
కటకటా ! సౌఖ్యజలరాశిఁ గాశిఁ బాసి.

ఇది సీసపద్యములో శ్రీనాథుఁడు ప్రవేశపెట్టిన యొక లక్షణము. సీస పద్యము మొదటి నాలుగుచరణములలో మొదటి సగము క్రొత్తగా వ్రాసి కడమ సగమును మొదటిచరణముయొక్క సగముతోనే నింపుట. ఈ పద్య ములో అగస్త్యుని కాశీ విరహబాధ నాల్గుచరణముల రెండవ సగములలో మాటిమాటికి చెప్పుటచేత నధికముగా భాసించుచున్నది. నీవు సుఖముగా నుండి నీవెందుకు వత్తువు. అన్నమాటలో వారి సుఖము తనకు లేదన్న దుఃఖము ప్రతిచరణము నం దధికముగా కనిపించుచున్నది.

మహాకవులు తిరిగి తిరిగి చెప్పినను దానియందు భావమును నింపిం తురు. భావము నిండియున్నచోటే మరల వాచింతురు. ఏది హృదయమును తాకునట్టి భావమో ! యేదికాదో వారికే తెలియును. ఒకానొకప్పుడొక చిన్నమాట కొద్ది భావము సందర్భమునుఁబట్టి హృదయముదాక పోవును. దానిని మహాకవులే యెరుగుదురు. దీనినిచూచి తరువాతి కవులు చాల మంది నిగూఢభావ పరిజ్ఞానము లేనివారు పద్యములు దొర్లింపనారంభించిరి.

ఆ యగస్త్యుఁడు వదలలేక వదలలేక కాశి వదలి పెట్టెను. కాశీ నగరమును వదలిపెట్టవలసి వచ్చెనన్న భావముచేత నాయనకు కోపమెక్కువయ్యెను.

అట్టివానిని వింధ్య పర్వతము చూచెను. చూచి నమస్కరించి "నీ యాజ్ఞ యేమియో చెప్పు"మనెను. అనగా నగస్త్యు డిట్లనెను:

"వింధ్యాచలేంద్ర ! పృథ్వీభృత్కులశ్రేష్ఠ!
దక్షిణాపథము తీర్థంబులాడఁ
బోపుచున్నార మీ పువ్వుంబోఁడియు నేను
బెద్దకాలమునాఁటి పెరువగాన
లావు చాలదు జరాక్లైబ్యంబు కతమునఁ
బొడవెక్కనపుడుడిగెడు నపుడును
నభ్రంకషములైన యానీ శిరశ్శృంగ
శృంగాటకము లిట్లు చిఱుతపఱిచి

యనఘ ! నేఁ గ్రమ్మరగవచ్చునంతదాఁక
నుండవలయు ధరిత్రిలో నొదిగి నీవు
చేయు నా యాజ్ఞ లెస్సయాఁ జేయకున్న
నెఱిఁగెదవుగాక రజ్జాడ నేల యిపుడు ?

ఇదియు సీసపద్యమే. దీనినడక యెట్లున్నది? ఏచరణమునకాచరణము తీర్చిలేదే! సామ్యము గలిగిన భావములను మాత్రమే చెప్పుట కాదుగదా! ఇంక నిట్టి పద్యములు శ్రీనాథునిలో చాల గలవు.

సీసపద్య మనేక ప్రక్రియలకు కవు లుపయోగించిరి. శ్రీనాథుఁ డా రహస్యము తెలియనివాఁడు కాడు. ధారాశుద్ధి కలిగి ఏపాదమున కాపాదముగా తీర్చిన శ్రీనాథుని సీసపద్యములకు మోహపడెడి పాఠకులవలె శ్రీనాథుడు సీసపద్యముయొక్క గొప్పశక్తిని తెలియనివాఁడుకాడు.

అగస్త్యుఁడు దాటిపోవుటకు వింధ్యము తలవాల్చెను. అగస్త్యుడు "నేను తిరిగివచ్చు వఱకు నిట్లేయుండు"మని యాజ్ఞాపించెను.

ఇంకేమున్నది మేరు పర్వతము లేదు. స్పర్థయు లేదు. నేటివఱకు వింధ్యపర్వత మట్లేయున్నది.

> "ముని జటాధారి శివభక్తుఁడనఘమూర్తి
> యెవ్వఁ డేతెంచునప్పు డట్లెత్తిచూచుఁ
> గుంభ సంభవుఁడను కోర్కి కొనలుసాఁగ
> వసుమతీధర యతఁడేల వచ్చు మరలి?"

ఇక్కడికి కథ యైపోయినది. కాని నడుమ రత్నాలు, వజ్రాలు వంటి పద్యములెన్ని దాటవేసికొంటిమి.

ఈ కథలో నొక యందమున్నది. వింధ్యపర్వతము పెరుగుట మూలముగా నేమైనది? సూర్యరథగమన మాగినది. సూర్యరథగమన మాగినచో నేమగును? పవలులేదు, రాత్రిలేదు. పక్షములులేవు, నెలలులేవు. ఋతువులు లేవు. సంవత్సరములులేవు. రాజ్యములు లేవు. బ్రాహ్మణుల తపస్సులులేవు యజ్ఞములులేవు. దీనియంతకు గారణమెవ్వరు? సూర్యుఁడు. ఆ సూర్యరథ గమనము. అది యాయువుపట్టు. అందుచేత శ్రీనాథుఁడు వింధ్యపర్వతము పెరిగినతరువాత వింధ్యపర్వతమువద్దకు సూర్యరథము వచ్చువఱకు నాలుగైదు సీసపద్యములువ్రాసి పర్వత మడ్డగించినప్పటి దుస్థితిని పూచిన కొరవి పూబోదరింటి చందాన యన్న పద్యములో వ్రాసెను. ఇప్పుడు సూర్యునకు తెలివి వచ్చెనుగదా! సూర్యరథము నడచుటను మరల మూడు సీసపద్యములలో వ్రాసి కథనుపసంహరించెను.

కథయొక్క మొదలు చివళ్ళను కలుపుట యొక శిల్పము.

> స్ఫటిక భూములయందు బ్రతిబింబములు చూచి
> యితరాశ్వ బుద్ధి హేషితమొనర్చు
> బద్మరాగోపల ప్రస్థ భాగములందుఁ
> జరమసంధ్యా శంక జాడ్యమందు
> మరకత మణి శిలామధ్యంబునందు దృ
> శ్యా దృశ్యమూర్తులై యలఁచుసూతు
> వైడూర్య మణిమయవ ప్రాంతములయందు
> సలిలాభిలాష నౌదలలు హాంచుఁ

గిన్నరస్త్రీలఁ జూచి లంఘింపఁ జాఁచుఁ
గావరంబెత్తి యుద్దామకామ వికృతి
వాయు జవములు రవితేరి వారువములు
వేల్పుగుబ్బలి ప్రస్థాన వీథియందు.

ఇదియంతయు సూర్యుని రథమునకు కట్టఁబడిన గుఱ్ఱముల వర్ణన. స్ఫటికపురాళ్లు కలిగిన దేశములయందు ఆ గుఱ్ఱములు తమనీడలు తామె చూచుకొని వేఱుగుఱ్ఱము లనుకొని సకిలించును. ఎఱ్ఱని ఱాళ్ళచోట సంధ్యా కాలము వచ్చినదనుకొని కొంచెము నడకను మందగించును.

ఇది మేరుపర్వతమునందు సూర్యరథము పోవుచున్నప్పటి కథ.

ఆకుపచ్చ రాళ్ళయందు అనగా మరకతమణులందు సూర్యునిగుఱ్ఱము లాకుపచ్చనివి గనుక కనపడీ కనపడవు.

దేవయోనులలో కిన్నరులొక్కరు. కిన్నరులు, కింపురుషులు మొదలుగా గలవారు. కిన్నరుల మొగములు గుఱ్ఱపుమొగములు. ఆ కిన్నరస్త్రీలను జూచి వారాడగుఱ్ఱములను కొని వారిమీదికి పోనెంచును. ఈ గుఱ్ఱములు వేల్పుగుబ్బలి ప్రస్థానవీథియందు — వేల్పులయొక్క కొండ మేరుపర్వతము, ప్రస్థానము — బయలుదేరి వెళ్ళుట.

యా అన్న ధాతువునకు ప్ర అన్న ఉపసర్గ చేర్చినచో బయలుదేఱుట ప్రయాణముచేయుట యని యర్థము. 'స్థ' యనగా నుండుట; ప్రస్థయనగా వెళ్ళుట. ప్రస్థానవీథి — సంస్కృతశబ్దము. వేల్పుగుబ్బలి — తెలుగుశబ్దము. ఈ తెలుఁగు సంస్కృతములు కలుపుటలో (శ్రీ)నాథునకున్న నేర్పు మఱియొక కవికుండదు.

తమతనుచ్ఛాయ మేఘములు పచ్చని వన్నె
నుభయ పక్షములునై యూఁగియాడఁ
గశ్యాలఁదెగిన సృక్వముల క్రొన్నెత్తురు
లాననంబులకుఁ గెంపా వహింప

నుడు పథంబున యందు నుండిన గతి ధార
గమన వేగంబునఁ గానఁబడగ
శుకముఖ ద్విజకోటి సులభ కౌతూహల
వ్యతిషంగమునఁ జేరి యనుచరింపఁ
జిలుకలనుబోలె హేమాద్రిశిఖర శృంగ
కల్పవృక్షాటవీ వాటికలఁ జరించె
మహీధరము సేయునంకిలి మానుటయును
వనిజవన శాంధవుని తేరి వారువములు.

ప్రక్కనున్న మేఘములు తమతమ శరీరములయొక్క పచ్చదనముచేత పచ్చనై యా సూర్యుని గుఱ్ఱములకు ఱెక్కలవలె నుండెను. కళ్ళాలచేత నోటిసెలవులు పగిలి నెత్తురయ్యెను. చివరి గీతపద్యములో బంగారుకొండ చివరనున్న కల్పవృక్షపు టడవులలో నివికూడ చిలుకలవలె నుండెను.

ఆకాశవాహిని సైకతంబుల ఖురాం
చల టంకములుగ్రుంగ జడనుపడిన
శాత కుంభాచల స్థపుట స్థలంబున
జక్రాభిహతి వడి చాలకున్న
బహుల దూర్వాశంకఁ బ్రబత దేవకిరీట
మరకత ద్యుతులకై మరులుగొన్న
నిందు బింబముఁజూచి చెందుప్పుగలు సావి
యఱలెత్తి నాకంగ నాసపడిన

బసిఁడి గిలుకల బేరోక్కెఁ బరిభవించి
కఠిన హుంకార మొనరించి కనకరథము
వారువంబులఁ బఱపె దుర్వారలీల
బిరుసు తహాతహా వినువీథిఁ బిచ్చుగుంటు.

పిచ్చుకుంటు—అనూరుఁడు. సూర్యుని రథసారథి— ఇది తెలుగుమాట.

బిరుసు తహాతహా వినువీథిఁ బిచ్చుగుంటు. తెలుగులు సంస్కృతములు కలుపుటలోని సొగసు. ఈ అనూరుఁడు సూర్యుని రథాశ్వములను హుంకా

రముచేసి చేతిలోని పసిడిగిలుకల చేర్కోలయనఁగా కొరడా ప్రయోగించియో తాకించియో గుఱ్ఱములను నడపినతీరు ఈ పద్యములందు వర్ణితము. ఆకాశ గంగయొక్క యిసుకలలో గుఱ్ఱముల కాలిగిట్టలు, క్రుంగినచో శాతకుంభాచలము (బంగారపుకొండ) స్థపుటస్థలము (మెట్టపల్లములుగా నున్నచోటు). అచ్చట చక్రములు చప్పున పెగిలిరాకున్నచో సూర్యరథము పోవుచుండగా దేవతలు సూర్యునకు నమస్కారము చేయుదురు. వారి కిరీటములలో నాకుపచ్చ మరకతములుండును. ఆ కాంతి దూర్వాశంకన్-పచ్చగడ్డియన్న బుద్ధితో గుఱ్ఱములాగినచో దారిలో చంద్రబింబము కనపడును. అందులో సైంధవలవణము రాళ్ళవంటివి కనిపించును. అది యుప్పనుకొని ఈగుఱ్ఱములు మెడలెత్తి దానిని నాకపోవును. ఇట్టి సమయములందు పిచ్చుకుంట వాని నదలించి తోలును.

ఇవియన్నియు రమణీయములైన కల్పనలు. సంస్కృతములో మయూరుడన్న కవియున్నాడు. ఆయన సూర్యశతకమని యొక గ్రంథమును వ్రాసెను. అది మహాప్రసిద్ధమైన గ్రంథము. శ్రీనాథునకు సంస్కృతములోని సర్వగ్రంథములు కరతలామలకములు. మయూరుడు మురారి భట్టబాణుడు బిల్హణుడు మొదలైన కవులయొక్క రచనలాయనకు కంఠస్థములు. వారి సమాసములను వారి భావములను శ్రీనాథుఁడు సమృద్ధిగా వాడుకొనును. ఈ పద్యములలోని భావములన్నియు మయూర మహాకవివి. కాని తెలుఁగులో వాని నిట్లువ్రాయుట శ్రీనాథుఁడుతప్ప వేఱొకఁడు చేయలేడు.

## కుబేర వృత్తాంతము

కాంపిల్య పురమునందొక బ్రాహ్మణుఁడు కలఁడు. అతనిపేరు యజ్ఞదత్తుఁడు. వేదవేదార్థములు చదివినవాఁడు. యజ్ఞవిద్యయందు పండితుఁడు. అతనికి కుమారు డొకడున్నాడు. అతనిపేరు గుణనిధి. వాఁడు దర్పకునితోడి జోడు సౌందర్యరేఖ. వాని కుపనయనము చేసిరి. చదువబెట్టిరి. కొంత పెరిగినాడు. జూదమాడుట కలవాటుపడినాడు. పవలు రాత్రులు వాని కదేపని.

వాఁడు సజీవ నిర్జీవద్యూతముల రెంటినాడును : సజీవద్యూతమనఁగా గొఱ్ఱెలు, మేకలు, కోళ్ళు, దున్నలు ఇట్టి ప్రాణముకల జంతువుల నొడ్డి యాడుట. గుఱ్ఱపు పందెములుఁగూడ వీనిలోనివే.

నిర్జీవద్యూతమనగా చీట్లపేక, చదరంగము, లాటరీ మొదలైనవి. తాను ధనమోడినచో తల్లిని పీడించి యామెనగల తీసికొని యా డబ్బు చెల్లించుచుండును.

తల్లి బోధించు తత్పరత్వంబుఁ గలిగి
యన్న! మీ యన్న చెప్పిన యట్లుచేయు
ధూర్తసంగతి విడువు సాధువులతోడఁ
బరిచయము సేయుమని పుత్త్రి ననుదినంబు.

అన్న యనఁగా నాన్న. నా + అన్న – నాన్న. మనము నాన్న యందుము. లోకములో తల్లిదండ్రులు బిడ్డలను నాన్న యని పిలుచుట కలదు. మొదటి యన్న తల్లిబిడ్డను పిలుచుట. రెండవయన్న తండ్రినిగూర్చి చెప్పుట.

ఎడపఁదడపఁ దనూభవుం డెచటనుండు
గానరాఁడని గృహభర్త కాంతనడుగ
నింతదడవును నాయొద్ద నిచటనుండి
యరిగెఁ జదువంగనని భర్తకతివ మొఱఁగు.

స్నానమాడెనె ? వార్చెనే సంధ్య? యగ్ని
హోత్ర మొనరించెనే? యింతి ! పుత్త్రుఁడనిన
స్నానమాడెను వార్చెను సంధ్య యగ్ని
హోత్ర మొనరించె ననుచును నువిద మొఱఁగు.

గొడ్డుపీఁగి కన్నబిడ్డండు కావున
నొక్కరుండ కాన నుత్పలాక్షి
ధూర్తుఁడైనవాని దుశ్చేష్టితము లెల్ల
నధిపు నెఱుఁగనీక యడఁచుచుండు.

2-7-64

అతనికి పదునారేండ్లు దాటిన తరువాత వివాహముకూడ చేసిరి. తల్లి ప్రతిదినమును వానిని మంచిమార్గమున నుండుమని బోధించును. అన్న! నీ తండ్రి కోపగాడు. నీ సంగతి యాయనకుఁ దెలిసినచో మన యిద్దరి ప్రాణముల మీదికి వచ్చును.

సచ్ఛ్రోత్రియులు ననూచానులు సోమపీ
థులు నైన కులముపెద్దల దలంచి
రాజమాన్యుఁడు సత్యరతుఁడు వినిర్మలా
చారవంతుండైన జనకుఁ దలఁచి
భాగ్యసంపదఁ బుణ్యవతి దేవతలలోన
నెన్నంగఁ దగియెడు నన్నుఁ దలఁచి
వేదశాస్త్ర పురాణ విద్యానిరూఢులై
వాసికెక్కిన తోడివారిఁ దలఁచి

చెడ్డయింటి చెడారమై శివుని కరుణ
నివ్వటిలు నిర్వదేనేండ్ల నిన్నుఁ దలఁచి
పదియు నార్వత్సరంబుల భార్యఁదలఁచి
గోరతనములు మానురా! కొడుకుఁగుఱ్ఱ!

శ్రోత్రియులు—వేదములు చదివి నిష్ఠగా నుండెడివారు. అనూచానులు—ఆచారవంతులు; సోమపీథి—యజ్ఞముచేసి సోమమును త్రావినవాఁడు. గోరతనములు—దుర్వేషములు.

ఇతనికి ఇప్పటి కిరువదియైదేండ్లు. అతని భార్యకు పదునారేడేండ్లు. ఇంత వయసు వచ్చినను వాఁడు తన లక్షణములను మానలేదు. పెండ్లి కాక ముందే యీ వృత్తిలో నున్నాడు. పెండ్లియైన తరువాతకూడ నిట్లే యున్నాడు.

అఖిల కళ్యాణగుణగణాయత్త యత్త
మామ యాచార్య తేజః క్షమామహితుఁడు
మాతులుండు యశోమహిమాతులుండు
తనయ! యేలయ్య కైకోవు వినయగరిమ.

అత్తకు గుణాయత్తయని; మామకు క్షమామ యని, మాతులుడు మహిమచేత అతులుఁడు—మహిమాతులుఁడు. ఈ యమకముచేత పద్యమున కందము వచ్చినది.

ఇట్లుండఁగా నొకనాఁడు వాని తండ్రి తన యుంగరమును నొక జూదరి చేతివ్రేల జూచెను.

"దర్శనంబిచ్చె నెద్దానిఁ గోమటి క్రొత్త
పొడచూవ నేతెంచి భూభుజునకుఁ,
దనకిచ్చె నెద్దానిఁ ధారాంబు పూర్వంబు
పుణ్యకాలమునందు భూమిభర్త
దానిచ్చె నెద్దాని ధర్మగేహినియైన
సోమిదమ్మకు మనః ప్రేమమలరఁ
దటిచూచి యిచ్చె నెద్దానిఁ బట్టికిఁ దల్లి
జూదమాడిన పైఁడి సుట్టికొనిన

నట్టి నవరత్నమయమైన యంగుళీయ
కంబు యజ్ఞావభృథ పుణ్యకర్మసాక్షి
వీటిలో నొక్క జూదరి వ్రేలనున్నఁ
జూచెఁ గనురెప్ప వేయక సోమయాజి."

వైశ్యోత్తముఁడు మొదటిసారి రాజుగారిని జూడవచ్చి యా యుంగరము రాజునకు బహుమానముచేసెను. అప్పుడు ఈ యజ్ఞదత్తుఁడు రాజువద్దనే యున్నాడు. ఆ యుంగరము యజ్ఞదత్తునకు మొదటిసారి దర్శన మిచ్చినదప్పుడు. ఆ యుంగరమునుఁ జూచి యజ్ఞదత్తుఁడు ప్రశంసించెఁ గాబోలు దానినొక పుణ్యకాలమునందు ధారాంబుపూర్వ ముఁగా అనగా నీళ్ళతోసహా యజ్ఞదత్తునకు దానమిచ్చెను. దానిని సోమయాజి తన భార్య కిచ్చెను. జూదమాడిన పైఁడి ( బంగారము.) చుట్టుకొనగా దానిని తల్లి కొడుకునకిచ్చెను. (అప్పువచ్చి చుట్టుకొన్నది) అనుట లోకములో నుడికారము. అనగా నింకొకదానిని తోచనీయలేదని యర్థము.) యజ్ఞావభృథ పుణ్యకర్మ సాక్షి— యజ్ఞములు చేసిన తరువాత

దీక్షాంతమందు సమంత్రకముగా స్నానము చేయుదురు. దాని పేరు అవభృథ స్నానము. దీక్షలో నున్నప్పుడెవ్వరును స్నానము చేయరు.

యజ్ఞదత్తుఁడు వానిని పట్టుకొని యిది నీకెట్లు వచ్చినది. చెప్పుము. అబద్ధము చెప్పితివా? రాజుచేత దండింపింతు ననెను. ఆ జూదరి గుణనిధి యొక్క సర్వలక్షణములును తండ్రికిఁ జెప్పెను. ఇది యేమి? యిది యొక్కటియా? నీ కొడుకు మీ యింటిలో నన్న పళ్ళెములు గిన్నెలు సర్వమును పెట్టి జూదమాడుచున్నాడు. మీ యిల్లంతయు నేడు నిర్వస్తువుగా నున్నది.

"అక్షధూర్తులలోన నీ యనుఁగుఁగొడుకు
దొరయునంతటి యక్షధూర్తుండు లేఁడు
క్షితితలంబున యాగదీక్షితులయందు
గిర్తి నీయట్టి యాగదీక్షితుఁడు లేఁడు."

ఈ పద్యములో తండ్రికి కొడుకునకు సద్విషయమున నసద్విషయమున పోటిపెట్టి వ్రాయుటచేత పద్యమునకు మంచిశోభ వచ్చినది.

సోమజాజికి పైప్రాణములు పైన పోయినవి. మొగము గంటువెట్టుకొని యింటికి బోయి భార్యను బిలిచి—

అంగోద్వర్తనవేళ నీవు దరహాసాంకూరముల్ లోచనా
పాంగ ప్రాంతములంటిగుర్వ నొక సయ్యాటమ్ము కల్పించి నా
యంగుళ్యాభరణమ్ము బుచ్చుకొనవే యా యుంగరమ్మిప్పుడి
శృంగారింపని చేతఁ బావకునకుం జేయన్ హవిర్దానమున్.

అంగోద్వర్తనము—అభ్యంజన స్నానము, దరహాంకూరములు — పిల్లనవ్వులు; లోచనాపాంగములు—కంటికడకంటిచూపు; అంగుళి—వేలు; ఆభరణము—నగ; పావకుఁడు—అగ్నిహోత్రుడు.

అని యతఁడడుగగా నామె మాటలమీద పెట్టనెంచెను. ఆయన పట్టుపట్టెను. ఆమె చెప్పిన యబద్ధములన్నియు రుజువయ్యెను. ఇంటిలోనున్న వస్తువులేవియు కనిపించలేదు.

చివరకా బ్రాహ్మణుఁడు మిక్కిలి కోపముతో కుపుత్రత్వంబు కంటె నపుత్రత్వంబు మేలు. (అనగా కొడుకు దుర్జనుఁడగుటకంటె కొడుకు లేకపోవుటయే మంచిది.) అని వానికి నివాపాంజలులిచ్చెను. అనఁగా వాఁడు చనిపోయినట్లు భావించి వానికి శ్రాద్ధము చేసెను. ఆ భార్యను వదలిపెట్టి మరియొక భార్యను చేసికొనెను.

ఇంక గుణనిధి యాటలేమి సాగును? వాఁడు పోయి దేశమంతయుఁ దిరుగుచుండెను. అన్నము పెట్టినవాఁడు లేఁడు అప్పటికే చాల దినములైన దేమో! ఆనాడు శివరాత్రి

ఆ రాత్రిపూట నొక శైవుఁడు ఊరిబయట
చేసి తానుపవసించి రాత్రియెల్ల జాగరముచేసి ప్రతి జామునకు స్వామికి నైవేద్యములు కల్పించువాఁడై యచ్చటికి చేసిన వంటకములు తెచ్చెను. ఆ వాసన యీ గుణనిధి ముక్కులకు గప్పుమని కొట్టెను.

ఊరి వెలుపలి శివలింగమైనను నది దేవాలయమే. అపుడు గుణనిధి — గుడ్డ బిగించికట్టి తలుపు కిఱ్ఱులేకుండఁ ద్రోసి యోరగాఁదీసిన వాకిలిలో నుండి దూఱి లోని దీపారాధన నూనెయైపోగా వీఁడేదానిని వత్తి ఎగసన ద్రోసి యన్నమునుఁ జక్కఁగాఁ జూచుకొని యావత్తి చాలకపోగా తన కట్టినబట్టలో సన్ననిపీలిక చింపి వత్తిగావేసి యేది యెక్కడనున్నదో చూచుకొని యన్నపాత్ర చేబూని బయటికి వచ్చుచుండఁగా నచ్చట నిద్ర బోవుచున్నవారిలో నొకరికి వీని కాలి|వేలు తగిలెను. అతఁడు లేచి "ముచ్చు, ముచ్చు" అనెను. ఈ గుణనిధి యన్నపాత్ర వదలకుండ పారి పోవుచుండెను. ఆ బ్రాహ్మణుల కేకలకు తలారులువచ్చిరి. పారిపోవుచున్న గుణనిధిని బాణములతోఁ గొట్టిరి. వాఁడు చనిపోయెను. అప్పుడు వాని కొఱకు యమభటులు వచ్చిరి, కాని శివకింకరులుగూడ వచ్చిరి.

శివకింకరులనుఁజూచి యమభటులు భయపడి "యయ్యా! వీఁడు దుర్జనుఁడు. మీరు రా నేమికారణ"మని యడిగిరి. శివకింకరు లిట్లనిరి : "శివ ధర్మాచారములు సూక్ష్మములు. వీఁడు అన్నము దొరకకయైననేమి శివరాత్రియంతయు నుపవాసముఁజేసెను. అన్న మెత్తుకొనిపోవు నపుడై యైన నేమి తెల్లవాఱులు జాగరముచేసెను. ఎందులో నన్నము భక్ష్యముగ

సమృద్ధిగానున్నవని చూచుకొనుటకైననేమి దీపమును బెద్దదిచేసెను. అనగా దీపారాధన చేసినవాడయ్యెను. చూడవలయునన్న యుద్దేశ్యము లేకపోయిన నేమి శివపూజ కన్నులారచూచెను. చచ్చిపోవుట యెక్కడ చచ్చిపోయెను ? శివాలయ పరిసరములందు చనిపోయెను. వాఁడు పూర్వజన్మమునం దెంత పుణ్యముచేసినాడో ! అనూహితముగా నిట్టికర్మలు జరిగినవి. కనుక నితనిని మేము శివలోకములకు దీసికొనిపోవుచున్నా"మనిరి. యమభటు లేమి చేయుదురు ? వెడలిపోయిరి.

శివకింకరులు గుణనిధినిఁ దీసికొనిపోయి శివునకు జూపించిరి.

శివుఁడు వానిని కళింగదేశమునకు రాజుఁగా జనింపజేసెను. వాఁడు తన రాజ్యమంతయు శివదీపములు పెట్టించెను. ఎవఁడు తన యింట శివదీపమును బెట్టడో వాని తల తెగవేయించెను.

ఈ యజ్ఞదత్తియే యనఁగా గుణనిధియే మేఘవాహనకల్పము నందు కుబేరుఁడయ్యెను.

కృత త్రేతా ద్వాపర కలియుగములు నాలుగు ఈ నాలుగు యుగములు కలిసినచో నొక మహాయుగము. ఇట్టి మహాయుగములు కొన్నియైనచో నొక మన్వంతరము. ఇప్పుడు మనమున్నది కలియుగము. ఇది వైవస్వత మన్వంతరము. ఇట్టి మన్వంతరములు కొన్ని కలిసినచో నది కల్పము. ఇపుడు మనమున్నది శ్వేతవరాహ కల్పము. పూర్వమెప్పుడో కొన్ని కోట్ల సంవత్సరములకుఁ బూర్వము మేఘవాహన కల్పమని యుండెను.

కల్పమునకు కల్పమునకు దేవతలు మారుచుండురు. మన్వంతరములకు కొందఱు మారుదురు. ఈగుణనిధి మేఘవాహనకల్పములో కుబేరుడైనాడు. అతఁడే కాశీపట్టణమున శివలింగ స్థాపన చేసినవాఁడు. అచట నతఁడు చేసిన శివపూజ ఆశ్చర్యముగా నుండెను. అతఁడు విజ్ఞానదీపమును వెలుఁగఁజేసెను. చివరకు శివుఁడు సంతోషించి వానిని నీకేమి కావలయునని యడుగగా యాజ్ఞదత్తి "స్వామీ ! మీ శ్రీపాదపద్మములు దర్శించునట్టి సామర్థ్యమ్ము కృపచేయు"మని ప్రార్థించెను. శివుఁడతనికి దివ్యదృష్టి నొసంగెను. వాడు అనఁగా యజ్ఞదత్తుఁడు దివ్యదృష్టి వచ్చిన మొదటి చూపులో పినాక

పాణియైన శివునియొక్క యెడమవైపున నొక పదునారేండ్ల ప్రాయపు బాలికను జూచెను. ఆమె వచ్చి తన భుజము ఫాలలోచను భుజముతో నొఱయఁగా నిలువఁగా గుణనిధి యిట్లనుకొనెను :—

ఎవ్వతెయొక్కో ! యీ యిందుబింబానన
జగదేక సౌభాగ్య జన్మభూమి !
కమలాయతాక్షి నాకంటె నగ్గలముగా
నెటుచేసెనొక్కొ తానీ తపంబు !
పరమేశుఁ డీ బింబఫల పాటలాధర
నను మీఱ మన్నించినాఁడు మేలె ?
భాగ్యంబు గాకేమి ? బాలేందు శేఖరు
కృపఁగాంచె నీ రాజ కీరవాణి

యనుచుఁ గ్రేగంట నీరసం బంకురింపఁ
గినుపు కిలికించితము నాత్మఁ గీలుకొనఁగ
సవతి వీక్షించు ప్రౌఢ యోషయును బోలె
బ్రాహ్మణుఁడు చూచెఁ బర్వతరాజ తనయ.

వాఁడు పార్వతీదేవినిఁ జూచి యీర్ష్యపడెను. అతఁడెన్నో యుగములు శివునిగూర్చి తపస్సు చేసెను. ఈమె యెవరురా ? నాకంటె స్వామి సన్నిధిని చనవుఁగా నున్నది యని ప్రౌఢురాలైన స్త్రీ భర్తయొక్క యింకొక భార్యనుచూచి యీర్ష్యపడ్డట్లుగా పడెను

అప్పుడు పార్వతీదేవి శివునితో "స్వామీ ! వీఁడెక్కడి దురాత్ముఁడు ? నన్ను కంటిచివళ్ళయందు చూచును. వికారములు పోవును. వీనికి నీవింత చనవిచ్చితివి" అనఁగా శివుఁ డిట్లనెను :

"మనమునయందు నీ నెగులు మానుము పర్వతపుత్త్రి ! వీఁడు నీ
తనయుఁడు. నందనుల్ బహువిధంబుల ధార్ష్ట్యము లాచరించినం
గినియునె తల్లి భావమున ? గీల్కొరికించిన దేవతావలం
బన రతి భావమై పరగు భావవిలాసము లీవికారముల్"

కీలు పరికించినచో దేవతల నవలంబించు యన్నది రతిభావముగా నుండును. అనఁగా స్త్రీ పురుషు లొకరినొక రెట్లాశ్రయింతురో, యొక్క-రన్నచో నొక్కరు ఎట్లు పడిచత్తురో, సర్వదా యొకరి నొకరు భావించుచుందురో, ఒకరు లేకుండ నొకరు బ్రతుకలేమని యెట్లనుకొనుచుందురో, యట్టి తాదాత్మ్యము నట్టి తన్మయత్వమును దేవతావిషయమున పొందినప్పుడే. భక్తి పండినట్లు. వీఁడు నీ బిడ్డ.

ఇతనికి నేను వరమిత్తును. నీవుఁగూడ వరమిమ్మనెను. అని శివుఁడు వానికి కుబేరత్వము నిచ్చెను. అనఁగా వాని యెడమ కన్ను గవ్వవోలె నూగుచుండును. కుడికన్ను పల్లమైయుండును.

అప్పుడు పార్వతి యిట్లనెను :— నా సౌందర్యమునకు నీవు చుప్పనాతి తనము పొందితివిగాన నీవు కుబేరుడవగుదువుఁగాఁక!

కుబేరుఁడనగా బేరము — శరీరము; కుత్సితమైన బేరము కలవాఁడు. చెడ్డ శరీరము కలవాడు. అతఁడు శివభక్తుఁడు గనుక దిక్పాలకు డయ్యెను. పార్వతినిఁజూచి యీసు పొందినాడు గనుక కుబేరుడయ్యెను.

ఈ కథకును పాండురంగ మాహాత్మ్యములోని నిగమశర్మ కథకును చాల పోలిక యున్నది. ఇది శివభక్తి కథ. అది విష్ణుభక్తి కథ. తెలుఁగులో ఈ గుణనిధి కథను మొదట వ్రాసినవాఁడు శ్రీనాథుడు. నిగమశర్మ కథ తరువాత వ్రాయబడినది.

శ్రీనాథుని రచన మధురమైనది. రామకృష్ణుని రచన ప్రౌఢమైనది.

ఈ కథలో మొదట నైదారు గీతపద్యములు కలవు. గీతపద్యములట్లు వ్రాసి వానియందు సాహిత్యముద్ర కల్పించుట సాధ్యముకాదు.

ఇచట గుణనిధికి శివలోకములు వచ్చినవి. అచట నిగమశర్మకు విష్ణుసాయుజ్యము వచ్చినది. కాని భేదమున్నది. నిగమశర్మకు విష్ణుసాయుజ్యము వచ్చుటలో పూర్వజన్మ సంస్కారము హేతువుగా చెప్పఁబడినది.

ఇక్కడ నట్టి ప్రసక్తి లేదు. కథలో పూర్వజన్మ సంస్కారమని నేను వ్రాసితిని. గ్రంథమందు లేదు. శివధర్మములు సూక్ష్మములనుటలో నున్నది.

అనఁగా నేమగుచున్నది? ఉపవాసము, జాగరము, దీపారాధనము, శివదర్శనము, మృత్యువు సర్వమును వాని మనస్సులో లేవు. మనస్సునకు, సూహకు, బుద్ధికి, అహంకారమునకు, నంతఃకరణమునకు సంబంధములేని పనులు జరిగినవి. ఆ పనులు శివభక్తికి సంబంధించినవి. శివారాధనకు సంబంధించినవి. జరిగిన వెప్పుడో శివరాత్రినాడు. అనఁగా కాలమునకు ప్రాధాన్యమువచ్చినది. తత్కాలమునకు సంబంధించిన తత్క్రియలకు ప్రాధాన్యము వచ్చినది.

ఆ సమయము నందట్లు జరుగుట కాలస్వరూపుడైన పరమేశ్వరుని సంకల్పమన్నట్లుగానైనది. ఇదియొక మహారహస్యము. ఇచ్చట మనదేదియు లేదు. అంతయు దైవసంకల్పము. శివధర్మము దీని మీద నాధారపడినట్లున్నది.

# హరవిలాసము

ఇదియు శ్రీనాథ మహాకవి వ్రాసినదే. ఆయన వీరశైవుఁడని చెప్పవలయును. ఆయన వ్రాసిన కొన్ని కథలు వీరశైవాచారములను వెల్లడించును. కుబేరుని కథ వీరశైవమే కదా! ఆధునికులైన కొందఱు విమర్శకులు శ్రీనాథుఁడు వీరశైవుఁడనియే వ్రాయుచున్నారు.

ఈ హరవిలాస మేడాశ్వాసముల గ్రంథము. ఇందులో ద్వితీయాశ్వాసమంతయు చిఱుతొండ నంబి కథ. ఇది నిస్సంశయముగా వీరశైవ కథ.

తొలుత నొక విషయమును చెప్పవలయును. మనదేశములో ననేక దర్శనము లున్నవి. అనేక మతము లున్నవి. కొన్ని వైదికములు. కొన్ని అవైదికములు. సాంఖ్యము. యోగము, బౌద్ధమతము. ఇవి అవైదిక మతములు. తక్కినవి వైదికములే! వీరశైవ మవైదికమని చెప్పవచ్చును అచ్చముగా నట్లు చెప్పుటకును వీలులేదు.

వైదికమతములోకూడ భేదము లున్నవి.

అద్వైత మతము సంపూర్ణముగా నుపనిషన్మతము. జీవుఁడు పరమేశ్వరుఁడు అనేకములైన యుపాసనలు వీనినన్నిటిని గుఱించి యుపనిషత్తులు చెప్పినంత గాఢముగా మంత్రము చెప్పలేదు. మంత్రమనఁగా నాల్గువేదములును, మంత్రము, ఉపనిషత్తు, బ్రాహ్మణము. ఈ మూఁడింటికి కలిపి వేదమని పేరు. అందుచేతనే వేదమునకు త్రయీ అని పేరు.

కాని యుపనిషస్స్పర్శ లేకుండ నేమతమునకును లోతుండదు. శ్రీనాథుని వీరశైవము కొన్నిచోట్ల యుపనిషత్తులలోతు కల మతము. మరియు నీ చిఱుతొండనంబి కథ. శివభక్తి శివభక్తియే. శివాచారము శివాచారమే. వానియందలి వీరత్వము వీరమే. కాని యుపనిషత్తులలోని కొన్ని లోతులు కల కథ.

ఈ హరవిలాసముయొక్క ప్రథమాశ్వాసములో నొక తుంబురుఁడు శపింపఁబడి చిఱుతొండనంబిగా పుట్టెనని చెప్పఁబడినది.

శివుని కైంకర్యము చేయువారిని ప్రమథులందురు. వారిలో నొకని పేరు తుంబురుఁడు.

భారతదేశమునందు కాంచీనగరమున్నది. అచ్చట చిఱుతొండ డన్న వైశ్యోత్తముఁడు కలఁడు. అతఁడు నిత్యము జంగమారాధనలను చేయు చుండును.

కైలాసమునందు పార్వతీ పరమేశ్వరులు మాటాడుకొనుచుండగా శివుఁడు పార్వతితో బసవేశ్వరుఁడు తన కెట్టి భక్తుఁడో చిఱుతొండనంబి తన కట్టిభక్తుఁడని చెప్పెను. బసవేశ్వరుఁడు ప్రసిద్ధుఁడు. వీరశైవమతమును స్థాపించినవాఁడు. కర్ణాటభాషలో కొన్ని వేల శివకీర్తనలు వ్రాసినవాఁడు. పశ్చిమ చాళుక్యరాజ్యమునకు కళ్యాణనగరమునందు మంత్రి. శివుఁడెక్కు నంది బసవయ్యగా పుట్టెనని చెప్పుదురు. ఆయన యెంతభక్తుఁడో యీయన యంతభక్తుఁ డనుటచేత పార్వతి యతనిని చూడవలయునన్నది. శివున కతని భక్తిపారమ్యము పార్వతికి చూపించవలె ననిపించినది.

అప్పుడు శివుఁడు ఇంద్రుని పిలిపించి కంచిపట్టణమున నిరువదియొక్క దినములు ఎడతెఱిపిలేకుండ వానలు కురిపించుమని చెప్పెను. అతఁడు కురిపించెను. ఆ వానల కెవ్వరు తట్టుకొనగలరు ? ఆ వానలకు నిలువలేక కంచిపట్టణమున నున్న సర్వభిక్షుకులు లేచిపోయిరి.

వానలిట్లు కురియుచున్నను చిఱుతొండడు జంగములకు సంతర్పణ ములు చేయుచునేయుండెను. చిఱుతొండని కుమారుని పేరు సిరియాళుఁడు. అతని దాదిపేరు చందనిక.

> వంట చెఱుకులు లేకున్న వాములైన
> వస్త్రములు తైలమున ముంచి వహ్ని నూర్చి
> వంటకంబులు వండి యవ్వారి గాగ
> పెట్టు శివభక్తతతికి నంబి ప్రభుండు.

ఇట్లుండగా నావాన వెలసెను. ఈ చిఱుతొండడు ఒక్కడైనను జంగమ ప్రమథునకు భోజనముపెట్టకుండ తానుతినడు. అది యతనివ్రతము. తాను ఆనాడు శివారాధనముచేసి వాకిఁటవచ్చి చూచెను. ఎప్పుడతని వాఁకిట

జంగములుందురు. ఆనాఁడొక్కఁడైనను లేఁడు. లోనికిఁబోయి — ఆయన భార్యపేరు తిరువెంగనాంచి — యామెతో తానొక శివయోగిని వెదకి తెచ్చెదనని పోయెను. ఆ మహానగరమంతయు వెదకెను. ఒక్కఁడును కనిపించలేదు.

ఆ యూరిబయట నొక పాడుగుడిలో నెనుబదియేండ్ల వాఁడు మిక్కిలి ముసలి, మరియొక యెనుబదియేండ్ల ముసలి గ్రుడ్డియవ్వ పాదము లొత్తుచుండగా పులిచర్మముమీద పండుకొని యున్నవానిని చూచి నమస్కరించి వారిద్దఱిని తన యింటికి నాఁడు శివార్చనకు రమ్మనెను.

అనఁగా నా ముసలి "నీ వెవరవు ? నీ వెవరవైన నేమిలే, నేను వత్తును. కాని నే నొక నిరాహారదీక్షలోనున్నాను. పడాదినుంచి యన్నము తినుటలేదు. నే నా వ్రతమున కుద్యాపనము చేయవలెను. నాకు నరమాంసము కావలయును. వాఁడు పిన్నవయసువాఁడు కావలయును. వాని తల్లిదండ్రులు వాని మాంసమును వండి వడ్డించఁగా గృహస్థును వానికొడుకును నా పంక్తిని కూర్చుండితినఁగా నే నా వ్రతమును పూర్తిచేయుదు"ననెను.

అనఁగా చిఱుతొండఁడు తా నట్లేచేయుదు ననెను.

అప్పుడు వృద్ధుడు "అది యేమయ్యా ! నీవు అంగీకరించిన కాదు. నీభార్య అంగీకరించవలయును. ఒకవేళ నీ భార్యయు నొప్పుకొనునందము. నీ కొడు కొప్పుకొనవలదా ?"

అనఁగా చిఱుతొండఁడు తనభార్యయు తనకొడుకు తనమాట కెదురాడరని తెలిపి యతనిదగ్గఱ విభూతి తీసికొనెను. తీసికొని యింటికి వెళ్ళి భార్యతోచెప్పెను.

అప్పుడు శివుఁడు మారువేసము వేసికొని పాఠశాలయందు చదువుచున్న సిరియాలుని దగ్గఱకుబోయి వానితో నిట్లనెను :

"అన్నా ! యీ చిఱుతొండనంబియను పాపాత్ముడు మీ తండ్రియే !
యన్నిర్భాగ్యుఁడు జోగికొక్కరునికిన్ హాలామదోన్మాదికిన్
నిన్నుంజంపి మహేశహారముగ వండింపంగ నున్నాఁడు సం
పన్న స్నేహముతోడ నీకు నెఱిఁగింపన్ వచ్చితిం జెచ్చెరన్."

నిన్నుచంపి యొకజోగికి విందుచేయుటట. 'నీ తండ్రి' రాక్షసుఁడుగాని మనుష్యుఁడుకాడు. కనుక నీ వెచ్చటికైనను పారిపోయి యీ గండము తప్పించుకొనుము.

అనవుడునుం గుమార సిరియాళుఁడు వీనులు మూసికొంచు నో
యనఘచరిత్ర ! నీకు నిటులాన తి యీఁదగునయ్య నీకుఁ గా
దని పలుకంగ భయమయ్యెడుఁగాక పరార్థమై తనూ
ధనము వ్యయింపఁ గల్గుఁగదా జన్మనైకఫలం బెఱింగితన్."

అని యా కుఱ్ఱవాఁడు వేదాంతముఁజెప్ప నారంభించెను. అప్పుడు శివుఁడు వీఁడు తండ్రికంటె నధికుండని వానికొక మూర్ఛ తెప్పించెను.

ఆ కుమారసిరియాళుఁడు చనిపోయెను. కాని యా గురువు వాని మొగమునందు భస్మమునలదెను. వాఁడు బ్రతికెను.

అంత చిఱుతొండఁడు ఈ ముసలియోగిని తన యింటికి తెచ్చెను. అతనిని భుజముమీద నెక్కించుకొని తెచ్చెను. అతనికి తలంటిపోసెను.

అప్పుడు శివాజ్ఞచేత :

"పల్లియచోటనుండి యెలప్రాసఁగు టడ్కులు జక్కిలంబులున్
బెల్లపుటచ్చులున్ సెనగబేడలుఁ జిమ్మిలి నువ్వులుండలున్
బెల్లుగనంబి వియ్యములు పెద్దటికంబు బ్రియంబునొప్ప మే
నల్లునకుం గుమార సిరియాలునకుం గొనితెచ్చి రర్మిలిన్."

ఈ పద్యములో నాహారపదార్థములు పేర్కొనఁబడెను. శ్రీనాథుని కవిత్వములోనున్న మరియొక విశేషమేమనగా భోజనము వంటకములు తినెడి కమ్మని పదార్థముల వర్ణన. కొతిమేర పచ్చిమిరపకాయలు మొదలైన వానితోడి కమ్మని వంటకములు వాని సువాసన యిట్టివెన్నియో వర్ణింపఁ బడుచుండును.

శివ పార్వతులు కొడుకును చిఱుతొండ నంబిచేత చంపించి పరీక్షింప వలయును. ఆ సమయమున పార్వతీదేవి యింకొక యెత్తెత్తెను. తాను వేఱొక తాపస స్త్రీవేషమువేసికొని వారింటికి వచ్చెను.

ఫాల పట్టికయందు భస్మ త్రిపుండ్రంబుఁ
గర్ణంబులను రాగి కమ్మదోయి
కంఠమం దిత్తడికంబంపుఁ గంటియ
ఘనకుచంబులమీదఁ గావి గంత
కటి మండలంబునఁ గరకంచుఁ బుట్టంబు
కుడి సంది గిరి పెండ్లికొడుకుఁ గుఱ్ఱ
కేలుఁ దామరయందుఁ గేదార వలయంబు
జడకుచ్చుమీదఁ బచ్చడపుఁ గండ

సంతరించి పదాఱు వర్షముల వయసుఁ
బచ్చిబాలెంతరాలు తాపస పురంధ్రి
నంబిభామినిఁ దిరువెంగనాంచిఁ జేరి
పాలు వోయింపుఁడమ్మ పాపనికి ననియె.

ఈ హరవిలాసము శ్రీనాథుఁడు వ్రాసిన చివరి పుస్తకమై యుండ వలయును. ఆయన వ్రాసిన తక్కిన పుస్తకములు నిండుగా ప్రవహించు కాల్వలవలెనుండును. ఇందులోని శైలి చాల సుకుమారమైన సౌకుమార్యములో మాధుర్యము తొణికిసలాడుచుండును.

తిరువెంగనాంచి తాను బిడ్డను చంపఁబోవుచున్నానన్న లక్షణముకూడ లేకుండ ఏ దిగులు లేనట్లుగా నామెకు పాలుపోసెను. పార్వతీదేవి దయచేత కఱగిపోయెను.

శ్రీనాథుఁడు పార్వతినిఁగూర్చి యిచ్చట నొకమాట వాడెను. ఆమె పేరు శూలినాంచారు. శూలి — శివుఁడు. నాంచారు, నాంచారి — ఈరెండు మాటలు తెలుఁగులో పార్వతీదేవినిగూర్చి చెప్పునవి. కొన్నికొన్నిచోట్ల నాంచారమ్మ గుడులుకూడ గలవు. నాంచారి, నాంచారు అన్నశబ్దములలో 'ఉ'కారాంతమైన శబ్దము అనఁగా నాంచారు భక్తులకు మిక్కిలి ప్రియమైన శబ్దము. గౌరు, నాంచారు ఈ మాటలు తెలుఁగుదేశములో శివభక్తులకు ప్రియములైన శబ్దములు.

అట్లు పాలు పోయించుకొని పార్వతి తిరువెంగనాంచితో నిట్లనెను: "ఏవమ్మా? యూరిలో చెప్పుకొనుచున్నారు. మీ యాయన యెవడో శివ

యోగికి కొడుకును జంపి యోగిరముగా బెట్టుదనని. జోగులు కపటులు వారిని నమ్మెదురా ?

ఆవగింజంత భూతి మైని నలఁదికొనిన
వెలఁది గుమ్మడి కాయంత వెట్టిపుట్టు
కటకటా ! యెటుల తనబుద్ధి కాటగలియ
నిసువు చంపంగ నెంచెనో నీమగండు "

అనఁగా నామె తన శివభక్తి ననుసరించి మాట్లాడెను. పార్వతి లాభములేదని వెడలి పోయెను. పిల్లవానిని పాఠశాలనుండి తీసికొని వచ్చిరి. అతనికి తలంటిపోసిరి. అలంకరించిరి. వానితోఁ జెప్పిరి. "నాయనా ! నిన్ను చంపి యొక శివయోగికి శివార్చనము చేయబోవుచున్నాము. నీకిష్టమేనా ?'' యని యడిగిరి. అతఁడు దానికంగీకరించెను.

తల్లి చన్నిచ్చుబాగున వానిని తొడలపై పండుకోబెట్టెను. చందనిక తన చేతులతని తల క్రిందఁ బెట్టెను. సిరియాళుఁడు చేతులు మొగిడ్చెను. అప్పుడు తండ్రి కొడుకుతో నిట్లనెను :

"మది శంకింపకుమన్న ! మావలని ప్రేమ స్నేహావాత్సల్య సం
పద వాటింపకుమన్న ! నాలుకతుదిన్ బంచాక్షరీ మంత్రముం
బదిలంబొప్ప జపింపుమన్న ! పరమబ్రహ్మార్థ సంసిద్ధి యి
య్యది సుమ్మన్న ! యనుంగునందన ! సిరాలా ! వీరశైవ వ్రతా !"

ఈ పద్యములో పరమ బ్రహ్మార్థ సంసిద్ధి యని యున్నది. పరమ బ్రహ్మము యొక్క అర్థముయొక్క సంసిద్ధి. లేదా పరమ బ్రహ్మము అను నర్థముయొక్క సంసిద్ధి. ఆ బ్రహ్మసిద్ధి శివసాయుజ్యమో శివసారూప్యమో అయినచో బ్రహ్మ శబ్దమును వాడనక్కఱలేదు. బ్రహ్మమునకు శివునకు నభేద ప్రతిపత్తియైనచో వాడవచ్చును. కాని బ్రహ్మార్థ సంసిద్ధి బదులు శివార్థకమైన శబ్దము వాడవచ్చును. వాడలేదు

అంత తండ్రి కొడుకు మెడ తెగవ్రేసెను. తెగిన శిరస్సు పంచాక్షరీ మంత్రమును జపించుచుండెను. ఆ కొడుకు మొగమునం దేమియు దుఃఖము లేదు. దిగులులేదు. విచారములేదు. తలిదండ్రులు సంతోషించిరి. వారి

కెట్లున్నదనగా పందెముపెట్టి గెలిచినట్లున్నది. అప్పు చక్కగా తీర్చినట్లున్నది.

మిరియము నుల్లియున్ బసుపు మెంతియు
నింగువ జీరకంబు శ
ర్కరయును జింతపండును గరాంబువు
గమ్మనినేయి తైలమున్
బెరుగును మేళవించి కడుఁబెక్కు విధంబులఁ
బాక శుద్ధి వం
డిరి సిరియాళునిం గటికి డెందమునం
దరళాక్షులిద్దఱున్.

(శ్రీ)నాథుఁడు వంటకములు భోజనములు మొదలైనవానిని గుఱించి యెక్కువ వర్ణించునుగదా! ఇది యట్టి పద్యము. తరువాతి సీసపద్యము కూడ నిట్టిదియే!

ఈ రీతిగా వంట సిద్ధముజేసి యా వృద్ధ దంపతులను దీసికొనివచ్చి వారినర్చించి చిగురుముదురు కాని నిడుపువెడల్పుఁగల యరటియాకు నడిమియీనె తీసి పఱచి కడిగి చక్కగా వడ్డించి వారిద్దరను ఆరగించి రక్షింపుడని యడిగెను.

అంత భైరవయోగి వడ్డించిన మాంసపదార్థములన్నియుఁ జూచి యిందులో తలలోని మాంసము లేదు. మా వ్రతము భగ్నమైనదని యల్లరి చేసెను. అప్పుడు చందనిక యిట్లన్నది. "ఈ యోగులు తెచ్చెదు బెకంద నాకు దెలియును. అందుచేత దానిని వేఱపాకము చేసితి"నని వడ్డించెను.

అప్పుడు యోగి యిట్లనెను: "నీవు నా పంక్తిని కూర్చుండక నేను భోజనము చేయను. మగబిడ్డలేని నిర్భాగ్యుని ఇంట నేను భోజనము చేయను. నేను మొదటనే చెప్పితిని. నీవు నీకొడుకును పిలిపింపుము. ముగ్గురము కలిసి భుజించెదము."

అనఁగా చిఱుతొండడు "నాకింకొక కొడుకున్నాడు. వాడాటలకు పోయియుండును. వాడు వచ్చువఱకు కూరలు చల్లనారిపోవును" అనెను.

నిజానికి చిరుతొండనికి సిరియాలుడొక్కడే కొడుకు. ఈ సంగతి తొలుత చెప్పినచో శివయోగి భోజనమునకు రాడని చెప్పలేదు. సహపంక్తిని గూర్చుండి భోజనము చేయుటకు మరియొక కొడుకు లేడు ఇంత వ్యవహారము వృథాయైపోవునట్లు తోచెను.

అప్పుడు శివయోగి యిట్లనెను: "నీ భార్యను నీ కొడుకును పిలుపుమనుము. నాలుగు దిక్కులందు పిలువుమనుము. అతడు వచ్చినచో సరే! లేనిచో మనమే భుజింతము. లేనిచో నా యింతటి వ్రతమును నేను పాడు చేసికొందునా?"

అనగా తిరువెంగనాంచి నాలుగు దిక్కులనిట్లు ఎలుగెత్తి పిలిచెను.

రారా ఫణిగ్వంశ వారాశిహిమధామ!
　　రారా వికస్వరాంభోరుహాక్ష!
రారా మహాఘోర వీరశైవాచార!
　　రారా ఘనౌదార్య రాజరాజి!
రారా కుమార కంఠీరవేంద్ర కిశోర!
　　రారా సమగ్ర ధీరాహిణేయ!
రారా మనోజ్ఞవాకార రూపవిలాస!
　　రారా యసార సంసార దూర!
రార నావన్నెవడుగ! రారా తనూజ!
రార సిరియాల! రార నా ప్రాణ పదమ!
రార నా కుఱ్ఱ! నాజియ్య! రార యనుచు
జీరు గారావు గొడుకు రాజీవనయన.

అత్తన్వంగి సమస్త దిక్కులను పర్యాయ క్రమంబొప్పగా
నొత్తెం జిన్నికుమార రారయని యత్యుచ్చైచ్ఛ్రుతిం జీరినం
జిత్తంబుబ్బగ వచ్చె బాలుడు మహా శీఘ్ర ప్రచారంబుసన్
దత్తద్వ్యంజన పాకగంధ్యవంగవ స్థాన ప్రతానంబుతోన్.

ఈ కథలోనున్న పట్టంతయు నీరెండు పద్యములలో నున్నది. చచ్చినవాడు కూరలుగా వండబడిన మాంసము కలవాడు. బ్రతికివచ్చుటయెట్లు? ఇది యసంభవముకదా!

అగస్త్య మహర్షి వాతాపియను రాక్షసిని చంపెను. ఇల్వలుఁడు వానిని గొర్రెనుచేసి యా మాంసము నగస్త్యునకు వండి పెట్టెను. అగస్త్యుడు తిన్నంతసేపు "వాతాపి జీర్ణం—వాతాపి జీర్ణం" అనుచు తినెను. తరువాత నిల్వలుఁడు వాతాపిని పిలువగా వాడు రాలేదు. జీర్ణమైపోయెను. అనఁగా జీర్ణమైనచో మరల బ్రతుకుట సంభవము కాదుగాని జీర్ణము కానిచో బ్రతుక వచ్చుననన్నమాట!

బ్రతుకుట యనఁగానేమి? ఈ శరీరావయవములు సంతన పడఁగా ప్రాణములు వచ్చి యందులో చేరుట.

సంతనపడుట యెట్లు? ఎంత ప్రకృతిశాస్త్ర మహావిజ్ఞానమైనను మనుష్యులను సృష్టించుట లేదుగదా! గుండెలు మార్తురు. రక్తమెక్కింతురు. మరియొకరి యవయవములను దీసి మరియొకరికంటింతురు. మానవులయొక్కయు జంతువుల యొక్కయు శరీరములు నిర్మింపబడుటకు స్త్రీ గర్భమందు నిక్షిప్తమైన పురుషుని రేతస్సే కారణముగా గన్పించుచున్నది. అది పట్టి భగవదధీనము. ఈ శరీరములను భగవంతుఁడు సృష్టించుచున్నాడు. పెంచుచున్నాఁడు. ఇచట ప్రకృతి శాస్త్ర దురహంకారము పనిచేయదు. ఆ దురహంకారము దురహంకారముగానే మిగులును. అది యితరులమీద ప్రయోగించుటకు పనికివచ్చును గాని సృష్టి చేయుటకు పనికిరాదు. ప్రకృతి శాస్త్ర పరిజ్ఞాన మతుకులమారి బొంత. సృజన శక్తి కలది కాదు.

దైవము యొక్క విలాసముచేత సృష్టి కలుగుచున్నది. పెరుగుచున్నది. కొంతకాలము పట్టుచున్నది. కాలముకూడ భగవంతుఁడే. వాఁడు తలచినచో కాలముకూడ నక్కఱలేదు. దీనికెన్ని యుదాహరణములు కలవు! ఇది శాస్త్రగ్రంథము కాదుగాన వ్రాయుటలేదు.

అసలీశరీరము నిర్మింపబడవలసిన యవసరమేమి? జీవుఁడు తన కర్మ ఫలము ననుభవించుటకు. ఈ శరీరముండుటతోడనే దీనిలోనికి ప్రాణములు వచ్చిచేరుచున్నవి. అవి యెచ్చటనుంచి వచ్చుచున్నవి?

నానా దిక్కులనుండి వచ్చుచున్నవి. అనగా సర్వదిశలును ప్రాణ భరితములని యర్థము. పంచభూతములయందు ప్రాణములున్నవని యర్థము.

జీవుఁడుగా కావలసిన ప్రాణముల లక్షణము వేఱు. అవి భగవంతునికే తెలి యును.

ఇవి యతీంద్రియ విషయములు. అతీంద్రియ విషయములు వేదముతే చెప్పఁగలవు.

సామాన్యులు మరణింతురు. యోగులు సిద్ధులు మరణింతురు. వారికి పునర్జన్మ లేదు. కర్మబద్ధులైన జీవులకు ప్రాణసంపుటి చెడదు. సిద్ధులకు యోగులకు ప్రాణసంపుటి చెడిపోవును.

ఈ మహా విషయము ఇంధ బ్రాహ్మణములో కలదు. అది బృహ దారణ్యకములోని చతుర్థాధ్యాయములోని ద్వితీయ బ్రాహ్మణము. అచ్చట నిట్లున్నది :

తస్యప్రాచీదిక్ ప్రాంచః ప్రాణాః
దక్షిణాదిక్ దక్షిణే ప్రాణాః
ప్రతీచీదిక్ ప్రత్యంచః ప్రాణాః

మొదలుఁగా ఏ దిక్కు ప్రాణములాదిక్కునకు పోవును. అప్పుడు బ్రహ్మ పదార్థము మిగులును.

ఈ మహా రహస్యమును శ్రీనాథుఁడీ కథ చివర ననుసంధించెను.

ఆ సిరియాలుఁడు బ్రతికెను. బ్రతుకుట యెట్లో శ్రీనాథుఁడు వేదముయొక్క సాక్ష్యమును చూపించెను.

రెండవ పద్యములో నాల్గవ చరణములోని యర్థము, కవితాగుణ ముతో కూడియున్నది. అనఁగా కల్పనా చమత్కార సహితముఁగా నున్నది.

అనఁగా నాపిల్లవాని యవయవములు పెట్టిన పోపులవాసనలు వేయు చున్నవఁట.

అప్పుడు శివుడు ప్రత్యక్షమయ్యెను. వరములిచ్చెను.

# భీమేశ్వర పురాణము

ఈ గ్రంథమునుఁగూడ శ్రీనాథుఁడే రచించెను దీనిని భీమఖండమని కూడ నందురు.

## వ్యాసుఁడు కాశిని వదలిపెట్టిన కథ

పూర్వము మహర్షులందఱు కాశీ పట్టణమునందు నివసించి యుండెడి వారు. అచ్చటనుంచి వదలిపెట్టుట కెవ్వరికిని ప్రాణములొప్పెడివికావు. తప్పనిసరికి వదలి వచ్చెడివారు.

కాశి అవిముక్త క్షేత్రము. ఆనందకాననము. అగస్త్యుఁడు పూర్వ మెప్పుడో వింధ్యాచలమును శిక్షించుటకొఱకు దక్షిణదేశము వచ్చెను. మరల నాయన వెళ్ళుటకు వీలులేదు. ఈయన తిరిగి వెళ్ళినచో మరల నా వింధ్య పర్వతము లేచును. అది లోకమున కుపద్రవకరము.

కొన్నాళ్ళకు వ్యాసమహర్షి కాశినుండి వచ్చెను. మహర్షులిద్దఱు కలిసికొనిరి. వ్యాసునిమొగము వెలతెల పోవుచుండెను. అతని కన్నులయందు దైన్యము కనిపించుచుండెను. అగస్త్యుఁడు వ్యాసునిట్లడిగెను.

లోలార్కునకు నీకు లోలోన నేమేనిఁ
బోటు పుట్టదు గదా మాట మాట
వెనకయ్య శ్రీడుంఠి విఘ్నేశ్వరస్వామి
ధిక్కరింపడుగదా తెగువ నిన్ను
నాఁకొన్న నిన్ను మధ్యాహ్న కాలంబున
నరయకుండదుగదా యన్నపూర్ణ
నెపమేమియునులేక నీయెడాటమ్మునఁ
బాటి దప్పఁడుగదా భైరవుండు

ఎట్టుపాసితి మిన్నేటి యిసుకతిప్ప
లెట్టుపాసితి వాస్థలం బేను కోసు
లెట్టు పాసితి నవిముక్త హట్టభూమి
యెట్టు బాసితి విశ్వేశు నిందుధరుని.

లోలార్కుడు శివుడు. శివునకు నీకు లోలోన స్పర్ధ కలుఁగ లేదుకదా! లేనిచో మాట మాట పట్టింపు రాలేదుకదా ! అని మొదటి ప్రశ్న.

అనఁగా ఆ మహర్షులును శివుఁడును ఒకపాయ వారన్నమాట. అని మరికొన్ని ప్రశ్నలు వేసెను.

అప్పుడు వ్యాసుఁడిట్లు సమాధానము చెప్పెను.

"మేము అనగా నేనును నా మూడువందలమంది శిష్యులు జైమిని, పైలుఁడు, సుమంతుఁడు మొదలైనవారు — మేము — భూమి యంతయు తీర్థయాత్రలు చేయుచు కాశికి వచ్చితిమి. (కాశికి వెళ్ళితిమి కాదు. అది వారి స్వస్థలమన్నమాట) ఏ శకునమున చొచ్చితిమో ! ఏడునాళ్ళువవాస ముంటిమి.

"గేహములకేఁగి భిక్షాం
దేహీ యనన్వీఁట నొక పతివ్రతయైనన్
సౌహార్దంబునఁ దెడ్డెం
డాహారము పెట్టదయ్యె నాదినములలోన్."

ఏ పతివ్రతయు ఒక తెడ్డెడన్నము పెట్టలేదుట. ఈ మాట వాడుట చాల అందము. శ్రీనాథుఁడిట్టి తెలుఁగు మాటలు వందలు వాడును.

మేమేడు దినములిట్లు గంగ యిసుకతిన్నెలమీద నుపవాసములుచేసి యుండగా నాకు కోపము వచ్చినది. నా చేతిలోనున్న భిక్షా పాత్రము రాతి మీదవేసి వగులఁ గొట్టితిని. నేను శివునిగాని గంగానదినిగాని విఘ్నేశ్వరుని గాని కాలభైరవునిగాని లెక్కచేయలేదు. కాశిని శపింపఁ బూనితిని. గంగా జలమునుఁ దీసికొంటిని. శిష్యులందఱు కోప ముపసంహరింపుమని బతిమాలిరి. నాకు కోపమాగలేదు, కాశి నిఖిలకైవల్య కళ్యాణనిలయము. శివునియిల్లు.

అచట గంగ యున్నది. ఏమని శపించవలయును ? ఏమని శపించవలయునో యాలోచించి నిర్ణయించుకొంటిని. ఆ నిర్ణయమిది.

మాభూ త్త్రైపూరుషీవిద్యా
మాభూ త్త్రైపూరుషంధనమ్
మాభూ త్త్రైపూరుషీ భక్తిః
కాశ్యాంని వసతాం సదా.''

ఈ కాశిలో నివసించెడు జనులకు మూడుతరాలు చదువుగాని, డబ్బుగాని, భక్తిగాని లేకపోవుగాక ! యని. ఇంక శాపజలమందు కొనుటకు నా చేయి యాడలేదు.

అప్పుడు కాశిలోని సోమపీధియందొక యింటిలోనుండి యొక ముసలి యామె వచ్చెను. ఆమె కేబది యేండ్లు. తల నరసినది. ఆమె వక్షోజములు జారియున్నవి, చేతి కంకణములు ఘలుఘల్లురాడ కాలి మట్టియల మ్రోత ముల్లోకములయందు మ్రోంగగా పీధి గడప ముందునకు కాలుపెట్టి మన్మథుని తావుటాయైన చేవల కాంతికి చుట్టాలైన కన్నులు మిక్కిలి విశాలములుగా నుండగా వీణా ధ్వనివలె కంఠమెత్తి "యోయి ! బ్రాహ్మణుఁడా ! శపించకుము. ఇటురమ్మ" అని నన్ను పిలిచెను.

''సంతసమంది యేనపుడు శాప జలంబులు పాఱజల్లి వే
దాంత వచోమహోపనిషదర్థమయిన్ శుభరూప వృద్ధ సీ
మంతినిఁ గాశికానగర మధ్యనివాసిని విశ్వనాథు శు
ద్ధాంతముడాయఁ బోయితిఁ బ్రియంబును భక్తి
యునుం దలిర్పఁగన్.''

ఆ పిలచినది పరమేశ్వరియని నాకు తెలియును. ఆమె మహోపనిషదర్థమయి. ఆమెయే మహోపనిషత్తులయొక్క యర్థము. ఉపనిషత్తులున్నవి. అందులో కొన్ని మహోపనిషత్తులున్నవి. అవి యుపాసనా భాగములు. ఈమె సాక్షాత్పరమేశ్వరి. శ్రీదేవి. అందుచేత మహోపనిషదర్థమయి. ఈ ''మహా'' శబ్దములోనున్న రహస్యమిది. ఆమె విశ్వనాథు — శుద్ధాంతము అనగా — అంతఃపుర స్త్రీ

నేనుపోయి యామెకు నమస్కారము చేసితిని. ఆమె నన్ను చేరఁ బిలిచి యిట్లనెను. భిక్ష లేదని కాశీమీద యింత కోపము చేయుదురా? నీమనశ్శుద్ధి తెలియుటకు నీలకంఠుడిట్లు చేసెను. అంతియేకాని కాశిలో కూడేమిబ్రాతి! తిండికి లోపమా?

"ఏడు దినమ్ములన్నమున కెడ్డముపుట్టిన యంతమాత్రలో
నేడుచుచున్నవాఁడవు మునీశ్వర! నేడుననీదు ధీరతల్
పాడఱి పోయెనే శివుని భార్యకుఁ రాశికిఁబుణ్యరాశికిన్
గాడు నొనర్పఁజూచెదవు కంతపుఁ గ్రోధము పెచ్చులెచ్చగన్.
క్రొన్నెల పువ్వుఁదాల్పునకుఁగూరిమిభోగపురంధ్రి కక్కటా
యిన్నగరీలలామునకీ వరిపాటికినిట్టి కోపమే
లన్న ఘటించె దోమునికులాగ్రణి! నిక్కమువో బుభుక్షితః
కిన్నకరోతి పాప మను కేవలనీతిఁ దలంచిచూడగాన్."

ఆమె పరమేశ్వరి. వ్యాసుఁడంత మహార్షి నేమనుచున్నది. తిండి లేక యేడ్చుచున్నావన్నది. ఈ నగరీలలామము. — అనగా ఈ మహానగర రాజము క్రొన్నెల పువ్వు తాల్పునకు అనగా శివునకు ఈమె కూరిమి భోగ పురంధ్రి. ప్రేమ కలిగిన వలపు టిల్లాలు. "బుభుక్షితః కింన కరోతి పాపం" ఆకలిగొనవా డేపాపము చేయడు? అని యర్థము. ఈ మాట యెంత విచిత్రముగా నున్నది. మానవులు రాజ్యములు సిద్ధాంతములు నేటి సర్వ నాగరకతయు నొక్కమాటలో చెప్పినట్లున్నదే! నీవు బ్రాహ్మణుఁడవు. కానీలే భిక్షకు రమ్ము.

అనఁగా నేనిట్లంటిని :

"తల్లీ! యిన్ని దినాలకేనియు సుధాధారా రసస్యందియై
యుల్లంబున్ సుఖియింపఁజేయు పలుకెట్లో వింటి నివ్వీటిలోఁ
బెల్లాకొన్నకతాన నేనొకఁడనే భిక్షానకున్ వత్తునో
యెల్లన్ శిష్యులఁగొంచు వత్తునో నిజం బేర్పాటుగా జెప్పుమా.

నేనొక్కడనే భోజనమునకు రానా యెల్లన్ శిష్యులను గొంచు వత్తునా యని యడిగినాడు. ఇందులో యెల్లన్ విశేషణము. శిష్యులు విశే ష్యము. విశేషణమైన యెల్లశబ్దమునకు చివర నకారముండరాదు. ఎల్ల

శిష్యులని యుండవలయును. ఎల్ల రాజులు, ఎల్ల స్త్రీలు, ఎల్ల కామినులు అనవలెగాని ఎల్లన్ రాజులు, ఎల్లన్ జనులు అనరాదు. కాని యిచ్చట శ్రీనాథుఁడు ఎల్లన్ శిష్యులన్ అని వ్రాసినాడు. లేనిచో గణము పోవును. ఇది శ్రీనాథుని ప్రయోగము. అందుచేత కాదనుటకు వీలులేదు. "కాదు, నీవు నాకొక్కనికే భిక్ష పెట్టెదవేని దానినే మేమందరమును పంచుకొని తిని ప్రాణములు రక్షించుకొందుము."

అనఁగా నామె చిరునవ్వు నవ్వి యందఱను రమ్మనెను. వారందరు గంగలో స్నానముచేసి వచ్చిరి. ఆ మేడమీద సున్నము వేసిన రెండరుగు లున్నవి. వీరు పోయి కూర్చుండిరి. మేము వచ్చితిమని శంభళీ జనములు చెప్పిరి. శంభళీ జనములనఁగా ద్వారపాలకులు: సేవకులు. ఆమె - ఒక బంగారు గొడుగు, కాళ్ళకు పావలు, గిలకలు, - ఒక సౌందర్యవతి తాంబూల కరండ వాహిని - యామె చేయి పట్టుకొని వచ్చి మమ్ము గౌరవించి మమ్ము కూర్చుండఁబెట్టి లేత చిగురు అరటాకులు వేయించి పంక్తిపంక్తికి వచ్చి గౌరవించుచుండెను. ఆపోశనమ్ములు పట్టించనుండెను. మే మిట్లను కొంటిమి. అన్నము వండిన పద్ధతి లేదు, పొగపు వాసనలేదు, వంటపాత్రలు లేవు. త్రాగుటకు చెంబులు లేవు. ఈమె వట్టి మాటలు చెప్పుచున్నది. ముందరమాత్ర మరటియాకు లున్నవి. ఆమె గంధాక్షతాది విశేషములతో పూజించెను. శాంతి పాఠములు చదివితిమి. ఏమి చేయవలయును ? నేఁడు కూడ నిన్నటివలె నగుననుకొంటిమి. అచ్చటి స్త్రీలు మాకాపోశనములు వడ్డించిరి. ప్రొద్దుపోయినది భోజనము చేయుఁడనిరి. మేమేమి చేయవల యును ? ఇంతలో

> "పప్పును బిండివంటలును బాయసముల్ ఘృతముల్ గుడంబులం
> గుప్పలుఁగాగ జుట్టునను గూర్చుఁగఁ గూడిన యేరు బ్రాల తె
> ల్లప్పుర భోగి వంటకము గమ్మని తాలిపు సొజ్జెపిండితో
> నొప్పలుగా భుజించిరి బుధోత్తములాఁకటి చిచ్చుపెంపునన్,"

ఈ ఘట్టమంతయు శ్రీనాథుఁడు గొప్ప విందులు గొప్ప సంతర్ప రణలు జరిగెడి యాంధ్రదేశ బ్రాహ్మణ వివాహాది శుభకార్య లక్షణములు వర్ణించెను.

అందఱును భోజనములు చేసిరి. ఆ మేడ నడుమనున్న పెద్దయరుగు మీద వీరందఱును కూర్చుండిరి.

ఆ సమయమునందు గౌరియు (శ్రీ) విశ్వనాథుఁడును బంగారపు పాదుకలు మెట్టుకొనుచు, నొకనొకరి బుజాలు పట్టుకొనుచు నా యున్నచోటికి వచ్చిరి. వారి వెంట పరిచారిక లెవ్వరును లేరు ముందర నందికేశ్వరుఁడు వచ్చుటలేదు. ఆ ప్రథమ దంపతులిద్దఱు తొందఱపాటేమియు లేకుండవచ్చిరి. గౌరి యందు కారుణ్య సంపత్తి కనిపించుచున్నది. తల్లిని చూచినప్పుడు సంతోషము కలుగుచున్నది. స్వామిని చూచినప్పుడు భయము కలుగుచున్నది.

కాశి శివునకు శుద్ధాంత కాంతగాన
దానిపై నల్గి కోపపాత్రంబునైతిఁ
గాశి గౌరికి సవతియౌఁగాన నేను
దానిపై నల్గి ప్రేమపాత్రంబనైతి.

అప్పుడు మేము లేచి యెదురేగి నమస్కారములుచేసి ప్రక్కలను నిలిచి యుంటిమి. పార్వతీ పరమేశ్వరులు విజయంచేసి వేదికాస్థలమ్మున కూర్చుండిరి. అప్పుడు పరమేశ్వరుఁడు కోపముతో నా దిక్కుచూచి "ఛీ" యని యిట్లనెను :

ఓరి దురాత్మ ! నీవారముష్టింపచా
భాస ! యోజనగంధి ప్రథమపుత్ర !
దేవరన్యాయ దుర్భావనా పరతంత్ర !
బహుల సంహితా వృథా పాఠపఠన !
భారతగ్రంథ గుంభన పండితంమన్య !
నీవా మదీయ పత్నికి నశేష
కైవల్య కళ్యాణ ఘంటాపథమునకుఁ
గాశికాపురికి నిష్కారణంబ
శాపమిచ్చెదనని యనాచార సరణి
నడుగువెట్టినవాఁడ వహంకరించి
పొమ్ము నిర్భాగ్య, మాయూరి పొలము వెడలి
యెచటికేన్ శిష్యులు నీవు నీ క్షణంబ.

నీవారముష్టిం పచాభాస ! — నివ్వరిధాన్యమును అనగా చెఱువుల ప్రక్క నీళ్ళలో వానియంతట నవి పెరిగిన వరిమొక్కల కంకుల ధాన్యము. అవి యొక గుప్పెడు దెచ్చుకొని వండి తినెడివాడా ! దరిద్రుడా !

యోజనగంధి ప్రథమపుత్ర— మత్స్యగంధి మొదటి కొడుకా ! మత్స్య గంధిని శంతనమహారాజు పెండ్లియాడకముందు ఆమెయందు ఈ వ్యాసుడు కలిగెను. పరాశరునకు గలిగెను.

దేవరన్యాయ మనఁగా — అన్నదమ్ములలో సంతానము లేకుండ సోదరులు చనిపోగా వారిభార్యలందు మిగిలిన సోదరుడు కులమును నిలుపుటకు వారిని స్వీకరించుట. ఇది దేవరన్యాయము. ఈ దుష్టమైన భావన యందు పరతంత్రుఁడా !

బహుసంహిత లనఁగా సర్వవేదములు — వాని నన్నిటిని వృథాఁగా చదివిన వాఁడా !

భారత గ్రంథమును గుంఫనముచేసితిని కూర్చితిని. అందుచేత నేను పండితుడ ననుకొనెడివాఁడా !

కాశీపట్టణము కైవల్య కళ్యాణ ఘంటాపథమ్ము — కైవల్యము నడివీథి.

ఇది సీసపద్యము. వ్రాసినది శ్రీనాథుఁడు. తక్కిన సీస పద్యముల వలె లేదే ! ఇందులో పరమేశ్వరుని కోపమంతయు నున్నది. రౌద్రరస మంతయు వ్యజ్యమానమగుచున్నది. ఈ పద్యమున కున్నంత ప్రశస్తి శ్రీనాథుని యితర పద్యముల కున్నదో లేదో తెలియదు.

తెలుగు సారస్వతములో సీసపద్యమున కున్నంత విస్తారత మరియొక దానికి లేదు. ఒకానొక పెద్ద భావము తక్కిన పద్యములలో నిముడును. ఇముడదు. సీసపద్యమెంత భావమునైనను నిమిడించికొనును. తిక్కన్నగారు సీసపద్యము నెంతైన చేసెను. శ్రీనాథుఁడు తన పెక్కు సీసపద్యములందు తన ధారచేత తనసమాసగుంఫనచేత నొక హద్దులలో పెట్టెను. తరువాతి కవులు ఆ సీసపద్యరచనకు మోహపడి సీసపద్యముయొక్క విశ్వరూపమును మరచిపోయిరి.

"పోక నడగొట్టి తేనియు
రాకింతుఁజుమీ మొగంబు రాచట్టు పయిం
శ్రీకాశిక నిందించిన
నీకింతట నేలపోవు నీచచరిత్రా!"

నీవు వెళ్ళకపోయితివి. నీ మొగమును రాచట్టుమీద రాకింతును. ఇచ్చట శ్రీనాథుడు రాకించునన్న ధాతువును వాడెను. ఈ సందర్భమును బట్టి రాయు అన్న యర్థము చేసికొనవలయును.

శ్రీనాథుఁ డిట్టి తెలుఁగు ధాతువు లెన్నియో వాడెను. పెక్కు తెలుఁగు పలుకుబళ్ళు వాడెను. వాని నన్నింటిని కృష్ణరాయల సభలోని కవులందరు చక్కగా వాడుకొనిరి.

అని శివుఁడనఁగా—ఎట్టి మాటలనెను. చెవుల కొనరని మాటలనెను. (అన్నది పరమేశ్వరుఁడు. అనిపించుకొన్నది భగవంతుడైన వ్యాసుఁడు. ఏమి చమత్కారము! తక్కినవట్లుంచి భారత గ్రంథ గుంఫన పండితంమన్యుడా? అనుటయా! అన్నవాఁడు శివుఁడు గనుక సరిపోయినది. శివుఁడు గనుక అనగలఁడు. ఆయన కీ భారతము లెక్కయేమి! వేదములే లెక్క లేదాయె! ఆయన పేరు పశుపతి. పశువునకు రెండర్థములు — ఒకటి ప్రాణులు, రెండు వేదములు. 'పశవోవై ఛందాంసి' అని వేదము.

నేను కాశి వదలిపెట్టి వచ్చుచుంటిని. నేనా దుఃఖమునకు ఆ గుండె దిగులునకు నేమి కావలయును? అప్పుడు పార్వతీదేవి నన్నుఁ జూచి యిట్లనెను

వెఱవకుమో కుమార, పదివేల విధంబులనైన నిన్ను నే
మఱవ మఱేడకుం జనుట మాని సుఖంబున దక్షవాటికిన్
దుఱఁ గలిగొన్న సమ్మదముతో గమనింపుము భీమనాయకుం
డఱగఱ లేనివేల్పు నఖిలాభ్యుదయంబులు నీకు నయ్యెడున్.

తుఱఁగలిగొన్న - ప్రకాశముచు పొందిన.

పార్వతి వ్యాసుని ద్రాక్షారామమునకు వెళ్ళుమనియెను. పార్వతి యీ మాటలు వ్యాసునితో శివునకు తెలియకుండ జెప్పెను. ఇతఁడు కాశి నుండి వెడలిపోవునప్పుడు చెప్పెను.

పూర్వము మనదేశమునందు సవతి కయ్యము లెక్కువగా నుండెడివి. వాని పద్ధతులుకూడ మన కావ్యములం దధికముగా నుండెడివి. జానపద గేయములలో గంగాపార్వతుల, రుక్మిణీసత్యభామల కయ్యములు పెక్కుగా నుండెడివి. ఈభావమును పురస్కరించుకొని చాలమంది వ్రాసిరి. శ్రీనాథుఁ డిచ్చట ఈ భావమునకు ప్రాధాన్యమిచ్చెను.

ఇచ్చట వ్యాసుఁడు కాశీ వెడలివచ్చి ద్రాక్షారామమునకు వచ్చి యచ్చటనున్న యగస్త్యమహామునితో నీ కథచెప్పి యిట్లనెను :

"అనవధానత యావగింజంత సూవె
పర్వతంబంత యపరాధభరము కొలిపి
కాశి వెడలంగ మొత్తినఁ గాసిబొంది
తిరుగుచున్నాఁడ నిదె యేను దిక్కుమాలి."

అనవధానత – అశ్రద్ధ, మన యశ్రద్ధ ఆవగింజంత. శివుఁడు దానిని పర్వతంబంత చేసినాఁడు.

అని వ్యాసుఁడు కాశిలోనున్న దేవతలను గురించి యీ మాట చెప్పినాఁడు.

కడు దయాళురు దేవతాగణము లెల్లఁ
గాలభైరవు చిత్తంబు కఠినపాక
మీరసము పెద్దఢుంఠి విఘ్నేశ్వరునకుఁ
గాశి మనబోంట్లకెలనుఁగాని బ్రతుకు.

ఈ పద్యము చాల చిత్రమైన పద్యము. కాశిలో సర్వదేవతలు కలరు. అందఱు దయావంతులట! ఈ మాటలో పార్వతీదేవియున్నది. కాలభైరవుని చిత్తము కఠినపాకము. ఢుంఠి విఘ్నేశ్వరునకు ఈరసము పెద్ద. ఈరస మనగానీర్ష్య. కాలభైరవుని చెప్పెను. ఢుంఠిని చెప్పెను. ఒకటి చెప్పకుండ వదలిపెట్టెను. ఆ వదలిపెట్టినది శివునియొక్క లక్షణము. ఆయన చాల కోపియనుట. ఆయన యావగింజంత యశ్రద్ధను పర్వత మంతజేయునని చెప్పినాఁడుకదా!

శివుని పేరెత్తకుండ వ్యాసుఁడు తన భావమును చెప్పెను. చివరి కేమనెననగా

కాశి మనబోంట్ల కెల్లను గాని బ్రతుకు.

మనమందఱము ఋషులము. తపస్సుచేయుదుము. అప్పుడప్పుడు మనకు కోపమువచ్చును. మన మెవ్వరినైన శపింతుము. ఇవతల మన మాడినది యాట పాడినదిపాట. ఆ కాశిలో మనకట్లు కుదురదు. పైన శివుఁడున్నాఁడు. మనము చేసినపని యాయన కిష్టమగునో కాదో! కానిచో మన బ్రతుకులు బండలెక్కినట్లే. మన మొగములు రాచట్టులమీద రాపించుము.

ఇట్టి వలపోతయంతయు నీ రెండు పద్యములనిండ నున్నది. ఈ పద్యములలోనిదియంతయు ధ్వని. ఇట్లు వ్రాయుట చాల కష్టము.

తన మనోభావములన్నియు చెప్పుటకు వీలులేదు. మనసేమో బాధపడుచున్నది. ఒకటి రెండు మాటలకన్న నెక్కువచెప్పరాదు. తాను చెప్ప దలచుకొన్న దా రెండుమాటలవలన వ్యక్తము కావలయును ఇంతియే.

# శ్రీ కాళహస్తి మాహాత్మ్యము

తిరుపతిదగ్గఱనున్న మహాక్షేత్రము శ్రీ కాళహస్తి. ఆ యూరిపేరు వట్టి కాళహస్తి కాదు. శ్రీకాళహస్తి. శ్రీయనఁగా సాలెపురుగు. కాళమనగా పాము. కాలాహి. హస్తియనగా ఏనుగు. ఒక సాలెపురుగు. ఒక పాము. ఒక యేనుఁగు. నీ మూడును నెప్పుడో పూర్వయుగములందు నక్కడ శివ సాయుజ్యమును బొందెను. అందుచేత నా యూరునకు శ్రీకాళహస్తియన్న పేరు వచ్చినది. ఈ మహాగ్రంథము వ్రాసిన యాయనపేరు ధూర్జటి.

ఆయన జన్మస్థలము, నివాసస్థలము శ్రీకాళహస్తియని చెప్పుదురు. ఆయన శైవుఁడు.

అయన కవిత్వము మధుర సుకుమారము. ఒకచాటువున్నది. "స్తుతి మతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేఁగల్గెనో యతులిత మాధురీ గరిమ..." మొదలైన పద్యము. ఆయన మాటలయందు సాటిలేని మాధుర్య మున్నదని సర్వజను లంగీకరించిరని యర్థము.

ఈ ధూర్జటి వ్రాసిన రెండు గ్రంథములు నేఁడు ప్రశస్తిలోనున్నవి. 1. ఈ శ్రీ కాళహస్తి మహాత్మ్యము. 2. శ్రీ కాళహస్తీశ్వర శతకము. కొన్నిచోట్ల గ్రంథమునకంటె శతకమునకే యెక్కువ గౌరవము కలదేమో! అభిమానముమాత్రము నిస్సందేహముగా పలుమందికి శతకమునందే కలదు. మన యాంధ్రభాషలో ననేక శతకములుకలవు. ఈ శతకమును వాని యన్నింటిలో తలకట్టు మానికముగా మన్నించుటకలదు. తెలుఁగులో చాల గొప్ప శతకములు అనఁగా మహాకావ్యములతో తులతూఁగగలవి కలవు. వానిలో ఆంధ్ర నాయక శతకమొకటి. ఈ శ్రీ కాళహస్తీశ్వర శతకము ఆంధ్ర నాయక శతకముకంటె చాల పూర్వము. చాల శతకములున్నవి. గడుసుగడుసు శతకములున్నవి. వీరనారాయణ శతకమని యొకటికలదు. దాని నెక్కువమంది యెఱుగరు. అది యాధునికమైన శతకము. అది వేఱు మాట.

## చెలదిపుర్వు కథ

కృతయుగమునందు సాలెపురుగొక్కటికలదు. అది గొప్ప వాస్తుశిల్పి. దానికి శివపూజ చేయవలయునని యూహ కలిగెను.

నేఁడు కాళహస్తి క్షేత్రమున్నచోటు ఆ యుగములో వట్టియడవి. శ్రీశైలము నట్టిదియే !

శివలింగములు కొన్ని సహజోద్భూతములు. తరువాత తరువాత స్థాపితములై యాలయములు నిర్మింపఁబడినవి. ఆ మొదట వట్టి మహాసముద్రములనుండి భూమి యేర్పడినప్పుడు ఘనీభవించినప్పుడు కొన్ని కొండలమీద మరికొన్నిచోట్ల సహజముగా దేవతాకృతు లేర్పడి యుండెను. ఈ శివలింగములు భూమి పుట్టుకతోనున్నవి. అవి సహజోద్భూతములు. శ్రీ కాళహస్తీశ్వర లింగము, శ్రీశైల మల్లికార్జున లింగము, కాశీ మహానగరమునందలి శ్రీ విశ్వేశ్వర లింగము మరియు కొన్నిలింగములు భూమితో నేర్పడినవి. ఇవి యనాది శివమూర్తులు. తరువాత తరువాత జనులు వాని చుట్టు నాలయములుకట్టి పూజలారంభించిరి.

ఇది యొకటి, రెండవది సాలెపురుగు. దానికి విజ్ఞానము కలుగుట.

కొన్ని మతములవారు ఆత్మయే లేదందురు. కొన్ని మతములవారు ఆత్మయనునది మానవులకే యుండునందురు. మనమతము పరమేశ్వరుడు సర్వాంతర్యామి యనును. ఎందు ప్రాణమున్నదో అందు వివేకమున్నది. వివేకమనఁగా జ్ఞానముయొక్క లక్షణము. ఆత్మలేకుండ ఈ జ్ఞానముండదు. అందుచేత చెలది పుర్వునకుగూడ జ్ఞానమున్నది. దాని కాత్మయున్నది· అది శివునకు పూజచేయవలెననుకొనెను.

అది మహాటవి, ఆ పురుగు స్వామికి

ప్రాకారములు గోపురమ్ములు కొలువు కూ
టములు, నర్తన మందిరములు, కోశ
గేహము ల్బందిళ్ళు. కేళీ నివాసంబు
లంతః ప్రదక్షిణాయతన వీథి

యుపహారభోగమంటపము, గర్భగృహంబు
పరిణయ హైమ వైభవ నిశాంత
మంతఃపురంబు, కక్ష్యాంతరంబులు, జాల
కంబులు, మేడలు గరుణతోడ

నిభముఖానలజాత చండీశ పుండ
రీకలోచన మాతృకాలోక నయన
దక్షిణామూర్తి వటుకాది దైవతముల
నిలయములు గట్టి నత్యంత నిష్ఠతోడ.

ఇభముఖుడు - విఘ్నేశ్వరుఁడు, అనలజాతుఁడు - అగ్నిహోత్రుని కుమారుడు కుమారస్వామి; వటుకుడు - కాలభైరవుఁడు. వీరందరకు ఇవి యన్నియు గట్టెను. ఇచ్చట నొక చిన్న ప్రశ్న. అది కృతయుగము. అది మహాటవి. జనమేతక్కువ. దేవతల నిట్లు కొలుతురన్న జ్ఞానమే లేదు. ఈ సాలె పురుగునకు నీ జ్ఞానమెట్లు కలిగెను ? దీనికొక్కటియే సమాధానము. పూర్వ జన్మ సంస్కార విశేషము. అనఁగా యుగము లనంతములు. ఈ సృష్టి యిట్లే జరుగుచున్నది. ముక్తిపొందని జీవులందఱు మరలమరల నుదయింతురు. వారి కా పూర్వజన్మ సంస్కారములుండును. ఇది మన మహాసిద్ధాంతము.

నేనీ వ్యాఖ్యానములు వ్రాయుచు వలసినచోటనెల్ల ఇట్టివిషయములు చెప్పుచున్నాను. ఇవి చాల యవసరము. మన పూర్వకవులందఱు వీనిని విశ్వసించినవారు గాన నాయాకథల నట్లట్లు వ్రాసిరి. ఈ మహాసిద్ధాంతములు లేనిచో పరమార్థమున నివి వట్టి పిచ్చికథలగును.

ఇట్లు కట్టిన ప్రాకారాదులు

ప్రాతఃకాల తుషారశీకరచయప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వెసఁగి, తద్బిందుచ్ఛటాజాత ఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహు రత్నోద్దీర్ణ గేహంబులై
లూతాకల్పిత తంతుసద్మములు వొల్చుం జెప్పఁ జిత్రంబులై.

ఈ దారములతోడి గుళ్లుగోపురాలు ప్రాతఃకాలమునందలి మంచు బిందువులవలన మౌక్తిక-ముత్యములతో, ఉపేత-కూడుకొన్న, అగారములు-

ఇళ్ళవలెనున్నవట ! ఆ మంచుబిందువులలో ప్రతిఫలించిన ఖద్యోతచ్ఛాయలచేత అనఁగా సూర్యకిరణములచేత రత్నగేహములవలె నున్నవట. తంతు సద్మములు దారపు మేడలు. లూత–సాలెపురుగు. చెలదిపుర్వు. మర్కటక కీటకము; ఇవి దాని పేర్లు.

కాని వట్టి యడవికదా ! రాత్రులందు రివ్వుమని గాలివీచును. ఈ మేడలు పడిపోవును. దారాలు తెగిపోవును. ఆ చెలదిపుర్వునకు వేఱుపని లేదు. గాలికి తెగిపోయిన పోగులు, జారినపోగులు నెప్పుడు నదికించు చుండును.

అనఁగా నేమని యర్థము – ఆ పురుగునకు నిత్యము శివపూజయే, శివసేవయే !

ఇట్లుండగా శివునకు దాని నియమమును పరీక్షింపవలెనని పుట్టెను. ఆ శివస్థలమునందు నిత్యముగా దీపమొకడుండును. ఈ దీప మెచ్చటిదన్న ప్రశ్న. అడవులలో కొండలలోనున్న యిట్టి దేవతామూర్తులకు నెవడో యెంతదూరమునుండియో వచ్చి వారానికొకసారి పదిదినాల కొకసారి కానిచో నెలకొకసారి దీపారాధనచేసి పోవుచుండును. ఇది యనాదిసిద్ధమైన వ్యవహారము. ఆ దీపము–లేదా ఈ సహజోద్భూతమైన దేవతామూర్తుల దగ్గఱ చర్మచక్షుస్సులకు గనపడని నిత్యాగ్నిహోత్రములు, నిత్యదీపములు నుండునేమో ! స్వామి యా దీపజ్వాలమండించి చెలదిపుర్వు కట్టిన సర్వ సౌధములను తగులబెట్టెను. ఆ చెలదిపుర్వు తన యింతపని వృథాయగుట జూచి యిట్లనుకొనెను.

"ఇది పెక్కేడులు వట్టెన్
సదనంబులుగట్ట నాకు శంభునికొఱకున్
దుదిఁ గుమ్మరి కొకయేఁడును
గుదెకొక పెట్ట' న్నమాటకున్ సరివచ్చెన్,"

పాపమది యెన్నోయేండ్లు కష్టపడి కట్టినది. ఇచ్చట కుమ్మరితాను, గుదియకాడు శివుడు. ఆ చెలదిపుర్వునకు తెలియదా ? కాని స్వామియందు దోషము నిరూపించుట దానికిష్టములేదు. ఈ లోకముల లక్షణము ఆ దోషమును ప్రక్కవారిమీద పెట్టుదురు,

ఈ పనియంతయు దీపముచేసినది. దీనిని మ్రింగుదునని యా పురువు నిశ్చయించెను. దీపమును మ్రింగుటయనఁగా నేమి? అది యగ్నిహోత్రము కదా! దానిని మ్రింగుటయనఁగా దానిలో పడి చచ్చుటయే!

అట్లు చేయఁబోవుచుండగా స్వామి ప్రత్యక్షమై నీ భక్తికి మెచ్చు కొంటిని నీకేమి కావలయునని యడిగెను. ఆ పురుగు తనకు కైవల్యము నిమ్మని కోరెను.

కైవల్యమనఁగా మోక్షమని చెప్పుదురు. కాని కేవల శబ్దము మీది తద్ధిత కైవల్యము, కేవలమనగా నేమి? మరియొకదాని యంటు సొంటు లేని లక్షణము; కేవల తార్కికుడు; తర్కశాస్త్రము తప్ప వానికింక నేమియు తెలియదని యర్థము. అట్లే కైవల్యమనగా ప్రపంచకముతో సంబంధములేని పంచేంద్రియములు, మనోబుద్ధి వాక్కులు, సత్త్వరజస్తమో గుణములు మొదలైన వేవియు లేని శుద్ధబుద్ధాకారము సాక్షాత్మ్రైక్యము. ఇది కైవల్యము. శివుఁడాపుర్వును తనలో చేర్చికొనెను.

ఎక్కడజూచినన్సురము నీశ్వరదానవ మానవాహిపుల్
మ్రొక్కుచు సన్నుతించు రవముల్ ధ్రువమండలవీధి నిండఁగా
దిక్కులు ముంచుకొన్న తన తేజములోపల నూర్ణనాభమున్
గ్రక్కునఁ గూర్చెఁదన్మయముగా శివలింగము భక్తలోలతన్.

దేవతలు ఋషులు మ్రొక్కుచున్నారు. అట్టి తన తేజములో—నూర్ణ నాభమనఁగా నీ చెలదిపుర్వు—స్వామి దానిని చేర్చికొన్నాడు.

## కాలసర్ప హస్తుల కథ

సాలెపురుగు కథ కృతయుగములోనిది. ఈ కథ త్రేతాయుగము లోనిది. ఈ యుగములు ఇప్పుడు జరుగుచున్న మహా యుగములోనివో పూర్వమహా యుగములలోనివో చెప్పబడలేదు.

పూర్వ కథలో సాలెపురుగుయొక్క కథ చెప్పబడినది. అది వట్టి పురుగు. దానికే జ్ఞానము భక్తియు నున్నప్పుడు ఈ కథలోనున్న సర్పము నకు నేనుఁగునకు జ్ఞాన భక్తులెందుకుండరాదు? పరమేశ్వరుఁడంతర్యామి. ఆయనయొక్క స్పర్శ లేకుండ ప్రాణమేరాదు, ప్రాణమున్నప్పుడు గీతన

జ్ఞానము మొదలైనవి యుండును. తత్తజ్జంతువుల శరీర ప్రమాణములు వాని యవయవములు వానికనురూపముగా నుండును. అందుచేతనొక జంతువులో జీవుడున్నాడు. ఒక జంతువులో జీవుడు లేడనుకొనుట వివేకశీలి చేయడు. మనుజులలో నెక్కువ వివేకులున్నారుగనుగ మనుజునిలోమాత్రమే జీవుఁడుండును ఇంత వివేకములేని జంతువులలో నుండడు అనుకొనుట కర్మ సిద్ధాంతమెరుగని వారనుకొనవలయును. ఆ జంతువులాజన్మ యెత్తిన వఁనగా వాని వాని పూర్వజన్మ సంస్కారములే!

వివేక తారతమ్యమునుఁబట్టి జీవుని యునికియు జీవుని లేమియు నిర్ణయింతుమేని కొందఱు మనుజులలో జీవుఁడు లేఁడనవలయును. పశువులు ఆకలియు స్త్రీ పురుష సంగమము మొదలైనవానిని గురించి మాత్రమే యెఱుఁగును. అది జ్ఞానము కాదు. దాని పేరు పసి. ఇంగ్లీషులో నీమాటను instinct అందురు. ఈ పసి జ్ఞానము వేఱు, జ్ఞానము వేఱు, ఆలోచన వేఱు అని సిద్ధాంతములు చేసినచో కొన్ని కథలు పొసగవు. కొన్ని విషయములందవు. పాముపగ యొకటి ప్రసిద్ధము. ఏనుఁగు వివేకముకూడ చాల ప్రసిద్ధము. వీనినిగూర్చి నేటికిని కథలు జరుగుచునే యున్నవి. జీవుఁడనఁగా జ్ఞాన తారతమ్యముచేత నున్నాఁడని లేఁడనిచెప్పబడెడివాఁడుకాడు. కర్మానురూపముగా బహుజన్మలెత్తెడివాఁడు. ఒక్కొక్కప్పుడు మూఢుడై పుట్టును. మనుజుఁడై పుట్టి పశువుకన్న కనాకష్టుడై యుండును, పశువులలో కూడ మనుజులలోకంటె నధిక జ్ఞానముకలిగిన జంతువులుండును.

భక్తికూడ నొక మనోభావమందము. దేవుఁడు లేఁడనువారు మనుజులలో లేరా? అంటే దేవుఁడున్నాఁడన్న జంతువులుండును. ఇక్కడ 'అన్న' అను శబ్దమునకు ప్రాధాన్యములేదు. ఈ 'అను' ధాతువు అనుకొను అర్థమిచ్చు ధాతువు. మరియు మన పూర్వగ్రంథములు పూర్వ యుగములలో జంతువుల కధిక జ్ఞానము కలిగినట్లు చెప్పును. మనుజులింతకంటె నధిక బుద్ధిమంతులుగా చెప్పును ఆ గ్రంథముల ప్రకారము కాలము పోను పోను క్షీణించుచున్నదందురు.

రామాయణములో కోతులు రాముని పక్షమున యుద్ధమునుఁజేసినవి. కోతులు కోతులే. కత్తులు కటారులు లేవు. వానికిని కోటలు, రాజులు

మంత్రులునుఁ గలరు. భారతములో నట్టి జంతువులులేవు. అదియొక యుగములోనిది. ఇదియొక యుగములోనిది. యుగ ధర్మములు మారు చుండును.

ఇది యంతయు వ్రాయుట యెందుకనఁగా నీ కథలు నీతి చంద్రిక కథలవంటివికావు. ఇవి నిజముగా జరిగినవి. ఇవి యర్థవాదములు కావు. అర్థవాదములనఁగా నొక విషయముయొక్క ప్రాధాన్యము చెప్పుటకు చెప్ప బడెడు కథలు. అందుకోస మీపీఠిక వ్రాయఁబడుచున్నది. విశ్వసించిన వాఁడు విశ్వసించును, లేనివాఁడు లేదు. విశ్వాసమో అవిశ్వాసమో, మానవుఁడు బ్రతికియున్నంతవఱకే! తదనంతరమెట్టిదో యోగులకు సిద్ధ లకు మహాత్ములకు తెలిసినచో తెలియవచ్చును. తక్కిన సామాన్యజనము నకు తెలియదు. మనకు తెలిసినది యీ లోకము. దానియందు రమింతము. తెలియనిది తెలిసినట్లు ప్రవర్తించుట యెందులకు ?

అందుచేత ఈ కథకూడ చదువుదము.

త్రేతాయుగము చివర నొక్క మహాసర్పము పాతాళమునుండి దివ్య మాణిక్యములనుఁ దీసికొని వచ్చి ప్రొద్దుననే శ్రీ కాళహస్తీశ్వరస్వామికి ఆ రత్నములతో పూజచేయును. వెడలిపోవును. ఆ సర్పము పాతాళలోక నివాసి. ఏదో మహాసర్పము. మరలమరునాడు ప్రొద్దుట వచ్చును. నిన్నటి మణులు తీసివేయును. క్రొత్త మణులు సమర్పించును,

ఇట్లుండగా ద్వాపరయుగము వచ్చెను. అప్పుడొక యేన్గు శ్రీ కాళ హస్తీశ్వర లింగమునుఁ జూచెను.

ఆ స్వామికి శ్రీ కాళహస్తులు చూచి సేవించి మోక్షము పొందిన తరువాత శ్రీ కాళహస్తీశ్వరస్వామియని పేరువచ్చినది. తత్పూర్వమాయన పేరేమి? వట్టి యీశ్వరుఁడు. వట్టి శివలింగము. ఇది చాల చమత్కారము కదా! ఈ ముప్పురితో నాయనపేరే మారిపోయెను. లేదా అంతకు పూర్వాము పేరులేదు. వీరితో నాయనకు పేరువచ్చెను.

అదివఱకు వట్టి శివలింగము ఉూయి. వట్టి బ్రహ్మస్వరూపము. ఈ ముప్పురకు మోక్షమిచ్చునప్పటికి ''కావోయీ! యీాయన భక్తులను రక్షించు

వాఁడు. నిత్యమైన తన శివస్వరూపము మాత్రమేకాదు. భక్త రక్షణ తాత్పర్యము కలిగిన మూర్తి" అని తెలిసినది. అప్పుడు పేరువచ్చినది.

శ్రీకృష్ణదేవరాయలవారు తాను మహాచక్రవర్తి. సహజముగా పండితుఁడు. ఆయన గ్రంథములువ్రాసి పెద్దన్న మొదలైన కవులను పోషించిన తరువాతకదా కవులాయనచుట్టు మూగినది. అట్లు చేయనిచో తక్కిన రాజులవంటివాడే.

అప్పుడు శ్రీ కాళహస్తీశ్వరుఁడైనాఁడు. అప్పుడు భక్తులు మూగినారు. తత్పూర్వము వట్టి శివాకృతి. లింగాకృతి.

ఈ యేనుఁగువచ్చి స్వామిని చూచినది. వచ్చిచూడలేదు. స్వామియచ్చట నున్నాఁడని తెలిసి వచ్చినది.

శ్రీ కాళహస్తి ప్రక్కన సువర్ణముఖి నది ప్రవహించుచున్నది. ఆ నదిలో పూర్వము మొగలిపొదలు నిండియుండెడివి. అందుచేత నానదికి కేతకీనదియనికూడ పేరు వచ్చినది. తెలుఁగులో మొగలేరు అందురు.

ఆ యేనుఁగు వచ్చి స్వామిని చూచినది. స్వామిమీద రత్నములు మణులునున్నవి. అవి రత్నములని మణులని యెవరోచేసిన పూజయని యేనుఁగున కేమితెలియును! ఈ యేనుగు కేతకీనదికిపోయి స్నానముచేసెను. అడవులు చెఱువులు తిరిగెను. మారేడురెమ్మలు, కలువపూలు, తామరపూలు కోసితెచ్చెను. సర్పమర్పించిన మణులను పోఁద్రోచెను. తాను తొండమునందు నిండించికొనివచ్చిన నీటితో స్వామి కభిషేకమునుఁజేసెను. తానుఁదెచ్చిన పూలతో పూజించెను. తాను వెడలిపోయెను.

మరునాటిప్రొద్దున కాలసర్పము వచ్చెను. వచ్చిచూచెను. తనపూజ లేదు. "ఎవఁడువాఁడు? నా పూజయైన రత్నమును గగ్గులకాఁటగలిపి ములుకంపలు తీవలువెట్టి నాకెగ్గొనరించెను? నా భాగ్యమునిట్లు నిప్పులపాలుచేసిన యీమదాంధు నేమనవలయును?" అని చాల దుఃఖపడి యేనుఁగు చేసిన పూజను త్రోసిపారవేసి మనసులో నీర్ష్యయు, భక్తియు పెనవేసికొనియుండఁగా తాను మరల మణులతో స్వామినిపూజించి వెళ్లెను.

అటు తెల్లవాఱుచుండఁగా పాముపచ్చును. ప్రొద్దెక్కిన తరువాత నేనుఁగువచ్చును. ఆ యేనుఁగువచ్చిచూచెను. తనపూజలేదు. "వీఁడెవఁడురా? బుద్ధిహీనుఁడు! స్వామిని పూలతోఁ బూజింతురుగాని రంగుల రాళ్ళతో పూజింతురా ?" అని ఆ రాళ్ళను మరల తీసివేసి తాను బిల్వదళములు పువ్వులతోపూజించి వెళ్లెను. మరునాఁడు ప్రొద్దుననే పామువచ్చెను. మరల పూవులునాకులు. ఆ లోపలనున్నది శివలింగము. ఆ సందులలోనుంచి కనిపించుచున్నది శివలింగము. ఆ సర్పరాజు దుఃఖపడుచు నట్లే నిలిచిపోయి యా సందులలోనుండి స్వామినిచూచెను. నా జన్మయెందుకు ? అనుకొనెను

కొంతసేపటికి తెప్పరిల్లి "కానీ రేపుగూడనిట్లేయైనచోఁ జూతము అది సరేకాని, యీరీతిఁగా నెవఁడోచేయఁగా స్వామి యెట్లూరకుండెను ? ఈయనకూడ నా శత్రువుతోచేరెనా? ఓయిశివా! పులకరించిన యమ్మవారి చేతి గ్రుచ్చుకొనుటయందు సుముఖుఁడవే. ఈ కంటకములందెట్లు సుముఖుఁడవు? స్వామీ! నీకు మూఁడవకన్నుకలఁదు. మఱచిపోయి తివికాబోలు!" అని మనస్సు దిటముచేసికొని యేన్గుపూజలు పోఁద్రోచి పైదుమ్మును బుస్సునపోనూది తాను మరల రత్నముల నర్పించి యింటికిఁబోయెను. పోయెనుఁగాని దానికి మనశ్శాంతి యెక్కడిది ?

భోగవతీ ఝరంబునఁ జొచ్చి, బోటుల
తోడనాడదు జలక్రీడ లుడిగి,
పువ్వుఁబోణులుఁ దానుఁ బొత్తుల భుజియించు
మధుర సుధాహారవిధిఁ దొఱంగి
బహువిధతాన సంపన్న గానంబుల
నిక్కిచొక్కడు తననేర్పు వదలి
ప్రాణనాయికతోడఁ బర్యంకసీమల
మసకాానఁ బెనఁగు సంభ్రమము విడిచి

నిద్రవోయెడు సుఖమెల్ల నేలఁగలిపి
ప్రతిదినంబును దాఁజేయు రత్నపూజ
శివునిపై నుండకుండినఁ జింతనొంది,
రాత్రి శివరాత్రిగా జాగరమ్ముఁజేసి.

పాతాళమునందున్న గంగానదిపేరు భోగవతి. భూలోకమునందున్న గంగానది భాగీరథి. స్వర్గలోకమునందున్న గంగానది 'మందాకిని'. ఝరము-ప్రవాహము; బోటులు – స్త్రీలు. తానసంపన్నగానంబులు – సంగీతములో నుచ్చైస్స్వరమున పాడు సంగీతమునకు తానమని పేరు. పర్యంకము-ప్రక్క; మసకాన – ఆడపాములు, మగపాములు కలిసికొనుదానికి మసకమందురు. ఆ సర్పరాజు పవలెల్ల నిట్లుగడిపి రాత్రి శివరాత్రిగా జాగరమ్మొనరించెను.

ఆనాడు పాము రత్నములుపెట్టి వెళ్ళినతరువాత మరల నేనుఁగు వచ్చెను. నిన్నటివలె మొన్నటివలె మరల రాళ్లుండెను. ఏనుఁగు చిన్న బోయెను. అంత పెద్దజంతువు చిన్నబోవుట యేమిటో! 'వీఁడెవఁడు ? నాతో పట్టుదలయా ?' అని శివునితో నిట్లనెను :

"అచ్చపు నీలవర్ణ దృషదావళి నల్లనికల్వలే ? కడుం
బచ్చనిజాలు బిల్వనవ పత్రములే ? యరుణాశ్మ భంగముల్
విచ్చిన యెఱ్ఱదామరలె ? విశ్వపతీ ! విరసోపలంబు లె
ట్లచ్చుదలయ్యె నీకు ? నవి యందునె గంధమృదుత్వ శైత్యముల్ ?"

నీలవర్ణ దృషదావలి – నల్లనిరంగుగల రాళ్లసమూహము, బిల్వనవ పత్రములు – క్రొత్తమారేడు దళములు; అరుణాశ్మ భంగములు-ఎఱ్ఱరాళ్ళ ముక్కలు; విరసోపలములు – రసవిహీనములైన రాళ్లు; అవి గంధము – సువాసన; మృదుత్వము-మెత్తదనము; శైత్యము-చల్లదనమును పొందునా?

"ఉనికి శిలోచ్చయంబు, నిజయోష శిలోచ్చయ రాజపుత్రినీ
ధనువు శిలోచ్చయంబు పురదాహ ! రథీకృత రత్నగర్భ ! నీ
మనమున కీ శిలాశకల మండనమెట్లు ప్రియంబునేసె ? నే
మనఁగలవాఁడ నిన్ను ? వ్రతహానియొనర్చు దురాత్మ్మఁడుండగన్.

ఉనికి – ఉండుస్థలము; శిలోచ్చయము-కొండ; నిజయోష-నీభార్య; కొండకూతురు; నీవు పురదాహుఁడవు – మూఁడు పురములను దహించిన వాఁడవు. ఆ సమయమున నీ ధనుస్సు – శిలోచ్చయము – మేరుపర్వతము; నీవు రథీకృత రత్నగర్భుఁడవు. (ఆ సమయమునందే) రథముగా చేయబడిన భూమికలవాఁడవు. ఇంత రాళ్ళ వ్యవహారముండఁగా ఈ శిలాశకలములు

ఈ రాళ్ళముక్కలు, మండనము—నగగా; ఎట్లు ప్రియమైనది. నా వ్రతహాని చేసిన దురాత్ముఁడుండగా నిన్ననుట యెందుకు ?

"పోనీ నేఁటికి నాయెఁబోయెఁ గడు దుర్బుద్ధి న్విచారింప నే
లా ? నిత్యంబును నీశ్వరుంగొలుచు వేళంగాక; ఱేపాడి రాఁ
గా, నర్చావ్రత హంతఁగన్న, నది భాగ్యంబె వివేకింప; వాఁ
డా నేనా, నొకజాడఁబోయెదము; లేదా జీవమింకేటికిన్."

అప్పుడేనుఁగు 'వాడా నేనా' వాఁడో నేనో యనియర్థము. మరి వాడే నేనేనన్న ప్రయోగమేమి ? దుఃఖము వట్టి వ్యక్తిగతమైనచో విరోధము వ్యక్తిగతమైనచో కోపము వ్యక్తిగతమైనచో వాడో నేనో, అనుట తగును. ఇక్కడ దోషము శత్రువునందుకాదు శివునియందు. శివుఁడు ఈ పూజల కంగీకరించి యూఱకయుండుటలో నున్నది దోసము. ఆ శివునకు వాఁడగును నేనగును. అయినచో వాఁడు భక్తుఁడగును. లేనిచో నేను భక్తుఁడగుదును. శివుఁడు నిర్ణయించవలయునని యర్థము.

రేపుకూడ నిట్లేయున్నచో నా ప్రాణము లిచ్చుటనే వదలిపెట్టెదను. విచారమెందులకు ? ప్రాణములంత తీపియా ?" అని ఆ యేన్గు స్వామికి పూజచేసి వెడలిపోయి యిదిమాత్రము తక్కువదా ?

పెడి యేనుఁగులవెంటఁ బడిపోక యుడుగని
వెడవిల్తు వేఁడిమి విడుపు చూపఁ
గరమున నుదకంబు కడుఁ జల్లుకొనకున్నఁ
దెమలని మిహిరదాహము దొలంగ,
సరసునఁజొచ్చి తామరతూండ్లు మెసఁగక
మానని యాఁకటిమంట లార,
సింహపోతములు ఘోషింపఁబుట్టిన భయా
తంకాగ్ని తహతహఁ గ్రుంకబాఱ,

కెట్టివెట్టలుఁ దనమీఁద నెక్కలేక
పంచబంగాళమై పోవఁబ్రాణలింగ
పూజనావిఘ్నమున యందుఁ బుట్టినట్టి
చింతయన్ వేఁకి తను లోనుచేసికొనియె.

పెడియేనుఁగులు — ఆడ యేనుఁగులు. వెడవిల్తుఁడు - మన్మథుఁడు ; మిహిరదాహము - సూర్యునియొక్క వేడి ; మెసగుట — తినుట ; పంచ బంగాళమై పోవుట — పటాపంచలగుట. అనఁగా ఆ మన్మథాగ్ని; సూర్యుని యెండ ; ఆకటిమంట ; సింహములు పోషింపగా బుట్టిన భయవహ్ని— ఈ నాలుగును తనమీద నేమియు పనిచేయలేదని యర్థము. చింతయన్ వేఁకి — చింత అను జ్వరము. వేఁకి — జ్వరము.

అక్కడ సర్పమిట్లే బాధపడినది. ఇక్కడ యేనుగిట్లే బాధపడు చున్నది. ఇద్దఱి భక్తియు సమానమని యర్థము. ఆ భక్తియొక్క సమానత్వము వారికి గలిగిన దుఃఖములయొక్క సమానత్వము చూపించుటకు ధూర్జటికవి యక్కడను సీసపద్యము వ్రాసె నిక్కడను సీసపద్యము వ్రాసెను.

ఎప్పుడస్తమయమగును ? ఎప్పుడు రాత్రి గడచును ? ఎప్పుడు మరల సూర్యోదయమగును ? అని యేనుఁగు తహతహ పడుచుండెను.

ఇచ్చట సూర్యాస్తమయము, రాత్రి పడుట, మరల సూర్యోదయము దీనినంతయు కవి వర్ణించెను. కథను చెప్పుకొని పోకుండ నీవర్ణనలెందుకు ? అన్నప్రశ్న. కాలము గడచుచున్నది. అక్కడ పాము బాధపడుచున్నది. ఇక్కడ నేనుగు బాధపడుచున్నది. ఒకటి వారి భక్తియొక్క లోతులు చూచుటకు, చెప్పుటకు. రెండు పరమేశ్వరునకివి పట్టవనుటకు. మూఁడు ఆ మరునాడు బరుగఁబోవువారి యిద్దఱి పగసాధించుకొనుటలలోని నైశిత్యము పాఠకుని హృదయమునకధికముగా భాసింప జేయుటకు.

మరునాడు తెల్లవాఱినది. కుంభీనస వల్లభుఁడు అనఁగా పాముల రాజు బయలుదేఱి వచ్చెను. ఎట్లువచ్చెను ? పగ చంపఁగవచ్చు కటారికాని చందమునవచ్చెను. కటారికాడు— కత్తితో శత్రువులను పొడిచి చంపెడి వాఁడు. వచ్చిచూచెను. తన చేసిన పూజలేదు, తానా మారేడుదళములు కలువపువ్వులు మొదలైనవి సిన్నటివలె తీసివేయలేదు. రానీ వాఁడెవఁడో చూతము. వానిని చంపుదును. లేదా నా ప్రాణములు శివునికర్పింతును.

అది పాతాళ లోకములోని మహాసర్పము. పాతాళమునందలి సర్ప రాజులుకూడ కామచరులు. ఆ సర్పము తాను చినపామైనది, ఆమారేడు

దళములు తామరపువ్వులయొక్క కాడలలో దాగుకొన్నది. అది కాలఫణి. నల్లపాము. అందుచేత దానిపడగ మారేడాకువలె నున్నది. దాని శరీరము తామరతూడువలె నున్నది. ఏనుఁగు వచ్చినచో తెలియదు.

యేనుఁగు నిన్నటికంటె తొందఱఁగా వచ్చినది. చూచినది. తనపూజ చెడిపోలేదు. ఇట్లనుకొన్నది.

"ఈ సకలేశ్వరుండు కరుణేక్షణుఁడయ్యెను ? విఘ్నకర్త సం
త్రాసము నొందెనో ? వ్రతము ధన్యత నొందెనొ ? పూర్వజన్మ వే
ళా సుకృతంబు పండెనొ ? కళానిధిశేఖరమౌళి నేఁడు నే
జేసినపూజ నిల్చె"నని శీఘ్రమున న్మదమంది క్రమ్మఱన్.

స్వామికి దయపుట్టెనేమో ! నాశత్రువు భయపడినాఁడేమో ! విఘ్నకర్త — నా పూజకు విఘ్నము చేసినవాఁడు, సంత్రాసము—భయము. కళానిధి — చంద్రుఁడు. శేఖరము — తల. చంద్రుడు శేఖరమునందు కలవాఁడు చంద్రశేఖరుఁడు. ఆయన మౌళిన్ - శిరస్సునందు ;

ఏనుఁగిట్లనుకొనుచుండఁగా పామునకు తన శత్రువెవ్వరో తెలిసినది. పాము దగ్గఱకు రానిమ్ము అని కూర్చున్నది. ఏనుఁగునకీ కీడు తెలియదు. ఆ ఏనుఁగు మరలపోయినది. స్నానముచేసెను. క్రొత్తపూలు మారేడు దళములునుఁ దెచ్చెను. నిర్మాల్యమ్ము తుడుచుటకు కరమ్ము సాచెను. కరమనఁగా తొండము. నిర్మాల్యమనఁగా నిన్నటిపూజ.

"శుండాలంబుకరంబుసాఁప ఫణిరాజున్మెచ్చి 'నా పూజభ
ర్గుండీవేళ ననుగ్రహించె' నని ముక్కుం గ్రోళ్ళలోనెక్కి యు
ద్దండక్రీడఁ దదీయకుంభ కుహరస్థానంబునం ద్రిమ్మరన్
గొండల్గూలఁగ నెత్తిమొత్తుకొని, దిక్కుల్మ్రొట్ట గీఁపెట్టుచున్.

శుండాలము - ఏనుఁగు ; భర్గుఁడు - శివుఁడు కుంభకుహరస్థానము— కుంభమునందున్న గుహాస్థానము. ఈ పామచ్చట త్రిమ్మఱుచున్నది. ఈ యేన్గుకొండలు కూలఁగ నెత్తి మొత్తుకొనుచున్నది. తనతలను కొండలకు వేసి కొట్టుకొనుచున్నది. గీపెట్టుచున్నది.

మొగలేటి మడుఁగున మునిఁగి తుండమ్మున
నుదకమాకర్షించి యూఁది యూఁది,
కడుఁగపాలము దాఁకి కలఁగంగఁజక్కగాఁ
జేసాఁచి జిబ్బునఁ జీఁది చీఁది,
యిలమీఁదఁ దలదాఁకనీ ప్రక్క నా ప్రక్కఁ
బెడమరుఁలుగా బొడ పెట్టి పెట్టి,
యుడివోని వేదనమున్నచో నుండక
పనిలేని పరువులు పాఱి పాఱి

పెద్దమ్రాఁకులతోఁ గుంభ పీఠయుగముఁ
దోముకొనుచును జెట్టులు దూఱి తూఱి
పాము సేసిన దుఃఖంబు సామజంబు
దీర్చుకొను వెర వెఱుఁగక ధీరబుద్ధి.

మొగలేటి మడుగున — స్వర్ణముఖీ నదియొక్క మడుగులోననగా లోతైన చోటిలో.

ఈ పద్యమొక యాశ్చర్యము. ఇది యెవ్వఁడును వ్రాయలేఁడు. ధూర్జటియే వ్రాయవలయును. ఆ ధూర్జటి మహాభక్తుఁడుగనుక తానుపోయి యా యేనుఁగులోదూఱి యా పాము తన మెదడులో నెక్కినదనుకొని తానేమేమి చేయునో యూహించికొని వ్రాసినట్లున్నది. మహా కవిత్వమని చెప్పుకొనదగిన లక్షణములలో నిదియొకటి. అందరు కవులు తాము రచించు పాత్రలతో నంతో యింతో యేకీభావమును పొంది వ్రాయుదురు. వారంతోయింతో కవులు. ఇట్టి యొక మహా భయంకరమైన పరిస్థితిలో నం దులోనొక యేనుఁగువంటి జంతువుతో తాను తన్మయీభావమును పొందుట-యిదిమాత్రమాశ్చర్యము.

అయినచో నిట్టివాఁడు మహాకవులలో మహాకవి కావలయును. లేనిచో మనస్సులోనెదో పురుగుండి అది యొక వ్యాధియై అది యచ్చట తిరుగుచున్న చెప్పరాని దురద బాధ యనుభవించినవాఁడు కావలయును.

అప్పుడు ఏనుఁగిట్లనుకొనెను :

"ఏనాచచ్చుట తప్పదిప్పుడు, నుమాధీశోపకంఠంబునన్
దానూఁజావక చంపనోప దురగేంద్రం బెక్కుడీ దుఃఖమే
లా నాకున్నరి చంపి చచ్చుట జనాహ్లాదంబుగాదా? యవా
చీన స్థాణునగంబె వధ్యశిలగా సేవింతుఁగాకింతటన్"

ఉరగేంద్రము — పాపరాజు ; ఉమాధీశుఁడు — శివుఁడు ; ఉపకంఠము— సమీపము ; అవాచీన స్థాణునగమ్ము - ఈ దక్షిణ కైలాసము ; ఇది యే వధ్యశిల.

అని యా యేనుఁగు శివునిదిక్కు మొగమై యీ పాము ఏ కనుమ వెంటపోవునోయని తుండమిఱియబట్టి నోటిలో క్రుక్కికొని, వెనుక వెనుక వెళ్ళి తలవంచి చెప్పరానంత వేగముతో నాకొండను భగ్గునఁదాకెను. దాని కుంభస్థలము పగిలిపోయెను.

కొండ కొండతోడ గుండులుఁగూలంగ
దాఁకినట్లు దోఁచె, దళితకుంభ
సీమనున్న పాము చిదిసె, నేనుంగును
బడియె ; నెత్తురచటఁ బడియకట్టె.

ఈ పద్యములోనున్న సొగసేమనగాఁ దళిత — చీల్చఁబడిన ; కుంభ సీమలోనున్న పాము చిదిసెన్ - చిదియు అన్న ధాతువును వాడుట.

మనమొకరాతిమీద నొక సన్నని వస్తువుపెట్టి మరియొక రాతితో కొట్టినచో నావస్తువేమగును? చిదియును. ఆ వస్తు వప్పచ్చివలెనైపోయి దానిలోనినీరు మొదలైనవటునిటు వ్యాపించి దానితొక్క కూడ మిగుల కుండ చెప్పుటకు వీలులేనంత చీకాకైన లక్షణము కనుపించును. తెలుఁగు జాతి యీ చిదియు ధాతువునట్టి యర్థమునందుపయోగించును. ఈ కవి యిచట పామైమేనదో యెట్టి స్థితినిపొందినదో చెప్పుటకాశబ్దమును వాడెను. ఇదియొక యాశ్చర్యము.

ఆ రెండు జంతువులు రుద్రగణాకారమ్ములు దాల్చిరి. ఆ లింగ మధ్యమ్మునుండి ఎద్దుమీదనెక్కి స్వామివచ్చి "మీకేమికావలయు" నని యడి

గెను. వారు నిత్యసుఖమిమ్మని యడిగిరి. స్వామి వారిని తన సర్వవ్యాపక జ్యోతిలో చేర్చికొనెను,

ఆలిం గూడుచుఁ గ్రమ్మఱ
నాలింగమునందుఁ గలసె నది మొదలుగఁ జం
ద్రాలంకారుఁడు జగతీ
పాలక ! శ్రీ కాళహస్తిపతి యనఁబరగెన్.

## కన్నప్ప కథ

ఈ కన్నప్పకే తిన్నడనికూడ పేరు.

''పొత్తపినాఁటిలో విపినభూమిఁ గిరాతులకాటపట్టు, లో
కోత్తరవన్యవస్తు 'వుడుమూ'రను పక్కణమొప్పుఁ దద్రమో
దాత్త మహత్త్వమద్భుతరసావహ మూహయొనర్ప, మేదినీ
భృత్తట నిర్ఝరాంబురుహ బృందమరంద సుగంధవాహమై."

మన తెలుఁగుదేశములో కొన్ని కొన్ని భాగములకు నాడు అని పేరులుగలవు. తెలుఁగుదేశములోనున్న వైదిక బ్రాహ్మణులందఱు నాఁడులకు సంబంధించినవారు. కొందరు వెలనాఁడులు; కొందఱు తెలఁగనాడులు, మురికినాఁడులు, కాసలనాఁడులు. ఈ రీతిఁగానుందురు. పూర్వమొకొ్కక్క ప్రాంతమున కొకొ్కక్క నాఁడు అనిపేరు.

అట్లే శ్రీ కాళహస్తి చుట్టుపట్ల దేశమునకు పొత్తపినాఁడు అనిపేరు.

ఆ నాఁటిలోనున్నయడవిలో కిరాతులుండెడివారు. ఆ భూమి లోకోత్తర రమ్యవస్తువు. లోకోత్తరమైన యందములైన వస్తువులు కలది. అందులోనొక పల్లెటూరున్నది. ఆ యూరిపేరు ఉడుమూరు.

అచ్చటనున్న రమా - లక్ష్మియొక్క. ఉదాత్తమైన మహత్త్వము అద్భుతమును గలిగించును.

మేదినీభృత్తు అనగా కొండ; దాని ప్రక్కనున్న సెల యేళ్ళలోని తామరపువ్వులలోనిగాలి చాల చక్కగానుండును. ఆ యూరిలోని జనులు సర్వసమృద్ధి కలవారు. అడవి పందుల కోరలయందలి ముత్యములు వారికి రేఁగుపండ్లవంటివి; మహా సర్పముల పడగలమీది ముత్యములు వారికి గురి

వెందలు. జవ్వాది, కస్తూరి, పునుగు కలిపి, యిండ్లలుకుదురు. కాని వారి వృత్తులనువారు మానరు. పట్టుచీరలు కట్టకలుగుదురుగాని పారుటాకులే కట్టు దురు. మాణిక్యములలంకరించుకొనగలరుగాని గురివెంద పూసలే ధరింతురు.

వాళ్ళ పొలాలకు దిష్టిబొమ్మలు పెట్టుదురు. ఆ బొమ్మలు అగురు చెట్ల కొయ్యలతోచేసి కస్తూరి మసిగాపూసి చమరీ మృగముల తోకలు జుట్టుగాపెట్టి యేనుఁగు కుంభములలోని ముత్యాలు కనుగ్రుడ్లుగా పెట్టు దురు.

అచ్చటి చెంచెతలు చాల సౌందర్యవతులు. వారును వారి భర్తలును యథేచ్ఛముగా విహరింతురు.

ఆ యూరనొక యెఱుకు రాజుకలఁడు. అతని పేరు నాథనాథుఁడు. అతని భార్యపేరు తండె.

ఆమె గర్భవతి యయ్యెను. ఆమెకు నెలలునిండి యొక బిడ్డను కనెను. శివభక్తి ముందుపుట్టెను. తరువాత వాఁడు పుట్టెను.

వాఁడును వాని చెలికాండ్రును ఎన్నో క్రీడలాడుదురు.

చిట్లిపొట్లాకాయ, సిరిసింగణావత్తి
గుడుగడుగుంచాలు, కుందెనగుడి,
డాఁగిలి ముచ్చులాటలు, గ్రచ్చకాయలు,
వెన్నెలకుప్పలు, తన్నుబిల్ల;
తూరన తుంకాలు, గీరన గింజలు,
పిల్లదీపాలంకి, బిల్లగోడు,
చిడుగుడువ్వల పోటి, చెండుగట్టినబోది,
యుల్లియువ్వనఁబట్టె లప్పళాలు,

చిక్కనాబిల్ల, లోటిళ్లు, చిందఱాది
యైన శైశవ క్రీడా విహారసరణిఁ
జెంచుకొమరులతోడ నుద్దించుకాడుఁ
దిన్నఁడభినవ బాల్య సంపన్నుఁడగుచుఁ.

అతఁడు పెద్దవాఁడైనాఁడు. విల్లుపట్ట నేర్చినాఁడు.

> విల్లుపట్టిన నెల పదినాళ్ళలోన
> వీఁకగలిగిన తడవిల్లు వెదురువిల్లు
> సెలసు విల్లును మొదలైన చేఁగవిండ్లు
> చులుకఁణాఁదీసి, శబరేంద్ర సూనుఁడేయు.

పై సీస పద్యములో నాంధ్రదేశమునందలి ఘాలుర యాటలపేర్లు. ఇందులో నాటవికుల విండ్లపేర్లు. ఈ కథలో మరియును కొన్నివచ్చును. మందులు మాకులు వానిపేర్లు వరుసఁగా నుండును. ఇదియునొక కవితా శ కి.

అంతనాయడవిలో వేటకొక అధిదేవత కలదు. దాని జాతరచేసిరి.

తరువాత తిన్నఁడు వేటకు బయలుదేఱెను. ఆ వేటలో నతఁడు చాల నేర్పుకలవాడు.

తిన్నఁడొకనాఁడు వేటాడి సొలసిపోయి యొడలు తెలియక నిద్రించుచుండెను. అతనికొక స్వప్నము వచ్చెను. ఆ స్వప్నములో

> "ఒడలందెల్ల విభూతిపూత, పులితోలొడ్డాణ, మల్లాడుకెం
> జడ, లాత్మైక విచారనిశ్చలదృగబ్జాతంబు, లచ్చైనక
> చ్చడ మంసంబున, రుండమాల గళదేశస్థాణువుంగ్రాలఁ గా
> నొడయండొక్కరుఁ డక్కుమారుకలలో నుద్యత్కృపామూర్తియై."

కెంజడలు — ఎఱ్ఱని జడలు; ఆత్మవిచారమునందు నిశ్చలములైన దృగబ్జాతములు - తామరపూలవంటి కనులు; అంసంబున — బుజమునందు; కచ్చడము-బొంత; రుండమాల-బొమికలపేరు; ఉద్యత్కృపామూర్తియై— ఉదయించుచున్న దయామూర్తియై; ఒడయండు — రాజు; కనిపించి "ఓయీ! మొగలేటి దగ్గఱ శివుఁడున్నాఁడు. అతఁడు భక్తులపాలిటి కల్పకము. నీవతనిని సేవించు"మని చెప్పెను.

తిన్నఁడదరిపడి లేచెను. తక్కిన వేటకాండ్రు మరల వేటకు బయలు దేరిరి. కాని తిన్నఁడు ఆ శివుని చూడవలయుననియే భావించుచుండెను. కాని యతనికొక యడవిపంది కనిపించెను. ఇతఁడు దానిని వెన్నాడు

చుండెను. ఆ యేకలము వానిని సరిగా శ్రీ కాళహస్తీశ్వరస్వామి యున్న యెడకుఁ దీసికొనివచ్చెను. తిన్ననికి స్వామి కనిపించెను. వానిలో పూర్వ జన్మార్జితమైన శివభక్తి యంతయునొక్కసారి పొడసూపెను. ఆ లింగమునుఁ జూచి,

"ఓ సామీ! యిటువంటి కొండదరిలో, నొంటిం బులుల్ సింగముల్
గాసింబెట్టెడు కుట్రనట్టడవిలోఁ గల్జువ్వి క్రీనీడ, నే
యాసంగట్టితి వేటిగడ్డ నిలు? నీవాఁ కొన్నచోఁ గూడు నీ
ళ్లే సుట్టంబులు దెచ్చిపెట్టెదరు? నీకిందేటికే లింగమా?"

ఇటువంటి కొండదరిలో ఇటువంటి కొండప్రక్క కల్జువ్వి క్రీనీడ — రాయిదగ్గఱ పెరిగిన జువ్విక్రింది నీడలో ఏఁటిగడ్డన్ - నదిప్రక్కనున్న రాతి మీద, ఇల్లు ఏయాసను కట్టితివి. మాయూరికిపోదము రమ్మనెను. "మాయూరికిరమ్ము. లేళ్ళ మాంసము, దుప్పుల మాంసము, పిట్టల మాంసము నీకు వండిపెట్టెదను.

ఓ లింగము! విను నివ్వరి
ప్రాలును, నొండిపిళ్లు, గునుకుఁబ్రాలును వెదురుం
బ్రాలును, సవరపు మెకముల
పాలును, గలవచటనీకుఁ బాయసమునకున్.

పుట్ట తేనియ పెరతేనె పుట్టజున్ను
తొఱ్ఱ తేనియగల, వండుఁ దోఁచి తోఁచి
కాలి దులదులనై పిండిపోలెరాలు
నట్టినింజెట్లు గలవు నీకారగింప.

నేరేడుపండులు నెలయూటి పండులుఁ
కొండమామిడిపండ్లు దొండ పండ్లుఁ
బాలపండులు నెమ్మి పండులు బరివంక
పండులుఁ జిటినుటి పండ్లుఁ గలివె
పండులుఁ దొడివెంద పండ్లుఁ దుమ్మికిపండ్లు
జానపండులు గంగరేను పండ్లు
వెలఁగపండులు పుల్లవెలఁగ పండులు మోవి
పండ్లు నంకెనపండ్లు బలుసుపండ్లు

బీరపండ్లును బిచ్చుక బీరపండ్లఁ
గొమ్మిపండ్లీతపండును గొంజిపండ్లు,
మేడిపండ్లును మొదలుకాఁ గూడిమాడి
చెంచెతలు దెత్తురిత్తు విచ్చేయుమయ్య.

మొదట క్రీడావిశేషములు, తరువాత ధనుస్సులు, ఇచ్చట బియ్యములలోని భేదములు, ప్రాలనఁగా బియ్యము. మరియు నడవులలో దొరకు పండ్ల పేర్లు. ఈ రీతిగా పెద్దపెద్ద జాబితాలు. తరువాతి తరువాతి కవులలో నిదియొక పెద్ద కవితాలక్షణమయ్యెను. ఒకజాతికి సంబంధించిన పేర్లెన్నియో చెప్పుట అది యా కవియొక్క ప్రతిభగా పరిణమించెను. ప్రతిభ యౌనా కాదా ? ప్రతిభ నిస్సంశయముగా నగును. అది కవితయా ? కావచ్చును. కాకపోవచ్చును. బహువిషయ పరిజ్ఞానమొక ప్రతిభ. వానినుచితముగా ప్రయోగించుట వేఱొకమైన ప్రతిభ. ఇచ్చటనే బాలక్రీడా విశేషములు చెప్పుట పెద్ద కవిత్వము క్రింద లెక్కగాదు. ఈ పండ్లపేర్లు వరుసగా చెప్పుట కవితాలక్షణము ఎందుచేత ? ఇచ్చట తిన్ననియొక్క అటవికమైన అమాయకత్వము వ్యజ్యమానమగుచున్నది. ఇది కొంత కవిత్వమగును. ఆ మొదటిది నిఘంటు బుద్ధి. ఇంతియేకాదు

చుఱుకుఁ జూపునఁ గాలిన కొఱత నుఱుకు
నుఱుకుఁ జూపులఁ బుట్టించి నెఱుకువారి
యిఱుకువలి గుబ్బ పాలిండ్ల యిగురుఁబోండ్ల
సేవకిచ్చెద నీకు విచ్చేయుమయ్య !

తనకటువంటి పరిచారికలు కలరు. అట్టి వారిని శివునకిత్తుననును. ఇదియుకూడ నతని యమాయకత్వమునకు వ్యంజకము.

అని తిన్నఁడు స్వామిని తనయూరికి రమ్మని పట్టుఁబట్టి కూర్చుండెను. కదలఁడు

అప్పుడు తక్కినబోయలు తమ చిన్నదొర యొక పందిని తఱుముచు పోయెను. ఏమైనాడోయని వెదకికొనుచు వచ్చిరి. వచ్చిచూచిరి. అతనిని ఉడుమూరునకు రమ్మని ప్రార్థించిరి. అప్పుడు తిన్నఁడు వారితో—

ఈ లింగము నావెంటవచ్చిన నేను వత్తును. లేనిచోరాను. నేనిచ్చ టనే చనిపోదును.

వనచరులు చేయునదిలేక వెడలిపోయిరి.

'ఎన్నాళ్ళనుండియో ప
స్తున్నాడీ యడవిలోన నొంటి మహేశుం
డిన్నెగులు మాన్పవలదా
కన్నారంగనిన బంటు గల ఫల' మనుచున్.

అని తిన్నఁడు అడవిలోనికిఁబోయి యొక పెద్ద యడవిపందిని చంపి తెచ్చి దాని మాంసమును దొప్పలలోఁబెట్టి స్వామికారగింపుమని యిచ్చెను. లింగము లింగముగానే యున్నది.

ఇచ్చటనుంచి నాలుగైదు కందపద్యములు కలవు. అన్నియు నాతని యమాయిక భక్తికి చిహ్నములు. సరిగా కాలలేదాయని, ఆకలికాలేదో యని; నాయందేమైన దోషమున్నదా యని ; నీవు తినకపోయినచో నా బ్రతుకెందుకని చివరకు తిన్నఁడు తానచ్చటనె చత్తుననెను. వట్టిమాటకాదు. నిజముగా చచ్చునట్లున్నాడు.

శివుఁడు అంత కష్టపడి వాని కలలో కన్పడి భక్తుని పిలిచి తెచ్చు కొన్నాఁడుకదా ! ఏమిచేయును ? అప్పుడు స్వామి తన రూపమంది యేడుపుమాన్పి తినెదనని యొప్పుకొన్నాడు. తిన్నఁడు మాంసఖండములం దిచ్చుట – శివుఁడు తినుట.– తిన్నఁడు ప్రతిదినమడవికిపోయి యే జంతువునో చంపి తెచ్చి యా మాంసమునుకాల్చి స్వామికి పెట్టుచుండును. ఆయన తిను చుండును.

అది వారి యిద్దరికే తెలియును. స్వామి దేవతారూపముదాల్చి వచ్చి తినుచున్నాఁడని యెవరికిఁ దెలియును? తక్కినవారికి అచ్చట శివలింగముం డును. శివలింగము కన్పించును. చుట్టుపక్కలనంతయు కశ్మలము. బొమి కలు, నెత్తురు మరకలు, చంపఁబడిన జంతువుల శవములు. కాల్చిన నెగళ్లు; ఎండిన మాంసపు ముక్కలు.

ఇట్లుండఁగా నొక శివబ్రాహ్మణుఁడు వచ్చెను. అతఁడు పూజారివంటి వాఁడు. అతఁడువచ్చి యీ కళ్మలము చూచి యంతయు బాగుచేసి మరల ప్రతి దినము వచ్చుచు మరల బాగుచేయుచు, నొకనాఁడిట్లనెను.

"కులదైవంబని యల్కిపూసి గుడ్డిముగ్గుల్ వెట్టి కై సేయ లో
పలికిల్లెంగిలి మంగలంబులగు దొప్పల్ రాకతంబేమి? ని
ర్మల తోయస్నపనం బొనర్చిన శరీరంబేటికి న్నీడువ
ట్టులుఁగట్టెం? భవదాత్మశుద్ధికిది గూడుంగా మహాహేయముల్."

తోయస్నపనము - నీళ్ళ స్నానము; నీరు వట్టులుగట్టుట - ఇక్కడ నేమనవలయుననఁగా నీటిచారలు కట్టుట యనవలయును. కానిభాషలో నీర్వట్టు అన్నమాటకు దప్పిక, దాహము వేయుటయని యర్థము. ఇచ్చట నా యర్థము కుదురదు.

ఇట్లే శివుఁడు ప్రత్యక్షమైన పద్యములో కచ్చడము అన్న శబ్దము న్నది. భాషలో కచ్చడమనగా కౌపీనము, గోచి; "కచ్చడాల్ కట్టుకొను మునిముచ్చులెల్ల తామరస నేత్రలిండ్ల బందాలు గారె" అని పెద్దన్నగారు వ్రాసిరి.

కచ్చడమనగా కౌపీనమనిగాని, నీరువట్టు అనగా దప్పిక యనిగాని కవులు ప్రయోగించిన ప్రయోగమునుఁ బట్టియే యర్థ నిర్ణయము చేయ బడినది; ఆ లెక్కప్రకారము ధూర్జటి ప్రయోగముననుసరించి కచ్చడము నకు, నీరువట్టునకు, బొంతయనియు, నీళ్లెండిన గారలనియు న ర్థ ము లు చెప్పవచ్చునుఁగదా!

శివబ్రాహ్మణుఁ డిట్లు కటకటంబడి యిది చేసినవాడెవఁడు? వాఁడు నీకుఁ జుట్టమా? నీ స్నేహితుడా? నిన్నుగురించియున్న కథలలో నీవు భక్తుల కొఱకు చాల పిచ్చిపనులు చేసితివని యున్నది.

నీ కిది యిష్టమైనచోగానీ, నా కా పాపాత్ముఁ జెప్పినన్ పది లక్షలు. లేకున్న కూడుగబట్టి నేను ప్రాణము విడుతును. అని వీఁడును పంతముపట్టి కూర్చుండెను.

అప్పుడు శివుఁడు తిన్నని విషయము చెప్పెను. చెప్పి "వాని భక్తి నీకు చూపింతును. కనఁబడకుండ నీవిచ్చట నెచ్చటనైన దాగియుండుము. వాఁడిప్పుడే వచ్చును" అనఁగా శివభక్తుఁడు తానొకచోట దాగియుండెను. అప్పుడు చెంచు వచ్చెను. వాఁడు రెండు దొప్పలలో మాంసము పెట్టికొని, వచ్చెను. స్వామికి స్నానము చేయించుట యెట్లు? పుక్కిటనిండ నీళ్ళుపట్టు కొనివచ్చెను. స్వామిమీద నిన్నటిపూజ తీసివేయుట యెట్లు? దొప్పలు క్రింద పెట్టి చేతితో తుడువవచ్చును. కాని ఆ దొప్పలు క్రిందఁబెట్టినచో స్వామి యాహార మపవిత్రమగును.

ఏమి సూక్ష్మమైన ధర్మములు! అందుచేత వాఁడు తన చెప్పుకాలితో లింగముమీది నిర్మాల్యము ప్రోఁద్రోచెను. మాంసపుదొప్పలు నేలఁబెట్టినచో నపవిత్రమగునా? చెప్పుకాలితో శివలింగముమీది నిర్మాల్యము తుడువ వచ్చునా?

ఎవరి భక్తి వాని వివేకప్రమాణమైనది. మన లౌకిక జ్ఞానమునకు దేవతా భక్తి యొక్క లక్షణమునకు సంబంధము లేదు. ఆ భక్తియొక్క లోతు వేఱు. ఈ లౌకిక పరిజ్ఞానము యొక్క స్వరూపము వేఱు.

అంత కన్నఁడు తాను పుక్కిలిబట్టి తెచ్చిననీటితో స్వామికి స్నానము చేయించెను. తాను తెచ్చిన మాంసఖండములు స్వామి కందిచ్చెను.

స్వామి కడచిన యేడుదినములుగా నెట్లు తిన్నాఁడో యీ వాఁడట్లు తినలేదు. తిన్ననికి భయము వేసెను. ఇంతలో స్వామి యొకకంట కన్నీరు కార్చ మొదలుపెట్టెను. ఆ కన్నీరు వృద్ధియగుచుండెను. అప్పుడు తిన్నఁడు ఓహో! స్వామి కంటికి జబ్బుచేసినది. ఆ బాధతో యన్నము తినుటలేదు. అని చెప్పరానంత దుఃఖముపొంది

కోకపోట్లం బావిగొన నూఁదియొత్తుచుఁ
 గషణోష్ణకరభ భాగమునఁ గాఁచి
నెత్తితంగేడాకు మెత్తి, రేచకినిమ్మ
 పంటినీరున నూటి పట్టువెట్టి,

తెల్లదింటెనపువ్వుఁదెచ్చి తద్రసమిడి
కలివె పువ్వులు గోసి నలఁచిపిడిచి
పేరిన నెయివెట్టి, పెరుఁగు వత్తులువైచి
చనుఁబాలతోరాచి, సంకుచమిరి,

విన్నమందులు, తా సరికన్నమందు
లడిగి తెచ్చిన మందులు, నడవిమందు
లెన్నిచేసిన మానక, యిందుమౌళి
కన్నుతోడఁబడి నెత్తురుగాఱుటయును.

కోకయనఁగా కట్టు పుట్టము. స్త్రీ పురుషులెవరు ధరించినను సరే! కాని తరువాత తరువాత నిది స్త్రీలు ధరించెడి చీరకే పేరైనది.

నేటికిఁగూడ మనయిండ్లలో కన్నెఱ్ఱపడినచో, కొద్దిగా నొప్పిగా నున్నచో బట్టను పొట్లముగాజేసి నోటిలో బెట్టుకొని యూవిరి యూది యా చిరువెచ్చని గుడ్డతో కన్నునొత్తుదుము. అట్లు నాలుగైదుసారులొత్తగా కంటిబాధ తగ్గును. రెండవది రెండుచేతులు చివరిభాగపుటుబ్బుగల చోట్లు రాచినప్పుడు వెచ్చబడును. ఆ వెచ్చదనముతో కన్నులద్దుకొందురు. ఇవి రెండును సహజములైన చికిత్సలు. తక్కినవి సరే! పేరిన నెయ్యివెట్టి పెరుగువత్తులువైచి, చనుఁబాలతోరాచి...అడవిలో నివియెట్లు తెచ్చెనని ప్రశ్న. ఈ సందేహము అడిగి తెచ్చినమందు అన్నమాటతో తీరినది.

ఎన్నిచేసినను కన్నీరు మానలేదు.

పట్టపు దేవిన్ హిమగిరి
పట్టిన్మాయమ్మఁ జూచి పదరినకతనన్
నెట్టవిసెనా? నేమందుల
మట్టెఱుఁగనొ? కంటికిం బ్రమాదం బొదవెన్.

హిమగిరిపట్టి — పార్వతి, ఆమెమీద కసరుకొనఁగా కన్నదిరినదేమో! నాకే మందులమట్టు(రహస్యము) తెలియదో! సీసీ! నేనెంత మూర్ఖుడను. కంటికి కన్నే మందు. అనుకొని బాణముతో తనయొక్క గ్రుడ్డును బెల్లగించి లాగి శివుని కంటికి బెట్టెను.

అంతట స్వామికన్ను నిమ్మదించెను

"మున్నిటి కన్నుకంటెఁ గడుమోహనమై తనకన్ను వచ్చిన
న్మన్ననఁజూచి మెచ్చక, యుమాపతి రెండవకంట శోణిత
క్లిన్నతఁజూపిన. న్నగి పుళిందుఁడు నీ కృపచేతఁగన్న మం
దున్నది, దీనికి న్వెఁఅవ, నొక్కటినావ్రతమింక శంకరా !"

తిన్నఁడు తనకన్ను పెకలించిపెట్టినంతమాత్ర నీరుకారుచున్న స్వామి కన్ను పూర్వపు కంటికంటె బాగుగానుండెను. కాని స్వామి మెచ్చలేదు. మెచ్చక రెండవకంట నెత్తురుకార్చ నారంభించెను. అప్పుడు తిన్నఁడునవ్వి

'నీ కృపచేత కన్నమందున్నది.'

అని రెండవకన్ను బెకలించఁబోవుచు నిట్లనెను : "నీకు మూఁడు కన్నులున్నవి. నాకు రెండే కన్నులున్నవి. నీ రెండుకన్నుల వ్యాధులు నా రెండు కన్నులతోఁ దీర్చెదను. నీ మూఁడవకన్నుఁగూడ జబ్బు చేసినచో నా ప్రాణములు నీకిత్తును కంటికి ప్రాణములకు సంబంధమేమనగా ఈ ప్రాణములు మనోదృష్టికి మూలములు" అన్నాడు.

ఇక్కడ చమత్కారమున్నది. తన రెండవ కంటితో స్వామి రెండవ కన్నుకూడ కుదురును. అప్పుడు స్వామి మూఁడవకంట నెత్తుగు కార్చినచో నది తిన్ననికెట్లు తెలియును. అప్పుడు ప్రాణములెట్లిచ్చును ఇక్కడనున్నది రహస్యము.

అందుకనియే ధూర్జటి మహాకవి 'మనోదృష్టి'కి మూలంబగువాఁడు ప్రాణముల నీ కిత్తున్ అని వ్రాసినాఁడు. తిన్ననికి మనోదృష్టి యున్నది. అనగా మూఁడవకన్న తనికిఁగూడ నున్నదన్నమాట. తనకు రెండుకన్నులు లేకపోయినను స్వామి మూఁడవ కంట కన్నీరు కార్చినచో నితనికి తెలియునట. ఎట్లు తెలియును ? ఇతని మనోదృష్టికి తెలియును. అనఁగా తిన్నని మనస్సు శివభక్తి పారవశ్యముచేత విజ్ఞానమయమైనది.

అని చెప్పుకాలితో నెత్తురు కారుచున్న శివుని రెండవకంటి నదిమిపట్టి తన రెండవకన్ను పెకలించుటకు బాణము తీసెను.

కన్నుఁదివియఁ బూను కన్నప్ప తీవ్రత
కన్నమున్ను గాఁగ ఖండపరశు

వాశుగంబుఁ జేతనంటంగఁ బట్టుక
"నిలువు నిలువు" మన్న యెలుగు తోడ.

ఖండ పరశువు — గొడ్డలిముక్క. అది శివునియొక్క యొక యాయుధము. తనకన్ను లాగుటకు కన్నప్ప యెంత తొందరపడుచున్నాడో అంతకంటె తొందరగా శివుఁడు ప్రత్యక్షమై తన చేతిలోనున్న ఖండ పరశువు, కన్నప్ప చేతిలోనున్న 'అశుగము' (బాణము) రెండు కలిపి పట్టుకొని 'నిలువు నిలువు' మన్న యెలుగు (ధ్వని) తో—

హరి, యరవిందసూతి మును లష్టదిశాపతులాదిగా వియ
చ్చరులిరు వంకలం గొలువ సత్వరత న్నిజలింగ నిర్మలాం
తరముననుండి, శీతవసుధాధరకన్యక ముద్దుఁగేలుఁ దా
మర చిఱుప్రేలు పట్టుకొని, మన్ననఁ దిన్ననికిం బ్రసన్నుఁడై.

హరి — విష్ణువు; అరవింద సూతి — బ్రహ్మ; తామరపూవునుండి పుట్టినవాఁడు; వియచ్చరులు — ఖేచరులు, దేవతలు.

శీతవసుధాధరకన్య — చల్లనికొండ కూతురు. ఆవిడయొక్క ముద్దు చేయి తామర చిఱుప్రేలు పట్టుకొని శివలింగమునుండి వెలువడి తిన్ననికి ప్రసన్నుఁడైనాఁడు.

పరమశివుఁడు తిన్ననికి ప్రసన్నమైన లక్షణము రెండువిధములుగా నున్నది.

ఒకటి బ్రహ్మాదులయు దిక్పాలురయు దేవతలయు కొలువు చేయించికొనుచు, తాను సర్వ జగత్తునకు నధినాథుఁడన్న ప్రభ యొక్కటి.

రెండవది పెండ్లినాఁడు భర్త భార్యయొక్క కొనవ్రేలు పుచ్చుకొని తిరుగును. ఆనాటి వలపులో పెండ్లియొక్క పసిమియంతయు ప్రేమ యొక్క పచ్చి యంతయునున్నది. పరమ సుప్రసన్నత యున్నది. రెండవ లక్షణమిది.

అంసుకనియే ధూర్జటి పార్వతికి మరియొక్క పేరు వాడక శీతవసుధా ధరకన్యకయని యొక ముద్దుపేరు వాడినాడు. అమ్మవారికేలు (చేయి) ముద్దు కేలట! అది తామరయట! ఆ స్వామియొక్క సర్వ ప్రసన్నతయు నీ శబ్దములయందున్నది.

అప్పటికి శివబ్రాహ్మణునకు తిన్నని భక్తి తెలిసెను. ఇద్దరును శివుని స్తుతించిరి. పరమేశ్వరుడు వారిద్దరిని తనలో కలుపుకొనెను.

ఈ తిన్నని పూర్వకథ యున్నది. అట్లే చెలది పుర్వునకు, సర్పమునకు, హస్తికి పూర్వకథలున్నవి. చెలదియు, సర్పమును, ఏనుగును వారు పూర్వము ప్రమథులు. అనఁగా శివగణములోనివారు. శాపములుపొంది యుండిరి.

ఈ తిన్నఁడట్లుకాదు. ఈ తిన్నఁడు పూర్వజన్మలో నర్జునుఁడు. ఇక్కడనున్నది యాశ్చర్యము.

అర్జునుఁడు కౌరవులను గెలుచుటకొఱకు శివునివద్ద పాశుపతాస్త్రమును సంపాదించెను.

ఈ కథ ప్రసిద్ధమైనదియేకదా! అర్జునుడు తపస్సు చేయుచుండెను. శివుఁడు కిరాతరూపమున వచ్చెను. ఒక పందిని తరుముకొనివచ్చెను. శివుఁడు బాణము వేసెను. అర్జునుఁడు బాణము వేసెను. ఇద్దఱి బాణములు తగిలి పంది చచ్చెను. ఇద్దఱును చచ్చిన పంది, తనది తనదియని వివాద పడిరి. యుద్ధమాడిరి. శివుఁడర్జునుని అమ్ముల పొదిలో బాణములులేకుండ జేసెను. అర్జునుఁడు గాండీవముతో శివుని శిరస్సుమీదఁ గొట్టెను. ఇద్దఱును కొంత సేపు మల్లయుద్ధము చేసిరి. చివరకు శివుఁడర్జునకు ప్రసన్నుఁడై పాశుపతాస్త్రమునిచ్చెను.

ఇంతవఱకు కథ సర్వత్ర సమానము. ఈ శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో చివరియాశ్వాసములో వీరందఱి పూర్వజన్మ కథలు కలవు. ఈ గ్రంథములో ఈ కథను మించి మరియొకటి యున్నది. అది యేమనఁగా నర్జునుఁడు శివుని పాశుపతాస్త్రమేకాదు మోక్షమునుఁగూడ నిమ్మని యడిగెను.

ఇక్కడనున్నది రహస్యము. అర్జునుఁడు శ్రీకృష్ణుని చెలిమికాఁడు. భగవద్గీత యుద్ధభూమియందు శ్రీకృష్ణుడు అర్జునునకుపదేశించెను.

ఏ భగవద్గీత సర్వజగత్తునకు మోక్షమిచ్చునన్నదో! యిచ్చుటకు సంకల్పింపఁబడినదో! ఆ భగవద్గీతను శ్రీ పరమేశ్వరునుండి ప్రత్యక్షముగా

నుపదేశము పొందిన యర్జునుఁడు పాశుపతాస్త్రమును పొందుచు తనకు శివుని మోక్షమిమ్మని యడుగుటయేమి ? కాదు భగవద్గీతోపదేశము చాల తరువాత జరిగినది. ఈ యడుగుట కొన్ని యేండ్లకు పూర్వము జరిగినది. ఒప్పికొందము. మరి అర్జునునకు తిన్ననివలె జన్మమెత్తవలసిన యవసరము లేదే! ఎత్తినాఁడు కదా ! అతనికి మోక్షముపచ్చినదిప్పుడు. భగవద్గీత ఏమైనది ?

ఇది ఇట్లుండగా పాండవులు చనిపోయినారు. ధర్మరాజును స్వర్గమునకు తీసికొనివెళ్ళుచు ద్రోణవధ సందర్భమున 'అశ్వత్థామహతః కుంజరః' అన్న విషయములో ధర్మరాజ బద్దమాడినాఁడు, ఆడలేదుకదా ! ఆ కొంచెము పాపమునకు ధర్మరాజును దీసికొనిపోయి యూరకే నరలోకమును చూపించి తెచ్చిరి. ధర్మరాజక్కడకు పోగా నక్కడ బాధననుభవించుచున్న జనులు ఒక పుణ్యాత్ముని సన్నిధానముచేత ప్రాణములు చల్లబడి సంతోషించుచు నేడ్చుచుండిరి.

ధర్మరాజు మీరెవ్వరని యడిగెను. ఆ యేడ్చెడివారిలో అర్జునుఁడు, భీముఁడు, నకుల సహదేవులుకూడ కలరు. తక్కినవారిమాట యట్లుంచి భగవద్గీత యుపదేశమును పొందిన యర్జును డందున్నాఁడు. గీతోపదేశమువలన నతనికి మోక్షము రాలేదన్నమాట ! అర్జునునిలోనున్న జీవుని యొక్క స్వరూపమెట్టిదో !

జీవులయొక్క లక్షణములెట్టివో ! ఇది యనూహ్యముగానున్నది. కొందఱు జీవులు జ్ఞాననిష్ఠులు. కొందఱు జీవులు భక్తినిష్ఠులు. కొందఱు వైరాగ్యనిష్ఠులు.

'అహం బ్రహ్మాస్మి' అని పరాకాష్ఠ పొందెడు జీవుఁడు వేఱు.

'శివోఽహం' అనుకొను జీవుఁడు వేఱు.

ఇట్లెన్నియైన భేదములుండవచ్చును. ఈ కథయొక్క పరమార్థము ఈ చిక్కులలోపడినది.

దీనిని గుఱించి యింకను విచారించవలయును. నరనారాయణు లిద్దఱు నిత్యఋషులు. నరుఁడు నిత్యుఁడు. ఆ నిత్యత్వ లక్షణము వేఱు. అతనికి ముక్తియేమి ? తెలియదు.

ముక్తి రెండు విధాలుగానుండునని చెప్పబడినది. ఆత్మోపాసన చేసెడువారు వేఱు. వారు 'అహంబ్రహ్మాస్మి' అన్న భావమునందు నిష్ఠులైనవారు. కొందఱు ప్రతీకల నుపాసింతురు. 'ఓం' మొదలైనవి బ్రహ్మ ప్రతీకలు.

మరికొందఱు దేవతల నుపాసింతురు. వీరందఱకును ముక్తి వచ్చును, ఆ ముక్తులలో భేదములున్నవి.

ఒకఁడు శివునిలో సాయుజ్యము పొందును. మరియొకఁడు విష్ణు సాయుజ్యమును పొందును. వారికి పునరావృత్తిలేదు. కాని వారు బ్రహ్మ పదార్థములో కలియరు. ప్రళయాంతము ఆయా లోకములయందుండి చివరకు కలియుదురు.

ఇతఁడు నరుఁడు. అందుచేత నితనికట్టి ముక్తియే న్యాయమేమో!

## నత్కీరుని కథ

దక్షిణదేశమున మధురానగరమున్నది. ఆ నగరము మహా ప్రసిద్ధమైనది.

కాశీ విశాలాక్షి కంచి కామాక్షి మధుర మీనాక్షి - ఈ ముగ్గురు తల్లులకు ప్రసిద్ధమైన క్షేత్రములలో మధుర యొకటి.

అచట వాలవాయి చొక్కనాథుఁడన్న రాజుకలఁడు. ఆయన భార్య మీనేక్షణ. అచ్చట ద్రావిడ భాషా పీఠ శంకఫలకము కలదు.

తామ్రపర్ణీనదికి సవతియైన వైఘునది కలదు.

అచ్చట పరమశివుఁడు పాండ్యరాజు నల్లుడై యుండెను.

ఆ పట్టణమును పాండ్య భూపాలుని కూతురును పరమేశ్వరుని భార్యయునైన పార్వతీదేవి రక్షించుచుండును.

ఆ పట్టణమును పాండ్య రాజేలుచుండెను.

అగస్త్య మహర్షి ద్రావిడభాషకు వ్యాకరణము, అలంకారము, నిఘంటువు, ఛందశ్శాస్త్రము మొదలైనవి వ్రాయదలచి పదునెనిమిది యక్షరములతో మూలపీఠిక వ్రాసి పాండ్యరాజునకా ఫలకమునిచ్చి యిట్లనెను.

"ఈ శంకఫలకమును నీదగ్గర నుంచుకొనుము. ఈ ఫలకముమీద నెంతమంది యైన కూర్చుండవచ్చును. ఎంతమంది కూర్చున్నను మరియొకనికి స్థలముండును. ఒక్కడు కూర్చున్నప్పుడునంతే! మరియొకనికి స్థలముండును."

అగస్త్యుడిట్లు చెప్పివెళ్ళిన తరువాత పలుమంది రాజులు రాజ్యము చేసిరి.

కొన్నాళ్ళకొక రాజు వచ్చెను. అతఁడు మరియు భాషాపోషకుఁడు. ఆ సభలో పంద్రెండుగురు కవులు నిలచిరి. వారిలో నత్కీరుడు మేటి, వారందరును ప్రశంసించినగాని ఆ శంకఫలకముమీద మరియొక్కనికి చోటు రాదు. ఆ సభ మెచ్చునట్లు కవిత్వము చెప్పుచో రాజు బహుసంపదలిచ్చును.

ఇట్లుండగా దేశమునందు దుర్భిక్ష ముదయించెను. కాటకమువచ్చెను. తిండిలేక జనులు పురమును వదలి లేచిపోనెంచుచుండిరి.

అట్లుండగా ఆ మహానగరమునందు మూలస్థానమునందలి శివబ్రాహ్మణుడు లేచిపోనెంచెను, శివునకు దయకలిగెను. శివుఁడు వానికిఁ బ్రసన్నుఁడై యిట్లనెను.

'ఓయీ! నేనీ రాజుమీదనొక పద్యమువ్రాసితిని. అది శృంగార రసము, నీవీపద్యమునుఁ దీసికొనిపోయి రాజునకిమ్ము. ఆ రాజు నీకు వేయి మాడలిచ్చును. ఇంక నీనేమి కొదువ? నీ వేయిమాడలు వ్యయమగులోపున కఱవు తీరును. వానలు కురియును."

అనగా నా శివబ్రాహ్మణుఁడా పద్యమునుఁ దీసికొనిపోయి రాజ సభలో చదివెను.

అందులోని యర్థమిట్లున్నది.

"సింధురరాజ గమనాధమ్మిల్ల బంధమ్ము సహజ గంధమ్ము". సింధుర రాజు — ఏనుగులరాజు, దానివలెగమన — నడిచెడి — స్త్రీ; ఆమెయొక్క ధమ్మిల్ల బంధమ్ము — జుట్టుముడి; సహజ గంధమ్ము — సహజముగా సువాసన కలది. (వాసన తైలములచేతగాని, పుష్పములలంకరించుకొనుట చేతగాని వచ్చిన వాసనకాదు.)

దానికి నత్కీరుఁడు నవ్వి "ఇదియేమి" తలవెంట్రుకలకట్టి సహజమైన వాసనయేమి! పో! పో.

తప్పిది చెప్పరాదు కవితాసమయంబున కొప్పుగాదు నీ
విప్పగిదిన్ రచింపదగునే యన విప్రుడు చిన్నబోయి, "నా
కప్పరమేశ్వరుండు వసుధాధిపుపై రచియించియిచ్చి నా
డొప్పను దప్పునేనెఱుగ నుత్తములార!" యటంచు గ్రమ్మఱన్.

కవితా సమయము - కవితా సమయములని చాలకలవు. ఆడకోకిల కూయును. ఇదియొక సమయము. కాని కూయునది మగ కోకిల. ఆడనెమలి నృత్యము చేయును, నృత్యము చేయునది మగనెమలి. ఆడనెమలికి పింఛ ముండదు. మగనెమలికే యుండును. నదులలో తామర పూవులుండునని కవి సమయము. నదులలో నెప్పుడును తామర పూవులుండవు. శుక్ల పక్షమంతయు వెన్నెల. కృష్ణపక్షమంతయు చీకటి. ఇది కవి సమయము. ఇట్లుకాదు శుక్లపక్షము సాయంసంధ్య మొదలుపెట్టి వెన్నెల. కృష్ణపక్షము ప్రాతస్సంధ్యకు పూర్వము వెన్నెల. స్త్రీయొక్క మొగము చంద్రుఁడు; తామర పువ్వు. కన్నులు కరములు తామర పువ్వులు; — ఇవి యన్నియు కవి సమయములు. వీనినన్నిటిని కవులు వ్రాయుచునే యుందురు.

కాని సింధురరాజ గమనాధమ్మిల్ల బంధమ్ము సహజ గంధమ్మనుట కవి సమయముకాదు. కవి సమయములయందు చాల నిజములుకావు. అయినను కవిసమయములు గనుక వానిని జనమొప్పుకొనుచున్నారు. ఇదియు నిజముకాదు. కాని దీనినొప్పుకొనుటలేదు.

అప్పుడు శివ బ్రాహ్మణుఁడేమిచేయును.

"ఉత్తములారా! నాకిది తెలియదు" అన్నాడు. ఉత్తములార! అనుటలో నతఁడుపడిన దిగులంతయు నున్నది. ఆతఁడు పడిన భయమంతయు నున్నది. సరే! నీవింత సాహసమెందుకు చేసితివని యడుగుదురేమో! "నాకిది భగవంతుడు వ్రాసియిచ్చినాఁడు నేను తెచ్చితి" ననినాఁడు.

అతని ముఖ లక్షణములు చూఁడగానది నిజమే యనిపించుచున్నది. అందఱు నూరకుండిరి. అతనిని పోనిచ్చిరి. అతఁడు బ్రతుకు జీవుడాఁయని బయటపడినాఁడు.

ఈ సంగతులన్నియు కవి చెప్పడు. పాఠకుఁడర్థము చేసికొనవలయును.

అతఁడు తిరిగి దేవాలయమునకు వచ్చెను. వచ్చి స్వామితో నిట్లనెను. "నిన్ను నమ్మిపోయి సభలో సిగ్గుచెడితిని. ఉన్న కథలు చెప్ప నేల ?" అని మొదటిమాట. ఉన్నకథలు అనఁగా నిన్ను నమ్మినవారందరు సిగ్గుచెడుదు రని యర్థము. పరమేశ్వరుఁడు ధనమిచ్చునా ? వైరాగ్యమిచ్చును. అనఁగా సిగ్గు చెఱుపును. గోపికావస్త్రాపహరణములోని రహస్యము.

"తా నెఱిగిన విద్య నృపా
స్థానములో నెఱపఁ గీర్తి సమకూరుంగా
కే నరునకుఁ బరవిద్యా
ధీనత భూపాల సభలఁ దేజముగలదే ?"

పరవిద్యాధీనత — పరవిద్య యనగా ఇతరులయొక్క విద్య యని, మోక్ష విద్యయని. "మోక్ష విద్యకు రాజసభలలో పాటింపు లేదు. రాజులు, రాజకీయ జనము అధికార ధూర్వహులై పరమును లెక్కఁజేయరు" అని ధ్వని.

నీ మాటలు నమ్మి నేను మోసపోయితిని. నత్కీరుఁడు నన్నెన్ని మాటలన్నాఁడు ? ఆ మాటలు పడుటకంటె ఈ కరువుతో చచ్చిపోయినను బాగుండెడిది. అని సద్భక్తనిధీయని సంబోధించినాడు.

అనఁగా నా శివ బ్రాహ్మణుఁడు తాను సద్భక్తుఁడు కాడని తన్ను తాను నిందించుకొన్నాఁడని యర్థము.

అని శివ బ్రాహ్మణుఁడు మరియు నిట్లనెను. "స్వామీ! నా యదృష్ట మిట్లుండగా నిన్నును నత్కీరుని అన్నఫలమేమి? ఎక్కడికైనను పోయి బిచ్చ మెత్తుకొందును. నీకు భద్రమగుగాక ! నన్ను వదలిపెట్టుము.

అనఁగా శివునకు దయకలిగి యిట్లనెను :

"కటకట ! యన్నత్కీరుం
డట ! కవితయుఁ దప్పునట్టెనఁట ! యటుపదమీ
యెటువలెనో తెలిసెద !" నని
నిట లాక్షుఁడువచ్చి కుంభినీపతి సభలోన్".

ఆ నత్కీరుఁడు — అన్నత్కీరుఁడు. రెండు నొక్కటియే. కాని యుచ్చారణలో అన్నత్కీరుఁడనుటచేత తిరస్కారమున్నది. ఆ నత్కీరుఁడ

న్నచో నంత తిరస్కారము భాసించదు. ఆ నత్కీరుఁడన్నచో ఆ లక్షణములు గల నత్కీరుఁడని మాత్రమే వ్యంగ్యము. ఇది సూక్ష్మమైన విషయము. పాఠకుని ప్రతిభచేత మాత్రమే తెలిసికొనదగినది.

'అటువదమీ! యెటువలెనో! తెలిసెద'.

ఎటువలెనో - ఎట్లాగో ! అర్థమిదిగాని యెటువలెనో అని విడబఱచి చెప్పుటలో (పైగా ప్రాసయు గణమునిల్లే కుదురును) నొక యాక్షేపము న్నది. ఒక తిరస్కారమున్నది. లోకములో నొక్కొక్కప్పుడు కోపము వచ్చినప్పుడు కొన్నిమాటలను విడబఱచియందుము. అవి కోపమునకు వ్యంజకములు.

ఇది యంతయు వ్యంగ్య ప్రపంచకము. తెలిసికొనినచో రసావిష్కారము జరుగును. ఇది కావ్యపఠన పరమార్థము.

అని శివుఁడు రాజసభకు వచ్చి —

శివ బ్రాహ్మణుఁడు రాజ సమ్ముఖంబునకుబోయి — అని వ్రాయఁబడెను. ఇచట నిటలాక్షుఁడు వచ్చి కుంభనీపతి సభలోన్ అని వ్రాయఁబడెను.

రాజసమ్ముఖమునకుఁబోయి యనుటలో శివ బ్రాహ్మణుఁడు రాజ దర్శనము లభించుటకు పడిన కష్టము రాజసమ్ముఖమన్న శబ్దముచేత తెలియుచున్నది. ఇచట శివుఁడువచ్చి సభలో నిట్లన్నాఁడు. అని యున్నది. దీనిలో శివుఁడు వచ్చిన పటాటోపము, ద్వారపాలకులను లెక్కచేయకపోవుట, ఆయన లక్షణమునుఁజూచి ద్వారపాలకులడ్డగింపకపోవుట తెలియుచున్నది.

ఇట్టివన్నియు రహస్యములు. ఇందేమియు విశేషములు లేవని సామాన్య పాఠకుఁడనుకొనును. కొందఱు కవులు వీనినిఁగూడఁ జెప్పుదురు. కొందఱు గడుసు కవులు ప్రయోగించిన శబ్దములచేత దానిని పాఠకుఁడూహించగలిగినచో నూహించుటకు వదలిపెట్టుదురు. ఇచ్చటనేమియు లేదు. కాని యున్నది.

ఇట్టి వదలిపెట్టుటలు కథలోనున్న ప్రధాన లక్షణములకు భంజకములు గావు. కాని కథాగమనములోని గడుసుదనమునకు చాల యుపయోగించును.

శివుఁడు వచ్చి యిట్లనెను !—

"ఈ రాజన్యుని మీద నే కవిత సాహిత్యస్ఫురన్మాధురీ
చారు ప్రౌఢిమఁ జెప్పి పంప విని మాత్సర్యమ్ము వాటించిన
త్కీరుండూరక తప్పుపట్టెనఁట! యేదీలక్షణంబో, యలం
కారంబో, పదబంధమో, రసమొ ? చక్కంజెప్పుఁడా తప్పనన్."

ఈ పద్యములోని యర్థము సరిగానట్టి సమయములో సమర్థుఁడైన యొక మహాకవి యన్నమాటలే !

'సాహిత్య స్ఫురన్మాధురీ చారుప్రౌఢిమ' అన్న సమాసము మాత్రము తన కవిత్వము చాల గొప్పదియని యా వక్త చెప్పుచున్నాఁడన్నది యర్థమే గాక వ్యంగ్యముకూడ భాసించుచున్నది.

లోకములో సామాన్యముగా "నేను బ్రహ్మాండముగా చెప్పితి" నందురు. అప్పుడు గొంతు పెద్దది చేయుదురు. ఆ భావము వక్త యొక్క బొమ్మలో కంఠములో మొగములో భాసించుచుండును. ఈ సమాస గ్రథనమాలక్షణములన్నింటిని ధ్వనించుచున్నది.

అనఁగా నత్కీరుఁడు పూర్వమువలెనే మరల తప్పనెను. అంత శివుఁడు "గిరితనయా ఘనకచ భారమ్ము సహజ గంధం" బన్నాఁడు. పార్వతీదేవి ధమ్మిల్లము సహజగంధ మన్నాఁడు.

అనఁగా నత్కీరుఁడు "పార్వతీదేవి కైనచో నగుగాఁక ! లోకములోని స్త్రీలకు కాదు" అనెను. అని నిరాకరించెను.

ఇచ్చట నెన్నియో రహస్యములు కథలోనున్నవి. శివుఁడుఁగా వచ్చెనా ? రాలేదు. శివుఁడేమో యన్న సందేహము కలుఁగునట్లు వచ్చెనా ? అట్లు వచ్చియుండవచ్చును. పార్వతియొక్క జుట్టు సహజగంధ మనుటకు సామాన్యుఁడెవఁడు, శివుఁడే యనగలఁడు. అతఁడట్లన్నప్పుడు నత్కీరుఁడు తటపటాయించినాఁడు. పార్వతీదేవి ధమ్మిల్లమ్ము సహజ గంధమో కాదో నీవెవఁడవురా చెప్పుటకు అన్నఁడా ? అనలేదే ! పార్వతికైనచో కావచ్చును. తక్కిన స్త్రీలకు కాదన్నాఁడు. అనఁగా నత్కీరునకు వాఁడు శివుఁడేమో యన్న యనుమానము లేకపోలేదు.

ఈ యనుమానము లన్నియు వెనుకఁబెట్టి ధూర్జటి జరిగిన సంభాషణను వ్రాసెను. ఇది యొక విశిష్టమైన రచన.

ఇట్టి రచన కథలు వ్రాయుటలో చేయవచ్చుఁగాని ఆధునికములైన వ్యక్తిగతానుభవములు వ్రాసెడు కవితలో నిట్టివ్యంగ్య వైభవము చూపుటకు వీలులేదు.

కథా కవిత్వమైననే రసోదయము కలుగును. వ్యక్తిగతానుభవములను రచించుట యందెప్పుడును రసోదయము కలుగదు.

కవితా సమయములు సర్వజనాంగీకృతములు. వ్యక్తిగతానుభవములు కవిత్వమునకు పనికిరావు. ఎవరో కొందరు వారిలో వారు సంతృప్తి పడవలయును. ఈ మహార్థము నిచ్చట నత్కీరుఁడు నిరూపించినాఁడు. అట్టి వాదము 'గగనప్రసూనవాద' మన్నాఁడు.

అచ్చట నత్కీరుఁడెవఁడు? ఆ పాండ్య రాజ ద్రవిడ భాషా పీఠ శంఖ ఫలక మహాసభ సభ్యుఁడు. అతఁడు కవిత్వమునకు శాస్త్ర.

ఈ కథ విచిత్రముగా నున్నది.

నత్కీరుఁడు రసప్రధానమైన కవిత్వమునకు ప్రతినిధి. ఇచట శివుఁడు వ్యక్తిగత కవిత్వమునకు ప్రతినిధి.

నత్కీరుఁడు సామాన్య మానవుఁడు. శివుఁడు పరమేశ్వరుఁడు.

నత్కీరుఁడు "ఈ లూలాముూలపు మాటలు వదులు" మనెను.

శివుఁడిట్లాలోచించెను. "వీనికి నేను శివుడనో కానో తెలియుటలేదు. వీనికి సందేహముగానే యున్నది. నిజమే చూపించెద''నని తన నొసలగల మూడవ కన్ను చూపించెను.

ఇచ్చట నున్నది కథలోని గడ్డు.

అప్పుడు నత్కీరుఁడేమనవలయును. సాష్టాంగపడి క్షమించుము, నీ కవిత్వము బాగుగనే యున్నదనవలయును.

అనఁగా ఒక వ్యక్తి యొక్క గొప్పదనమునకో యొక రాజు యొక్క యధికారమునకో యొక సంఘము యొక్క దౌర్జన్యమునకో తాను

దాసుఁడై పోవుట. అయినచో నేమగును? యథార్థమైన రసవత్కవితకే ద్రోహము చేసిన వాఁడగును.

ఎప్పుడు శివుఁడు కవిత్వము వ్రాయఁడు. ఎప్పుడు నొకరాజు కొందరు కవులను వెంటవేసికొని యుండఁడు. సర్వకాలములయందు సర్వదేశముల యందు సంఘము కొన్ని దుష్ట లక్షణములు గలిగిన కవిత్వమునే యభినం దించుచుండదు. అందుచేత శివుడునినైన నెదిరించి తీరవలయును. లేనిచో సాహిత్య ద్రోహము జరుగును.

లేనిచో శివుఁడు తన్ను శపించవచ్చును. మన్మథుని దహించినట్లు దహించవచ్చును. పోనీ అయినచో నానొక్కఁడే యగును. లేనిచో రసో వై సః, అహం బ్రహ్మాస్మి మొదలైన మహార్థములకు స్థానభూతమైన రస వత్కవిత భంగపడును.

నత్కీరుఁడింతటి గొప్పవాఁడు. అప్పుడతఁ డిట్లనెను.

> "తలచుట్టు వాఱఁ గన్నులు
> గలిగినఁ బద్యంబు దప్పుగాదన వశమే?
> వలదిచ్చుట నీ మాయా
> విలసనములు పనికిరావు విడువు" మటన్నన్.

నత్కీరునకు శివుఁడు శివుఁడని తెలిసెను. శివునకు ఫాలమునందు కన్నుకలదు. ఒక్క ఫాలము నందుకాదు. తలచుట్టును కన్నులుండనిమ్ము తప్పు తప్పే యన్నాఁడు. దీనియందెంతో యర్థమున్నది. అనంత కల్పముల యందు శివులనేక మంది యుందురు. వారు మోక్షమిత్తురు. సాయుజ్య మిత్తురు. ఈ మోక్ష సాయుజ్యములు కల్పాంతము వఱకే. రసము నిత్య మైనది. అహంబ్రహ్మాస్మి లక్షణము కలది. అనియెడు గొప్ప అద్వైత సిద్ధాంత ప్రతిపాదనము జరుగుచున్నది.

శివునకుఁ గోపము వచ్చినది.

> శపియించెం బ్రతి భాషలఁ
> గుపితుండై రుద్రుఁడతని "గుష్ట వ్యాధిం
> దపియింపు" మనుచు దానికి
> నపరిమిత భయమ్మునంది, యతడిట్లనియెన్.

ఈ పద్యము మొదట మూడు మాటలు ఆరారు మాత్రలతో చేసి మొదటి రెండు రెండు అక్షరములు రెండు రెండు మాత్రలుగా చేయుటలో వచ్చిన నడకచేత వారి వాదన లక్షణము శివునకు వచ్చిన కోపలక్షణము ధ్వనితమగుచున్నది.

మహాకవిత్వ మనగా నిట్లుండవలయును. కవులిది తెలిసికొని వ్రాయవలెను.

తెలిసికోకుండ వ్రాసినవాఁడు కవి. తెలిసి వ్రాసిన వాఁడు మహాకవి. మహాకవి లక్షణము లింకను చాలకలవు. ఇది యొక లక్షణము. ఇది ప్రధానమైన లక్షణము. రచనకు సంబంధించిన లక్షణము.

అపుడు నత్కీరుఁడు స్వామి పాదముల మీద పడి రక్షించు మన్నాఁడు. శివుఁడు "నీవు కైలాస పర్వతము చూచినచో నీకీ శాపము తీరు"నన్నాఁడు.

నత్కీరునకు కుష్ఠవ్యాధి వచ్చెను.

తరువాత చాలా కథయున్నది.

అతఁడనేక తీర్థ యాత్రలు చేసెను. నత్కీరుడొక భూతము చేతికి చిక్కెను. అచ్చట నతనికి సుబ్రహ్మణ్యస్వామి ప్రత్యక్ష మయ్యెను.

కైలాసమునకు పోవుట సాధ్యముకాదు గదా? అప్పుడు కుమారస్వామి వానికి నొక కీలకమును చెప్పెను. స్వామి కైలాసమ్మున్నాడు కాని ఉత్తర దిశా కైలాసమనలేదు కదా! నీవు దక్షిణ దిశా కైలాసమునుఁ జూడుము. అనగా శ్రీకాళహస్తి.

అనగా నత్కీరుఁడు శ్రీకాళహస్తి పురమువచ్చి స్వామిని సేవించెను. అతని కుష్ఠవ్యాధి మానెను. అతఁడు నూరు పద్యములతో శివస్తోత్రమును వ్రాసెను. స్వామి సంతోషించెను. ప్రత్యక్ష మయ్యెను.

> ప్రత్యక్షంబగుచున్ "భవద్భవము సాఫల్యంబు నుం బొందె; సా
> హిత్య శ్రీవర! నీకు నింపగు వరం బే నిచ్చెదన్ వేడు, భీ
> తిత్యాగం బొనరించినాడ" నన నత్కీరుం డుమాజానికిన్
> బ్రత్యగ్జ్యోతికి మ్రొక్కి మ్రొక్కి, ప్రమద ప్రాయాంత రంగంబుతోన్.

ఈ పద్యములోనున్న సొగసేమనగా శివుఁడు నత్కీరుని "సాహిత్య శ్రీవర !" అని సంబోధించెను. అనఁగా శివుఁడు నత్కీరుని సాహిత్య సిద్ధాంతము నంగీకరించినాడని యర్థము. పట్టుదల చూపించినది శివుఁడు. నత్కీరుఁడు కాడు.

నత్కీరుఁడేమి చేసినాఁడు ? భీతిత్యాగం బొనరించినాఁడు. అనఁగా భయమును వదలిపెట్టినాడు. భయము జంతువుల లక్షణము. జంతువుల లక్షణములు నాలుఁగు. ఆహార నిద్రా భయ మైథునములు. నత్కీరునకు జంతులక్ష మప్పుడే లేదు.

అతఁడు ముక్తుడు. ముక్తునకుండవలసిన ప్రధాన లక్షణ మతని యందున్నది. అతఁడు రసనిష్ఠుఁడు. ఐనచో నీ కుష్ఠువ్యాధి యేమి? ఈ సంచరించుట యేమి ! ఇది యంతయు ప్రారబ్ధము.

శివుఁడు చివరకతనికి సాయుజ్యమిచ్చెను. ఈ కథయందు మన మతము యొక్క సర్వరహస్య మిమిడి యున్నది.

# ఉత్తర హరివంశము

## ఊర్వశి కథ

నరకాసురుఁడు స్వర్గలోకము మీదికి దాడి వెడలి దేవతల నందఱను జయించెను. అష్టదిక్పాలకులను జయించెను. రాక్షసులు దేవలోకములో చేయరానన్ని చెడ్డపనులు చేసిరి. స్వర్గపుర మంతయును దోచిరి. అనేక ఘాతుక కృత్యములు చేసిరి. ఆ దుష్టపు పనులన్నియు జూచి నరకాసురుఁడు నవ్వుచుండెను. అతఁడు ఇంద్రుని యొక్క మందిరమునకు వెళ్లెను. ఈ లోపుననే యింద్రుని యొక్క భార్యలందఱు రహస్యముగా పారిపోయిరి. ఇతఁడంతఃపురమును ప్రవేశించెను. అంతఃపురములో నింద్రుని భార్యలకోసము వెదకెను. వారెవరునుఁ గనిపించలేదు.

అప్పుడువచ్చి సభామంటపమున రత్నసింహాసనము మీద కూర్చుండెను. దేవత లెవ్వరునులేరు. తానొక్కరుఁడును గూర్చుండెను. తాను తన రాక్షస మంత్రులునుఁ గూర్చుండిరి.

ఆ నరకాసురునకు కొన్ని యేండ్ల నుండి యూర్వశి మీద మమకారము. రంభ, ఊర్వశి, తిలోత్తమ — వీరందఱును అప్సరః స్త్రీలు. అనఁగా దేవలోకములోని వెలయాండ్రు.

ఈ యూర్వశిని నారాయణ మహర్షి తన తొడకోసి యా లోపల నుండి తీసెను. అనఁగా సృష్టించెను. అందుచేత నీమె శ్రీమన్నారాయణుని కుమార్తె.

బ్రహ్మ సర్వజీవులను సృష్టించెను గదా! అతఁడు పితృస్థానమునం దుండును. ఆయనయే సరస్వతిని గూడ సృష్టించెను. అందుచేత సరస్వతి బ్రహ్మకు కూతురు. ఆమెను పెండ్లియాడెను. ఇది దోషముగా నిప్పటికిని జనులు చెప్పుదురు.

వేదమునందొక కథయున్నది. మొట్టమొదట ప్రజాపతి యుండెను. ఆయన తానొంటరిగా నున్నాఁడని భయపడెను. ఇంకెవఁడైన నున్నప్పుడు భయము గాని తానొక్కడే యున్నప్పుడు భయమెందుకు? ప్రజాపతి సాక్షాత్ ఆత్మ స్వరూపుఁడు. ఆత్మ యొక్కటియే కదా! ఆత్మ నిర్భీకమైనది కదా! ప్రజాపతియు నిట్లే తలంచెను. తలంచి తాను పడ్డ భయమున కర్థమేమియని ప్రశ్న వేసికొనెను. ఇది భయముకాదు. ప్రజాపతి సృష్టించ వలయును. సృష్టించుట యెట్లు? ప్రజాపతి యూహించెను. తన పరిష్వంగమున కనుకూలమైన మరియొక వ్యక్తిని సృష్టించవలయును. ఆ వ్యక్తి స్త్రీ యైనది. ఇచ్చట పరిష్వంగ మన్న శబ్దము చాల అగాధమైన యర్థము కల శబ్దము.

అది యట్లుంచి ప్రజాపతి తాను సృష్టించిన స్త్రీయందు తాను సృష్టి చేయవలయును. ఆమె తనకు కూతురు. పెండ్లి యాడుదురా? కూఁతునందు సంతానముఁ గందురా? కన్నచో మహారాక్షసు లుదయింతురు. ఇట్టి కథ శ్రీ కాళహస్తి మాహాత్మ్యమునందు కలదు.

అందుచేత ప్రజాపతి యీ స్త్రీ పురుష ద్వంద్వ లక్షణమును బురస్కరించుకొని మేకలను గొఱ్ఱెలను గుఱ్ఱములను సృష్టించెను అందుచేత నది ప్రథమ సృష్టియైనది. ఆ కథ కిచ్చట ప్రసక్తిలేదు.

ఇక్కడనున్న ప్రసక్తి యెంతవర కనఁగా నూర్వశి నారాయణ మహర్షి కూతురన్నంతవరకు. నరకాసురుఁడెవ్వడు? నరకాసురుఁడు భగవంతుడైన నారాయణుడు వరాహావతార మెత్తి నప్పుడు భగవంతునకును భూదేవికిని కలిగిన సంతానము అనఁగా వీఁడు నారాయణుని కుమారుఁడు. ఊర్వశి నారాయణుని కూఁతురు. వీరిద్దఱు నన్నయు చెల్లెలు. వీని కామె మీద మోహాము. ఇది రాక్షస ప్రవృత్తి.

ఒక దుష్టమైన యూహా యెందుకు కలుగును? వానియందు రాక్షస ప్రవృత్తి యుండవలయును. అది యెందుకుండును? వాని పూర్వజన్మ దుష్ట సంస్కార వశమున నుండును.

ఇట్టి యూహాలకు ఫలమెప్పుడును దుష్టముగానే యుండును.

వాఁడు దేవేంద్రాదులను గెలిచెను. చక్కగా స్వర్గము నేలుకొన వచ్చును. వానికి నాశన మాసన్నము కాఁబోవుచున్నది. వాని కూర్వశి మీద కోర్కె యున్నదని యెవ్వరికిని తెలియదు.

వాఁడు రత్నసింహాసనమునఁ గూర్చుండి "ఊర్వశిన్ దోడి తెమ్మ" నెను. ఈ మాట హఠాత్తుగా ననెను.

ఈ కవి నరకునిచేత నీ మాట నంత హఠాత్తుఁగా ననిపించెను.

అంత హఠాత్తుగా ననిపించిన దాని వ్యాఖ్యానమే పూర్వము చేయఁ బడినది.

ఆమెనుఁ దోడి తెమ్మని యొక్కనిఁ బంపెను. పది మంది వెళ్ళిరి. ఈ లోపుఁగా నరకాసురుఁడు గంధర్వుల సంగీతము వినుచు కూర్చుండెను.

> "తడవం బోయిన దైత్యులు
> పొడగని, యూర్వశి, తొలఁగి పోనేల? నినుం
> దోడి తెమ్మనె మారా జదె
> జడి బడి వచ్చెదరు వేగ పనిబను మనినన్.

వెనుకఁబోయిన రాక్షసు లూర్వశిని చూచినారు ఆమె తొలఁగి పోఁబోవుచున్నది—ఆమె తొలఁగిపోబోవుచున్నదన్న విషయము వీ రన్నదాని వలెనే తెలియవలెను—వారన్నారుకదా! "నినున్ దొడితెమ్మనె మారాజు." తొడితెమ్ము — ఈ శబ్దము నిజముగా తోడితెమ్ము అని యుండవలెను. కాని యీ కవి "తొడిగా" వాడినాఁడు. ఇతరకవులెవ్వరు నిట్లు వాడలేదు. 'తొడి' యన్న క్త్వార్థకము తిక్కనాదులు వేఱే యర్థమునందు వాడుదురు. యుద్ధ వీరులు యుద్ధమునకు బయలుదేరునపుడు "తొడిపూసికట్టి" అని వాడుదురు. 'తొడి' యనగా నిను ఏకవచనమునఁ దొడిఁగికొని యనియర్థము. తొడుఁగు అన్న ధాతువు చివరి 'గ'కారము పోయి తొడు ధాతువగును. దీనిమీద నుండియే తొడవు అన్నశబ్దము వచ్చెను. తొడవు అనగా నలంకారము. కట్టి యనఁగా దిండుకట్టి. శిరస్త్రాణము పెట్టుకొనుటకు తలచుట్టు దిండువలె పెట్టుకొందురు. పూసియనఁగా వీరగంధమునుఁ బూసికొనుట.

కాని నాచన సోమన్న 'తొడి తెమ్మనె' అని వ్రాసినాఁడు.

బడిబడి వచ్చెదరు. వెంబడివెంబడి వచ్చుచున్నారు. అనఁగా మారాజు నీకోస మెడతెరిపిలేకుండ మనుష్యులను బంపించున్నాడని యర్థము.

అనఁగా నామె 'దిట్ట'. అనఁగా గడుసరి. ఆమెకు భయమువేసినది.

ఎప్పుడు నరకాసురుఁడు స్వర్గమును జయించెనో ఎప్పుడు రాక్షసులు అమరావతిని దోచుకొనుచుండిరో యప్పుడే యామెయు భయపడెను. ఇంతలో నదేమి యిదేమియని నరకాసురుఁడు తనకోసమే కబురుపంపెను.

అంతకుముందే యామె నగలన్నియుఁ దీసివేసెను. తలలోని పూవులు పారవేసెను. మేనిగంధపు పూత రాల్చివేసెను. ప్రాతచీర కట్టికొనెను. రాక్షసునివద్దకు వచ్చెను. ఆమె పెదవులమీద సహజముగానున్న చిరునవ్వే లేదు.

> "దనుజేంద్రుఁ డా తలోదరిఁ
> గనుఁగొని చొల్లెంబునిమురు క్రమ్మనఁ బై కొం
> గనువుపఱుచు గేదఁగిరే
> కు నఖంబులఁ జీఱు గులుకుఁగోర్కులఁ దేలున్ !

ఈ పద్యము చాల చమత్కారమైన పద్యము. ఇట్లెవ్వరును వ్రాయరు. అచ్చు వేసినవారుకూడ సరిగా నర్థముచేసికొన్నట్లులేదు. అతనికి కులుకు కోర్కులు కలిగెను. ఆమె చొల్లెమ్ము నిమురవలెనని యామెపై కొంగు సర్దవలెనని యామెచెక్కిళ్లు గోళ్ళతో గీరవలయునని — యిక్కడ చెక్కిలి బదులు గేదఁగిరేకు వాడినాడు. ఉపమేయముఁబదులు ఉపమానమును వాఁడినాడు. ఇది రూపకాతిశయోక్త్యలంకారము.

ఈ పద్యములోనున్న సొగసేమనఁగా నిమురు, అనువుపఱచు, చీరు— ఈ మూఁడు అసమాపకక్రియలు కోర్కులు అన్నమాటకు విశేషణములు. అవి మూఁడును తద్ధితార్థక క్రియాజన్య విశేషణములు. నిమురు కోర్కి; అనువుపఱచు కోర్కి; చీరుకోర్కి. అని ప్రతి కవియును వ్రాయును. కాని యితఁడు మొదటి రెండువిశేషణములు వెనుక వదలిపెట్టి తరువాత నన్వయము చేయవలసిన గడుసుఁదనము వెలయించెను.

ఈ లక్షణమంతయు నూర్వశి చిత్తములో తెలిసికొనెను. ఎట్లు తెలిసికొనెను ? ఇదియొక యాశ్చర్యము. వాని కన్నులలో వాని భంగిమలలో వాని హస్తాదిచాలనములలో అట్లట్లుచేసెడి కాముకులను మున్నామె యెఱుగు గనుక నామె తెలిసికొనెనని యర్థము.

తెలిసికొని వానికిఁ దనయందు కోర్కికలదని యామె లజ్జను వహించెను.

వెనుకటిభయము పోయినది. ఇంతకు ముందువఱకు తెలియనిస్థితి. ఇప్పుడు తెలిసినస్థితి. అతఁడు తనయందు ప్రేమకలవాఁడని తెలిసినంతనే యామెకు సిగ్గువచ్చెను. ఆమెకు సిగ్గురాలేదు. ఎందుచేతననఁగా "పూనిన లజ్జన్" అని వ్రాసినాఁడు. లజ్జనామె పూనెను. ఆమెను లజ్జ పూనుకొనుట వేఱు. లజ్జ యామెనుపూనుట వేఱు. ఆమెను లజ్జ పూనెననఁగా నామెకు లజ్జ సహజముగా నుదయించెనని యర్థము. ఆమె లజ్జనుబూనెననఁగా ఆమె సిగ్గు నభినయించినదని యర్థము.

అంతనామె యేమిచేసినది ? ప్రక్కనున్న స్తంభము దగ్గఱకుబోయి యొక బొమ్మవోలె నిలుచుండెను.

నరకాసురుఁ డామెనుఁజూచి యిట్లనెను. "యుద్ధములో నింద్రుఁడు నాకోడిపోయెను, దిక్పాలకులందఱు పారిపోయిరి. వారివారి భార్య లెందుఁబోయిరో తెలియదు. నీవుకూడ నమరావతి నెందుకువదలిపెట్టినావు ? —ఆమె వదలిపెట్టి పోలేదుకదా ? లేదా ఆమె వదలిపెట్టి పారిపోవుచుండఁగా నా పంపఁబడిన రాక్షసుఁడు ఆమె నూరిబయట పట్టుకొన్నాఁడేమో — ఆ యర్థము దీనియందున్నది.

నీ వెందుకు పోవలయును ? నీవు పొత్తులదానవు. అనఁగా నీవొక్కని స్త్రీవికావు. పలుమంది వాంఛించతగినదానవు. పలుమంది నిన్ను వాంఛింతు రనికూడ నర్థము.

అతఁడు రంభకోసము పంపలేదు, తిలోత్తమకోసము పంపలేదు. మరి యెవ్వరికోసము పంపలేదు. ఒక్క తనకోసమే పంపెను. తన సౌందర్యమే యతనికి నచ్చెననియర్థము.

ఒకానొక స్త్రీయొక్క సౌందర్య మీరీతిఁగా నొకనికి నచ్చినచో నా స్త్రీ సంతోషపడునా ? పడదా ? పడునో పడదో యట్లుంచి యట్టివానిని తిరస్కరించఁగలదా ? వానియందొక యభిమానముండదా ? యుండును.

అతఁడు మరియు నిట్లనెను.

నాకపురమ్ములో మెఱసి నందనకేళిఁజరించి దివ్య కాం
తాకరతాల వృంత సముదాయ సమీరము సోఁక రాజ్యముం
గైకొని నేఁడు దిగ్విజయ గౌరవధన్యుఁడనైన నా సభన్
నీ కనుదోయి వెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే !

వాచన సోమన్న వ్రాసెడు ప్రతి పద్యమును జాగ్రత్తగా జూడవల యును. పై మూడుచరణములు తన గెలుపును దాను ప్రశంసించుకొను చున్నాఁడు. నాల్గవచరణములో రచన మెత్తపడినది. 'నీ కనుఁదోయి వెన్నెలలు నిండక' — ఆ యూర్వశియం దతనికిఁగల కోరిక యెంత సుకుమారమైనదో వ్యజ్యమానమగుచున్నది.

తనయందంత మెత్తనివలపుఁ గలవానిని ఊర్వశి యేమనఁగలదు ?

అని యతఁడు మరియు నిట్లనెను :

"అవిగో ! యింద్రుని రథములు. అవిగో ! కుబేరుని యేనుగులు. అవిగో వరుణుని గుఱ్ఱములు. అవిగో యముని యొక్క వీరావళులు. నా దైత్య భటులు దేవతల సొమ్ములన్నియుఁ దెచ్చినారు. వీనిలో నీ కేవి కావలసిన వానినిఁ దీసికొమ్ము.

తొలుత నీతో నిట్లు మంచిగామాట్లాడి చివరకు నిన్ను పరిత్యజించి పదిమంది స్త్రీలలో నీకు పరాభవముఁ దీసికొనిరాను. నీవు నన్ను పొందినచో నుభయలోక సుఖమ్ములు నీ లోఁగిట చేర్చుదును. ఆమె లోఁగిట—ఆమె యింటి యందు నుభయలోక సుఖములుచేర్చునట. అనఁగా నుభయలోక సుఖసాధ నములని యర్థము.

నరకాసురుఁ డిట్లనఁగా నామె యేమిచేయును ? ఆమె కతనియం దనురాగములేదు. ఆ సుఖము లామెకక్కఱలేదు. అతఁడు తన్నంత మెత్తగా

నూహించుచున్నాఁడు. ఆమె చింతాక్రాంతురాలైనది. ఏమిరా యీసృష్టి! అతఁడు నన్నింత ప్రేమించుచున్నాఁడు. అతనియందు నాకు ప్రేమలేదు. ఇతనికి నేనేమిచెప్పఁగలయును? అన్న దుఃఖమామె నావరించినది.

కాని యిప్పు డితనినుండి తప్పించుకొనుటయెట్లు ? ఇతని ప్రేమ యెంత నిజము? ఇది నిజముగా ప్రేమయా కామప్రవృత్తియా? ఆ రెంటిలో నేదియో తేల్చికొనినగాని తానొక నిశ్చయమునకు రాఁజాలదు. ఆమె యిట్లన్నది —

"చతురవచో విలాస గుణసాగర సాగరమేఖ లావనీ
పతియగు నీకు నింతులొక భ్రాంతియె! నీవిటు గోరుటెల్ల నా
యతులిత భాగ్య; మింతనిజ; మైనఁ గలంగకమున్న వైభవో
న్నతి మెఱయంగవచ్చి యొక నాఁడయినన్ నను గారవించితే."
నావుడు దానవేశ్వరుఁడు నవ్వుచు నూర్వశితోడ నిట్లనున్
"నీవిటు దూఱనేర్తువని నేరమి పెట్టితి గాక యేను మీ
దేవతలున్న వీటి కరుదెంతునె! మిండఱికంబుచేఁతకై ?
లావునరాక వేఱొక తలంపున వచ్చినఁ గీడుపుట్టదే?"

అతనిని పొగడినది. నేర్పుగల మాటలలో నిన్ను పోలెడువాఁడు లేఁడన్నది. సముద్ర పర్యంతముగల ధారుణికంతకు వాఁడే రాజన్నది. అని నామీద నీ కింత ప్రేమయున్నచో నీ వొక్కనాడైనను నావద్దకు వచ్చితివా అన్నది.

అతఁడేమన్నాఁడు ? నేను చక్రవర్తినిగదా ! ఈ పనికోసము నేను నా శత్రువుల యూరునకు రావచ్చునా? నే నెట్లు రాఁగలను ? నీవు నా యందు నేరమునుఁ జూపింతువుగాని. అనఁగా నామె నీవు రాలేవు సరే ! నాకు వార్త పంపినచో నేను రానాయన్నది.

దానికతఁ డింకేదైన సమాధానము చెప్పియుండవచ్చును. కాని యతఁడిట్లన్నాఁడు.

"పగవాఁడట దేవేంద్రుఁడు !
మగువా ! నీవతని కొలువు మానిసివట ! నిన్
దగవు చెడి పిలువఁ బనుచుట
మగతనమే ? యిట్టి లంజెమాటలు గలవే."

ఇంతవఱకతని ప్రేమ మధురముగా మెత్తగానుండెను. ఆమె చొళ్లెము నిమురుట, పైకొంగనువుబఱచుట, గేదగిరేకు నఖమ్ముల జీఱుట, కనుదోయి వెన్నెలలు — నేను కొఱగానివాఁడను గాను — ఉభయలోక సుఖమ్ములు నీలోఁగిట చేర్తును — నీవు నామీద నేరము పెట్టుచున్నావు — ఈ మాటల న్నియు నతనిగుండెలోని గాఢమైన వాంఛయు నతని వలపులోని మెత్త దనముఁ జెప్పుచున్నవి ఇచ్చటికి వచ్చునప్పటికి "ఇట్టిలంజెమాటలు గలవే?" అన్నాఁడు.

వెంటనే యామెకుఁదెలిసినది. అతఁడు తన్ను లంజెగాఁ జూచు చున్నాఁడు. ఆమెయొక్క మనస్సులోని సందేహమంతయు విడిపోయినది.

ఇంక వానిని మోసము చేయవచ్చును. ప్రేమ మెత్తదనము, అను రాగము, వానిలోని సౌకుమార్యము సర్వమును పోయినవి.

వానిది సుకుమారమైన వలపుకాదు. అచ్చముగా కామ ప్రవృత్తి, ధూర్తలక్షణముతో కలసియున్న కోర్కె.

ఆమె చక్కగా విచారించెను. ఇట్లనెను ;

"లంజియనౌదు నేను విను లావున నీ వమరేంద్రుగెల్చి న
న్నుంజెఱపట్టి తెమ్మని వినోదము చేసితిగాక చిత్తమె
ల్లం జెడియుండ రిత్తయొడలం జవిచేరునె ? చిల్కవోయినం
బంజరమేమి సేయ ? రసభంగము సంగతిలోన మెత్తురే ?

నవ్వులమాటలో నిజమొ నాకములోన ననేకకన్యకల్
మవ్వపుఁదీగెలందెగడు మానినులుండగ సంతనెన్నడో
జవ్వనమమ్ముకొన్న గడసాని ననుంగవయం దలంచితే
పువ్వులు వేడుకైనఁ గడి వోయిన వాళ్ ముడు వంగవచ్చునే ?

ఆమె వెంటనే యామాటనే యంది పుచ్చుకొన్నది. నేను లంజియ నౌదును. ఇక్కడనొక చమత్కారమున్నది. ఇది చాల సూక్ష్మమైనది.

మహాకవు లాలోచించి వ్రాయుదురు. నిజమైన భావుకుఁడు వాని నాలోచించవలయును. ఎగురగొట్టఁ దలచినచో నన్నియు నెగురగొట్ట

వచ్చును. సంస్కృతములో "లంజా" యన్న శబ్దమున్నది. 'చ', 'జ' లు దంత్యములు, తాలవ్యములునని రెండు విధములు. దంత్యమనఁగా దంతముతో నుచ్చరించెడిది. తాలవ్యమనఁగా దవడతో నుచ్చరించెడిది. తెలుఁగులో దంత్యములైన చ, జ లకు పైన తెలుఁగు రెండంకె వేయుదురు. (చ, జ) యిట్లు.

తెలుఁగులో అకారముతోకూడిన చ, జ లు దంత్యములుగాని తాలవ్యములుకావు. సంస్కృతములోనున్న లంజా శబ్దమును సీతా వసుధా మొదలైన శబ్దములవలె చివరిదీర్ఘమును దీసివేసి తత్సమములు జేసినచో నున్నదున్నట్టు లుచ్చరించినచో తెలుఁగులో 'అ'కార సహితమైన తాలవ్య 'జ'కారము వచ్చును. తెలుఁగు దానిని సహించదు. అందుచేత దానిని 'లంజ' యని యుచ్చరించవలెను.

ఇట్లుండఁగా సంస్కృతములోనున్న లంజా శబ్దమునకు రెండుమూడర్థములు కలవు. ఆ యర్థములలో రంకుటాలన్న యర్థముకూడ కలదు. శబ్దరత్నాకర కారుఁడు దంతముకాకుండ తత్సమము చేసి యీ యర్థమును వ్రాసినాఁడు. అది పొసగదని కాబోలు! తెలుఁగులో 'ఎ' కార సహితమైన యీ 'జ'కారముతో లంజెయను శబ్దము వచ్చినది, ఇది నిజమైన తెలుగుమాట. 'అ'కారముతోకూడిన 'జ'కారముతోడి యీ శబ్దము తెలుఁగులో నెవ్వరు వాడినట్లులేదు.

రాజన్ శబ్దము సంస్కృతమున నున్నది. తెలుగులోనికి వచ్చునప్పటికి రాజు అను దంత్యమై యూరకొన్నది. ఈ 'లంజె' యన్న శబ్దము ఎకారాంతము. అచ్చ తెలుఁగు శబ్దములో ఎకారాంత శబ్దములకు వైకల్పికముగా 'ఇయప్' ప్రత్యయముకూడ వచ్చును. గడె – గడియ ; విడెము – విడియము ; పల్లె – పల్లియ ; ఈ రీతిగా లంజె – లంజియ అగును.

ఈ రెండు శబ్దములలో 'లంజె' యన్నమాట యూరికే యన్నటులుండును. లంజియా యన్నమాట యూది పలికినట్లుండును. ఊర్వశి యీ మాటను తాను సహించలేదన్న లక్షణము ఈ పద్యము లంజెయన్నమాటలో మొదలుపెట్టుటలోనున్నది. ఇది పరమ సూక్ష్మమైన విషయము. శబ్ది

ప్రయోగములోని గడుసు లోతులు తెలిసినగాని యిది తెలియదు. నీవు నన్ను చెఱపట్టి తెమ్మని పంపితివి. ఇది నీకు వినోదము. నా మనస్సు చెడి యున్నది. నా శరీరము చిలుక లేచిపోయిన పంజరమువలె నున్నది. ఈ మాటలన్నది. ఇది చాల సాహసము. ఇంద్రుని యోటమి తనకంత కష్టముగా నున్నదని యర్థము. దీనిని నరకాసురుఁడు మెచ్చునా? అనుటకామె సాహసించినది.

ఎందుచేత ? వాఁడు మరులుకొని యున్నాఁడు. అట్టివానితో నెట్లయిన ననవచ్చును.

తన జవ్వనమెప్పుడో యంగడిలో నమ్ముకొన్నదఁట ! – అనఁగా నీవు నన్ను లంజెవన్నావుకదా ! నేనిదివఱకే లంజియను. నా వలన నీకేమి సుఖము ?

అనఁగా నతఁడు—

"అంజెదవుగాక నను( జెం
తంజేరఁగ నీక యెంతదఱిఁగిన మిరియా
లుం జొన్నల సరిపోవే
లంజెతనములందుఁ గొమిరెలన్ గెలువవటే."

ఇది ప్రసిద్ధమైన పద్యము. నీవెంత యౌవనము నంగడిలో నమ్ముకొన్నదానవైనను నీ లక్షణము వేఱు. అని యిచ్చట లోకోక్తిని సంగ్రహించినాఁడు. 'ఎంత తఱిగిననైనను మిరియాలుం జొన్నల సరిపోవే' యని ఇట్లు లోకోక్తులను సంగ్రహించుట తెలుఁగు కవిత్వములోనొక సొగసని జనులు భావింతురు. ఈ లోకోక్తులలో కొన్ని గడుసువికలవు. అందులో నిదియొకటి. మరియు నీ లోకోక్తి యితనివలననే లోకోక్తులలోనికి వచ్చినదేమో తెలియదు. నీవెంత ముసలి లంజియవైనను పడుచు లంజెలను గెలువలేవా యన్నాఁడు.

ఇప్పుడేమైనది. తొలుతటి ప్రేమయొక్క సౌకుమార్యము, మెత్తఁదనము, లోతు అన్నియుపోయి వట్టి కామ ప్రవృత్తి క్రిందకు దిగినది. దీనిని చక్కఁగా నేడిపించవచ్చును.

వీఁడొక వ్యామోహములో పడియున్నాఁడు. తేలికఁగా వీనిని మోసము చేయవచ్చును.

అందుకని యేమన్నదనఁగా: నీకింద్రుఁడోడినాఁడు. నీవతనిని గెలిచితివి. అతని రాజ్యముకూడ నీకే వచ్చినది. కాని నీయందొక్కటియే లోపము కనిపించుచున్నది. ఆ యింద్రుడు హవిర్గ్రహీత. యజ్ఞ యాగాది క్రతువులలో హవిస్సునాతఁడు గ్రహించును. ఆ పని నీవు చేసినచో నప్పటికి నీవు సంపూర్ణముగా నింద్రుడవగుదువు.

"యాజకులు యజ్ఞ భాగ
భ్రాజిష్ణునిఁ జేయ నిన్ను భావజ సౌఖ్యా
వ్యాజపద రాజుఁ జేసెదఁ
దేజముసూ వలపు దెలుపుఁ దెఱవలకెందున్."

భావజసౌఖ్య పదరాజును జేసెదనన్నది. ఈ సమాసములోనొక వింత యున్నది. సౌఖ్యావ్యాజ పదము వఱకు సంస్కృత శబ్దములు. రాజు తద్భవ శబ్దము· తత్సమముకాదు. తత్సమము సంస్కృత శబ్దము ; తద్భవము తెలుగు శబ్దము. నిన్ను తత్పదాధిపతినిఁ జేయుదును మొదలైనట్లుండవలయును. పదరాజు అని సమాసము చేయకూడదు. కాని యాయన చేసినాఁడు యథార్థముగా విచారించినచో దీనికి గతిలేదు· కాని మహారాజు అని యున్నది. ఇది మహారాజ శబ్దమునకే వికృతి యనవచ్చును. ఇంత సమాసముమీద నిచ్చటనట్లనరాదు.

అని నరకాసురుఁడామెకు తానట్లుచేయుదునని యొడంబడి యామెను పంపించి – తరువాతి కథయున్నది. ఇతఁడు ఋషులను బాధించుట, వారు పోయి శ్రీకృష్ణ దేవునితో జెప్పుకొనుట, శ్రీకృష్ణుడువచ్చి నరకాసురుని సంహరించుట.

అద్యంతమీకథా స్వరూపమిట్టిది. కవులు వీనినన్నింటిని చెప్పరు. పాఠకులు వట్టి పద్యములు చదువుకొంచు బోవుదురు. బాగుగానున్న పద్యములు గొన్నిఁటిని, తెస్సగానున్న పలుకుబడుల కొన్నిటిని మాటిమాటికి చెప్పికొనుచు నా· కావ్యములు తాము చదివినట్లు తలంతురు. అది యంత న్యాయముగాదు.

ఈ యుత్తర హరివంశము వ్రాసిన గ్రంథకర్త పేరు నాచనసోమన్న. ఇతఁడు వ్రాసినదొక్కటియే పుస్తకము.

ఈయనను కొందఱు తిక్కనగారికంటె కూడ గొప్పకవియని చెప్పుదురు. ఇతని కథా కథనము చిత్రచిత్రములుగా నుండును. ఇతఁడనేక విషయములను దాచి చెప్పుచుండును. "అన్యదాలోచనామృతమ్." కవిత్వమాలోచించినకొలఁది యమృతప్రాయము కావలెను. ఆలోచనయక్కఱలేనిది కవిత్వమగునో! కాదో!

## అర్జునుని పాశుపతాస్త్ర సంపాదన కథ

ఈ కథ భారతములో ప్రసిద్ధమైనది. అర్జునుఁడు భారతవీరులలో నందఱకంటె నధికుఁడగుటకు కారణమతని వద్దనున్న పాశుపతాస్త్రము. ఇంతకంటె మహాస్త్రము లేదు. ఉండదు.

మన పురాణ ప్రపంచకములో దీనికిఁదీటైనది శ్రీ విష్ణుమూర్తి యొక్క సుదర్శనచక్రమొక్కటియే! మన పురాణములలో శివకేశవులు యుద్ధము చేయుటకూడ నచ్చటయున్నది. అప్పుడు శివుఁడు పాశుపతాస్త్రము ప్రయోగించినచో శ్రీమన్నారాయణుఁడు సుదర్శన చక్రము ప్రయోగించును. అప్పుడు లోకములన్నియు సంక్షోభించును. బ్రహ్మేంద్రాదులువచ్చి వారిని ప్రార్థింతురు. వారు వానినుపసంహరింతురు.

అట్టి పాశుపతాస్త్రము శివునివద్దనే యున్నది. ఆ యస్త్రముయొక్క సమంత్రక ప్రయోగము శివున కొక్కనికే తెలియును. శివుఁడు తత్పూర్వమునందుఁగాని తత్పరమునందుగాని యీ పాశుపతాస్త్రము నెవ్వరికి నీయలేదు. ఈయలేదు—ఈయడు.

శ్రీ మహావిష్ణువు తన సుదర్శనాయుధమును ప్రయోగించిన సందర్భములనేకములుగలవు. శివుఁడు తన పాశుపతాస్త్రమెన్నడు నెవరిమీద ప్రయోగించలేదు.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో బ్రహ్మ సృష్టికర్త. విష్ణువు స్థితికర్త. శివుఁడు లయకారకుఁడు. మహాప్రళయకాలమునందు సర్వసృష్టిని లయము

చేయుటకొఱకు శివుఁడా పాశుపతాస్త్రమును ప్రయోగించును. దాని శక్తి యంతటిది.

శ్రీమన్నారాయణుఁడు తన సుదర్శనాయుధమునెప్పుడు నెవరికీయ లేదు.

శివుఁడే సృష్టిలో నీ యనంతకాలములో నిన్ని మహాయుగములలో నిన్ని కల్పములలో నా పాశుపతాస్త్రమును అర్జునునకొక్కనికి మాత్ర మిచ్చెను.

భారతయుద్ధము జరిగినది. ఆ యుద్ధములో నర్జునుఁడు పలుసార్లు చికాకు పడెను. ఒకప్పుడు కర్ణుని చూచి భయపడెను.

అర్జునుఁడు తనవద్దనున్న పాశుపతాస్త్రమును ప్రయోగించి కౌరవ సైన్యమునంతయు కన్నుమూసి కన్ను తెఱచునంతలో దగ్ధముచేయగలఁడు. కాని యాయన యట్లు చేయలేదు. కారణమేమి ? ఆయన యంత నియమ వంతుఁడు. అంత నిగ్రహముకలవాఁడు. అంత శీలవంతుఁడు, అంతతపశ్శాలి.

ఆయన నిత్యుఁడైన నరుఁడన్న మహర్షి.

పాశుపతాస్త్రము శివునిచేతిలో నెంత భద్రముగానున్నదో యర్జునుని చేతిలోనంత భద్రముగానున్నది.

అర్జునుఁడిట్టి వాఁడని తెలిసియే శివుఁడీ పాశుపతాస్త్రముతనికిచ్చెను.

కనుకనీ పాశుపతాస్త్ర సంపాదనమెట్టిది ? ఆ యస్త్రము తనదగ్గఱ నున్నదన్న గొప్పకేతప్ప మరియొకందుకుగాదు. ఆ యస్త్రముతనివద్ద నున్న దని పరులు భయపడవలెను. భక్తితోనుండవలయును. మరియొక కారణము కనిపించుటలేదు

శివుఁడు తన పాశుపతాస్త్రమును సృష్టిలో నెవ్వరికినీయఁడు కదా ! అర్జునునకెందుకిచ్చెను. అర్జునుఁడు తనయంతటివాఁడని శివునకు తెలియును కాబోలు ! ఇది రహస్యము.

అర్జునుఁడు శివునియంతటివాఁడు. శివుఁడు మాత్రముకాదు.

ఈ రహస్యము తెలియనిచో నీ కథలోని రహస్యము తెలియదు.

లోకములో ననేకులు కవులుందురు.

ఒకకవి ఘట్టములను విస్తరించి ప్రసంగములను పెంచి లోకములోని వ్యవహారమునందలి తన పరిజ్ఞానమును వెల్లడించును.

మరొకకవి వర్ణనాభాగములను విస్తరించి వ్రాసి "ఆహా!" పుట్టించును.

మరియొకఁడు లోకములోని రాజకీయములు సాంఘికములు తాను వ్రాసెడి కథలో చొప్పించి యనఁగా దానియందారోపించి యది యొక వ్యాఖ్యానముగా చేయును.

వేఱొకఁడు మానవ హృదయాంతర్దేశమునందలి లోతైన స్పందనములను విచిత్రముగా వివరించును.

ఇవి యన్నియు కొంఁది కొంఁదిగా భాసించు రచన చేసెడి కవులు కూడ నున్నారు.

ఈపైన చెప్పిన సంగతులయొక్క స్పర్శయే లేనివాడు కవియే కాడు. కవి యనిపించుకున్న ప్రతివానియందు నీపై చెప్పిన లక్షణములలో నొకటియో రెండోమూడో యుండుచునే యుండును.

వీరందరను మించిన యొకకవి యున్నాడు. వానియందుఁగూడ నీ లక్షణములుండును. కాని వీనియన్నింటిని మించిన మహాలక్షణమింకొకటి యుండును. తాను తీసికొన్నకథ యెట్టిది? దాని స్వరూపమెట్టిది? దానిలో నున్న రహస్యమెట్టిది? ఆ మహాకవి ఆ మహావిషయము ధ్వనితమగునట్లు వ్రాయును. దానికి ప్రాధాన్యమిచ్చును. వాఁడు ఋషి వంటివాఁడు. తత్త్వము తెలిసినవాఁడు. తక్కినవాండ్రు కవిగాండ్రు.

మన తెలుఁగు పురాణ కావ్యములలో కొన్ని కొన్ని కథలు ఎక్కువ మంది కవులచేత వ్రాయఁబడి వున్నవి. బాణాసుర కథయున్నది. భాగవతములో నున్నది. ఉత్తర హరివంశములో నున్నది. శివపురాణమందున్నది. ముప్వరు కవులు వేఱువేఱే.

ఇప్పుడీ పాశుపతాస్త్ర సంపాదనకథయున్నది. భారతములోనున్నది. శ్రీనాథుఁడు రచించిన హరవిలాసము నందున్నది. ధూర్జటి వ్రాసిన శ్రీకాళహస్తి మాహాత్మ్యమునందున్నది.

ఇప్పుడు మనము శ్రీనాథ ధూర్జటులు వ్రాసిన కథలను సరిపోల్చి యిద్దఱుకవుల ప్రవృత్తులెట్లుండునో వారెట్లూహింతురో హెచ్చుతగ్గులెట్లుండునో కొంతచూచి కొంత కవితా పద్ధతులను విచారించుకొనవచ్చును.

ఒకానొక విషయమును ఇద్దఱు రెండువిధములుగా చెప్పుదురు. ఒకఁడు తేల్చి చెప్పును. ఒకడు దానిని విస్తరించి చెప్పును.

అర్జునుఁడు తపస్సు చేయుచున్నాఁడు, అతఁడు తపస్సు చేయుచుండగా అతనికి 'వినంబడెన్ శ్రవ్యమ్ములై కుర్కురప్రకరోదంచిత కంఠనాళ కుహళీ భౌభౌ నాదముల్.'

ఇది హరవిలాసములోనిది. వినబడెన్ శ్రవ్యమ్ములై రెండు నేకార్థకములు. ఈ రెండు మాటలక్కఱలేదు. ఒకటి చాలును.

కాని ఒకఁడు విశేషార్థమును చెప్పుటకు పూనుకొనును. కొన్ని విధములుగా నెప్పుడు పట్టిన నప్పుడు సమర్థించుటకు వీలుండును. ఇక్కడనిట్లు చెప్పుదము, చెవులకు వినిపించినవి అని యర్థము. చెవులకు వినిపించక మరి యే యింద్రియములకు వినిపించును? అని ప్రశ్న. విన్నట్లు భ్రాంతిపడినచో ఆ భ్రాంతి చెవులకు వినిపించనక్కఱలేదు. అందుచేత శ్రవ్యమ్ములై యన్న మాట యవసరము.

నీవీ యర్థము చెప్పితివికదా! ఇచ్చటనిది భ్రాంతికాదని చెప్పవలసిన యవసరమేమున్నది? ఎంతయో యున్నది.

అర్జునుఁడు మానవుఁడు. శివుఁడు పరమేశ్వరుడు. మానవశరీరము పంచభూతాత్మకము. శివమూర్తి పంచభూతాత్మకముకాదు. అది వట్టి తైజసము. పంచభూతాత్మకమైన శరీరమునుండి వినిర్గమించిన ధ్వనియే శ్రవణగోచరమగును. ఇప్పుడు శివుఁడు మాయా కిరాతవేషము వేసికొని వచ్చెను. ఆయనవెంట వేదములు కుక్కలై వచ్చెను. ఆ భౌభౌ మహారావములు అర్జునునకు చెవులకు వినిపించెను. శివుఁడు పంచభూతాత్మకమైన శరీరముతోనే వచ్చెను. వేదములును నిజముగా కుక్కలుగనేవచ్చెను. ఇది యెట్లుసాధ్యము? అన్న ప్రశ్న.

ఈ పంచభూతాత్మకమైన సృష్టిచేసినది పరమేశ్వరుఁడు. ఇది యతని చేతిలోనున్నది, అతడు సృష్టించును, పెంచును, సంహరించును. ఈ లోకము

కొఱకు నీ మూడు కార్యములు జరుగుటకొఱకు పుట్టినదిమొదలు వాని యిష్టముప్రకారము వందయేండ్ల వఱకో అంతకుమించియో యీకార్యమును కొనసాగించుచుండును. సృష్టిలయము లొకప్పు డైక కాలికముగాచేయును. పెరుగుటకు మన కాలముప్రకారము కొంతకాలము పట్టినట్లు కన్పించును.

గర్భములో శిశువేర్పడి పుట్టి పెరుగును. ఏర్పడుటకు కర్తయెవరు? గర్భములో పంచభూతములు పిండముగా నేయేపాళ్ళలో నుండవలయునో యాపాళ్ళను నిర్ణయించిన వాడెవఁడు? అందులో జీవుని ప్రవేశపెట్టినవాఁ డెవఁడు?

పంచభూతము లతని యదుపులోనున్నవి. అతని యిష్టము వచ్చినట్లు చేయును.

అందుచేత శివుఁడు తనంతటతాను పంచభూతాత్మకమైన కిరాతాకృతి దాల్చగలఁడు. వేదములను వేటకుక్కలవలె మార్చఁగలఁడు. అది జరిగినదని యర్థము.

అందుచేత వేదములు కుక్కలగుట నిజము, భౌభౌ అని యరచుట నిజము. అర్జునుఁడు వినుట నిజము. నిజమనఁగా లౌకికమైన నిజము అని యర్థము.

ఇక్కడ శ్రీనాథుఁడు కుక్కలైన వేదములను వర్ణించెను.

చాయ గోసులకంటె కేసరులకంటెఁ
బులులకంటెను బిరుసలై పొగరు మిగిలి
జల్లుకొనివచ్చెఁ బైపైని సారమేయ
యూథములు వేదమయమూర్తు లుద్ధతముగ.

ప్రకటలీల నుదాత్తంపు ఫణితిఁ గొన్ని
క్రమముతో ననుదాత్తస్వరములఁ గొన్ని
స్వరితములఁ బ్రచయంబుల వరుసఁగొన్ని
ఘోషణము సేయఁదొడఁగె నా కుర్కురములు.

ఈ పద్యములలో వేదలక్షణములైన యుదాత్తానుదాత్తస్వరిత ములనుపెట్టి కుక్కలరావములను వర్ణించెను. ఈపని ధూర్జటిచేయలేదు.

దీనివలన విశేషమేమి? ఈ ఉదాత్తానుదాత్త స్వరితలక్షణములు కలిగిన యీ కుక్కల ధ్వనులను అర్జునుఁడువిని వానిని వేదములుఁగా పోల్చుకొనెనా? పోల్చికొన్నచో వచ్చినకిరాతుని శివుండని గ్రహించెడివాఁడు. అందుచేత నర్జునునియందా విశేషములేదు. లేదనిచెప్పుటకు వ్రాసెనా? ఊరకయే వ్రాసె ననవలయును.

కాని శివుఁడు కిరాతుడయ్యెను, యెట్లయ్యెను, ఆ వేషము నెట్లు మార్చెను? కిరాతునకు శివునకు నేవియో సామ్యము లుండవలయును.

(శ్రీ)నాథుఁ డీ పద్యమును వ్రాసెను.

వికటపాటల జటామకుటికా భారంబు
కలుకైన జుంజులు నెలులుగాఁగఁ
జారు సుధామ శకలావతంసంబు
పెడ కొప్పుపై నుండు పీఁకెగాఁగ
ఘన లలాటంబునఁ గనుపట్టు కనుచిచ్చు
గైరికద్రవ తిలకంబుగాఁగఁ
భుజ మధ్యమునఁ గ్రాలు భుజగ హారంబులు
గురిజ పూసలగుబ్బ సరులుగాఁగ.

దీనినే ధూర్జటి —

జడకొప్పు కేకిపింఛపుఁ ద్రాటిచుట్టగా
బిసరుహాహిత రేఖ పీఁకెగాఁగ,
నెగలుచల్లెడు కన్ను జేగురు బొట్టుగా
శ్రుతిఫణి యౌషధ లతికగాఁగ
మెడను బున్కలపేరు మేటి తామరులుఁగాఁ
దోలుదుప్పటి యొడదోలుగాఁగఁ
జేతిపినాకంబు నెలవింటి బద్దగా
శూలమేర్చిన యంపకోలగాఁగఁ

రెంటిని పోల్చిచూచినచో నూహ యొక్కటియే. కల్పనలో గూడ సామ్యమేయున్నది. మాటలువేఱు. కూర్పువేఱు.

చదువరి అనగా పాఠకుఁడు కవితావిద్యలోనున్న పట్టుగలిగిన ప్రథమ దశా స్వరూపమును దెలిసినచో దీనికాశ్చర్యపడడు. సంతోషించును.

ఇది మహాకథను పోషించు ననేకవిషయములలో నొకటి; యంతకు మించి యేమియును లేదు.

ఇచ్చట ధూర్జటి యొకపద్యమును వ్రాసెను.

"కాకోలాశనకృత మా
యా కోలము సేయఁదొడఁగె నలజడి, ముని రా
జీ కోలాహల మెసఁగఁగ
నా కోలాంగూల కేతు నాశ్రమ భూమిన్."

ఈ పద్యములో చివరి చరణములో నర్థముపొసగుట కష్టము. అర్జునుఁడు కపిధ్వజుఁడు. కపియనఁగా కోతి. కోతికి గోలాంగూలమని పేరు. కోలాంగూలము కుదురదు. లాంగూలము తోక, గోవువంటి తోక కలది కనుక కోతికి గోలాంగూలమని పేరువచ్చినది.

సంస్కృతములో ననేకములైన నిఘంటువులుకలవు. ఏ నిఘంటువులో నైన కోతికి కోలాంగూలమని యున్నదేమో తెలియదు. కాని ప్రౌనుదొర పాఠము —

"నౌకోలాంఛన తపోవనాంతర భూమిన్" అనియున్నది

న + ఓకః—నౌకః; ఓకః—స్థానము, ఇల్లు; ఔకః అనికూడ ననవచ్చును. నౌకః అనగా ఇల్లులేనిది. కోతికి వనచరమని పేరుగదా! కనుక నౌక శ్శబ్దమునకు కోతియని చెప్పుకొనవలయును.

అర్జునుఁడు బాణమువేసెను. శివుఁడు బాణమువేసెను. బాణములు తగిలి పంది తిరిగినలక్షణము నిద్దఱును వర్ణించిరి.

శ్రీనాథుఁడు సంస్కృత శబ్దములతో వర్ణించెను. ధూర్జటి కొన్ని తెలుఁగు శబ్దములనుఁగూడ కలిపెను.

ఇచ్చట కొన్నిమాటలు ఆయనయు వ్రాసెను ఈయనయు వ్రాసెను. ఆయనమాటలలో కొంత చమత్కారమున్నది. ఈయనమాటలలో కొంత చమత్కారమున్నది

యుద్ధము చేయకముందు శివునిచేత శ్రీనాథుఁడు చాలమాట లనిపించెను. అర్జునునిచేత సమాధానము చెప్పించెను. శ్రీనాథుఁడు కథను ప్రధానముగా వ్రాయుచున్నాఁడు. అందుచేత పెంచినాఁడు. ధూర్జటి కన్నప్ప పూర్వజన్మ కథగా చెప్పుచున్నాఁడు.

యుద్ధమును ధూర్జటి యిట్లు వర్ణించెను.

సూనశరారి యున్న ముచిసూదన పుత్రుడు, దివ్యబాణ సం
ధానమున న్మహాహవము దర్పమెలర్ప నొనర్ప నొప్పి రిం
తైనఁ గొఅంతలేక తమయందలి తేజము మిన్నుముట్టఁగా
భానుఁడు భానుఁడుం జటులభాను పరంపరఁ బోరుకై వడిన్.

భానుశబ్దము రెండుసార్లు వచ్చినది. ఒక భానునకు సూర్యుఁడని యర్థము. రెండవభానునకు శివుఁడనియర్థము. శివునికిగల పేర్లలో భానుఁడని కూడ నున్నది. శివుఁడును సూర్యుఁడును పోట్లాడుకొనినట్లని యర్థము వచ్చును. కాని యిచ్చట యిద్దరిలో నొకఁడు శివుఁడే. రెండవవాఁడు సూర్యుఁడుకావలెను. అతఁడర్జునుఁడు.

సూర్యుఁడును శివుఁడును పోట్లాడుకొనిరి. సూర్యుడగ్నిమండలము. శివుఁడుకూడ రుద్రుడు. ఆయనయు మహాగ్ని మండలము. ఇక్కడ నర్జునునకు పట్టి పోలిక కావలయును. కాని మరికొంత లోతుపోయి చూచినచో నిది చమత్కారముగా నున్నది.

శివుఁడు సర్వజీవ సమాహారభూతమైన వేల్పు. శాకల్య బ్రాహ్మణములో నొకప్రశ్న యున్నది. రుద్రులెంతమంది ? అని శాకల్యుఁడడుగఁగా యాజ్ఞవల్క్యుడు పదునొకండుమందియని చెప్పెను. కర్మబుద్ధి, అయిదింద్రియములు, అయిదు ప్రాణములు. కర్మబుద్ధులు ఆత్మమనస్సులు కలసియొకటి. వీరు పదకొండుగురు రుద్రులని తాత్పర్యము. అర్జునుఁడు నరుఁడు. ఈ పదునొకండు లక్షణములు ప్రతినిధిభూతములై యున్న పురుషుఁడు. కనుకనిచ్చట భానుఁడు భానుఁడున్ అనఁగా ఇట్టిశివుఁడు నట్టిశివుఁడునని యర్థమని చెప్ప వచ్చును. ఈ వ్యాఖ్యానము సుంతదూరమైనది.

చివరకు నర్జునుఁడు, శివుఁడు పార్థునిబాణముల నింకించగా గాండీవముతో శివుని శిరస్సుమీదఁగొట్టెను. ఇచ్చట శ్రీనాథుఁడు పెద్ద పద్యము వ్రాసెను.

కఱకు వెంద్రుకలలోఁ బఱచు మందాకిని
సుకుమారదేహంబు స్రుక్కఁబాఱె
నవతంస కుసుమమాల్యంబైన శశిరేఖ
బ్రహ్మ కపాలరంధ్రమునఁ దూఱె
నెట్టియంబుగ బిగ్గఁజుట్టిన పెనుఁబాము
బిగియూడి నొసలిపై డిగఁగజాఱె
నలిక నేత్రముకిత్తి యారజ్యమానమై
తెప్పలసందుల నిప్పు లుమిసె

నగజభయమందెఁ బ్రమథులు బెగడుగుడిచి
రుపనిషత్తులు ఘోషించె నొక్కపెట్టఁ
గాలకంఠుని మౌళి శృంగాటకంబు
గాండివంబునఁ దాడింప పాండవుండు.

ఇట్టి పద్యమును ధూర్జటి వ్రాయలేదు. వ్రాయవచ్చును. ఇద్దఱును శైవులే. ఇద్దఱును శివభక్తులే! కాని శ్రీనాథుఁడిట్టి వర్ణనల వైపునకు మొగ్గును. ధూర్జటి మొగ్గడు. ఇట్టి వర్ణనలవలన పాఠకునిమనస్సు కొంచెము చక్కలిగింత పెట్టఁబడును. అధికమైన ఫలములేదు. కథలో నొకయంశమును కొంచెము పెద్దదిచేసి వర్ణించుట. దీనివలన శివునకుకలిగిన బాధలేదు. ఆయనకు నలంకారములుగానున్న వస్తువులు కొంచెము క్లేశముపొందెనని చెప్పుట. చెప్పుట రమ్యముగానున్నది. అంతవఱకే. మరియు చివర గీతపద్యములో మొదటి రెండుచరణములు కొంచెముత్ప్రేక్ష. వానివలన నొకవేళ నర్జునుని పరాక్రమ మతిశయముగా భాసించునని చెప్పినచో చెప్పవచ్చునుగాని యిచట శివుఁడు పార్థుననుగ్రహించుటకు వచ్చెను.

ఇద్దఱును మల్లయుద్ధముచేసిరి. ఇద్దఱును మల్లయుద్ధమును వర్ణించిరి ఇద్దఱు చెఱియొకవిధముగా చేసిరి.

శ్రీనాథుని మల్లయుద్ధవర్ణనలో తిక్కనగారి మాటలు కొన్నికలవు.

స్వామి ప్రత్యక్షమయ్యెను. హరవిలాసములో సార్వవిభక్తిక స్తవ మున్నది. ఇది యుదాహరణ కావ్యసంబంధమైనది. ఉదాహరణ కావ్యము కొంత దేశిసంబంధమైనది. శ్రీనాథునకు దేశికావ్యములయందు దేశ్యములైన కొన్ని యాచారములయందు మక్కువయెక్కువ. శ్రీనాథుని యర్జునుఁడు పాశుపతాస్త్రమును మాత్ర మడిగెను. ధూర్జటి యర్జునుఁడు ముక్తి రమణీ హృదయేశత్వముకూడ నడిగెను. ఇది భేదము. ఈ సంగతి మొట్టమొదట విచారింపబడినది.

ఈ సామ్యము చెప్పుటవలన ప్రయోజనమేమి ? యనఁగా కవితా రచనలో భిన్నకవుల దృష్టులు భిన్నముగానుండును. భిన్నకవుల రుచులు భిన్నముగానుండును. ఒకఁడొకచోట పెంచి వ్రాయును. ఒక డింకొకచోట పెంచివ్రాయును. ఒక వర్ణనాశక్తి మిక్కిలిగా లేనిచో వాఁడు కవియే కాదుగదా ! ఈ వర్ణనాశక్తి ప్రధానముగా రెండువిధములుగా నుండును. ఒకటి ప్రసంగమును పెంచుట. రెండు విషయములను ప్రపంచించి చెప్పుట.

ఇప్పు డేమగుచున్నదనఁగా ఒక కవియొక్క గొప్పదనమును నిర్ణయించ వలయుననఁగా రెండే విషయములు మిగిలినవి. మొదటిది అతఁడు తీసికొన్న కథలోని పరమార్థమాతనికి గాటముగా తెలిసి వ్రాయుట. ఇది పరమోత్తమ మైనది. రెండవది ఆ కవియొక్క శైలి – అతనిరచన - అతని యక్షరగుంఫన చాతుర్యము. ఈ రెండవదానికి సహజముగా ప్రాచుర్యము వచ్చుచున్నది.

శ్రీనాథ ధూర్జటులలో శ్రీనాథునకున్నంత ప్రతిష్ఠ ధూర్జటికిలేదు. కాని కొన్నిచోట్ల ధూర్జటి నాచనసోమన్నయెత్తిన యెత్తుగడ లెత్తఁగల వాఁడు. నాచన సోమన్నకూడ నచ్చముగా నతని శిల్పశక్తిచేత ప్రసిద్ధికి వచ్చినవాఁడుకాడు. అతనికొక ప్రత్యేకమైన రచనాసామర్థ్య మున్నది. దానిని పురస్కరించుకొని వచ్చినవాఁడు.

పాఠకుఁడు కావ్యములను పరిశీలించిచూచి భిన్నశైలీ పద్ధతులను విచారించి రసానుభవమును పొందవలయును. ప్రసిద్ధులైన కవులందఱియందు పాఠకునియం దానందము సమకూర్చు కొన్ని లక్షణములుండును. కొందఱికి కొన్నిటియందు మమకారము హెచ్చు. ఈ మమకారము ఇతరకవుల గుణములయందు వాని నంధునిచేయరాదు. విషయములు సర్వంకషముగా తెలియవలయును. అప్పుడనుభూతమగు నానందమందు భేదముండును. అప్పు డల్పకవులు మహాకవులుగా భాసించరు.

# విజయ విలాసము

ఈ గ్రంథమును వ్రాసినకవి చేమకూర వేంకటకవి. ఆయన రెండు గ్రంథములు వ్రాసెను. మొదటిది సారంగధర చరిత్రము. రెండవది యిది. ఈ కావ్యములో ననేకములైన శ్లేషలు, చమత్కారములు, స్ఫూర్తులు, అన్యార్థములు కలవు. త్రవ్వినకొలంది క్రొత్తక్రొత్త యర్థములు పుట్టును. దీనికి "పిల్లవసుచరిత్రము" అనిపేరు. శ్లేషార్థములను పురస్కరించుకొని వచ్చిన పేరేగాని మరియొకటికాదు. వసుచరిత్ర లక్షణము వేఱు. దీని లక్షణము వేఱు. ఈ గ్రంథములో కొంత మెత్తదన మెక్కువ. వసుచరిత్రలోని శృంగారరసము మిక్కిలిగా కవి సమయములమీద పోవును. ఇందులోని శృంగారరసము లోకమునందలి మాటలు, పలుకులు, ఊహలు—మొదలైన వానిమీద నెక్కువ నడచును.

ఎవరో కవి చేమకూర మంచి పాకమునపడ్డది అన్నాఁడట.

సామాన్యముగా నే కవి వ్రాసినగ్రంథము తీసినను భారత భాగవత రామాయణములందువలె వర్ణనలు కథాప్రాధాన్యమును బలపరచునవిగా నుండవు. ఈ కావ్యములలో వర్ణనములనే కథ బలపరచవలయును. అనేకములైన శృంగారవర్ణనలు — ఆ కథలోననేకాదు ఏ కథలోనైనను చేయవచ్చునన్నటులుండును. ఈ వర్ణనా బాహుళ్యమువలన కొన్ని కావ్యములలో ప్రధానకథ యేమి ? ఎక్కడనున్నది ? అన్నవిషయము వెదకికొనవలసి వచ్చును. ఆ ప్రధానకథను పట్టుకొన్నగాని కవిచేసిన కల్పనయొక్క పరమోత్కృష్టత తెలియదు.

కథ యెప్పుడును పైభాగముననుండును. వర్ణనలు క్రిందిభాగమునం దుండును. చాలమంది కవుల రచనలలో వర్ణనలు పైభాగమునకువచ్చి కథ అట్టడుగున పడిపోవును.

మొదట చెప్పబడినదికదా ! కావ్యములు వర్ణనా ప్రధానములైనవి. భారత భాగవత రామాయణములను చూచినట్లీ కావ్యములను జూడరాదు. వానిని వీనితో పోల్చరాదు. నేడు చేయబడుచున్న యన్యాయమిదియే !

ఈ కవులందఱు నొకానొక ఘట్టమును చిత్రచిత్రములుగా వర్ణింతురు.

ఈ చేమకూర వేంకటకవి ప్రతి పద్యమునందు తానేదో విశేషము పెట్టకుండ వ్రాయడు. ఇతని శక్తి యెక్కువ శ్లేషలమీదను. యమకముల మీదను నడచును. ఇచ్చటనొక భాగముతీసి – కథకెక్కువ ప్రాధాన్యముగల భాగమును తీసి చూపించుచున్నాను.

అర్జునుఁడు యతివేషమున ద్వారకానగరము వెళ్ళెను. కృష్ణుఁడు సుభద్ర నాయన పరిచర్యకొఱకుంచెను. ఇద్దఱు నొకరినొకరు పూర్వము చూచినవారుకారుగాని, మేనత్త మేనమామ బిడ్డలగుటవలన నితని పరాక్రమమువిని యామెయు, ఆమె సౌందర్యమును విని యితఁడును పరస్పరము ప్రేమించుకొన్నవారే! చిన్నప్పుడెప్పుడైన నొకరినొకరు చూచుకొనిరేమో తెలియదు. ఇప్పుడర్జునునకు గడ్డములు, మీసములు, కావిగుడ్డలు.

ఒకనాఁడు సుభద్ర పరిచర్యచేయుటకు వచ్చెను. ఇతఁడు యోగిగనుక కొంత జ్యోతిషము చెప్పెను

"చెలువ! నినురాజకీరంబు చెట్టవట్టెఁ
గలికి! నినురాజ హంసంబు కాలుద్రొక్కె;
మంచిశకునంబు లివిగో! నామాటఁజూడు
కన్నె, యీలోనఁ బెండ్లి గాఁగలదు నీకు."

ఇవి శకునములని. నీ వెంటనే చిలుకవచ్చినది. హంసము నిన్ననుసరించినది. ఆమె బుజముమీద చిలుక వ్రాలినది, పెంపుడుచిలుక. ఇది సహజమే. రాజహంసము కాలు త్రొక్కినది. నీవు రాజహంసమువలె నడతువు అని యర్థము. నీ నడక హంసగమనముతో సరిపోవును.

లోకములో 'నక్కనుఁద్రొక్కి వచ్చినాఁడు' అందురు. అనఁగా వాని ప్రయాణములో వానికి నక్క దారిలో కనిపించెనని యర్థము. ఈ త్రొక్కు ధాతువునకు తెలుగులో నా యర్థమున్నది. ఇది శకునము గనుక కాలు త్రొక్కెనన్నమాట యందము, రాజకీరము, రాజహంసము – ఉత్తమజాతి చిలుక, ఉత్తమజాతి హంస – లేదా ఇవి రెండును శ్రేష్ఠవాచకములై గొప్ప రాజుఅని యర్థము వచ్చును. లేదా ఉపమానోత్తర పదకర్మ ధార

యములై చిలుకవంటిరాజు. హంసవంటి రాజు ననగామంచి వాజ్ఞ్మిపుణుఁడు గొప్ప వంశమునందు పుట్టినవాఁడు – అని యర్థములుకూడ వచ్చును.

హంస శబ్దమునకు జీవుఁడని యర్థము. ఉత్తమ జీవుఁడు. అర్జునుఁడు పూర్వము నరుఁడన్న మహర్షి కదా! ఆ స్ఫూర్తి యున్నదన్నను నున్నదన వచ్చును. మంచి శకునమ్ములివి. భవిష్యదాగామి శుభలక్షణములని యర్థము. శకునమనగా ఒకటి పక్షి – రెండు – శుభసూచియైన విషయము.

ఆ యర్థముకూడ పక్షిమీదనుండియే వచ్చినది. ఇవిగో! మంచి శకునములు. ప్రక్కనున్న రాజహంసమును రాజ కీరమును జూపించుచు నన్న మాటలు. అవి మంచి పక్షులు. కాదనుటయెట్లు? అనఁగా నేను జోస్యము చెప్పుటలేదు. నేను యతినిగాను. అని వెనుకనున్న యర్థము.

"ఈ లోనఁ బెండ్లికాగలఁదు నీకు" – ఈ కొద్ది లో నీకు పెండ్లి యగును.

అనవుడు లజ్జావనతా
నన తామరసయయి, 'వీరు నాఁగ మహాత్ముల్;
తనచేసిన సేవకుఁగా
మనమలరి వచించి' రనుచు మదినుత్సుకయై.

అనఁగానామె సిగ్గుచే తలవంచి వీరు నాఁగ మహాత్ములు. వీరనగా మహానుభావులు. నేనతనికి సేవచేసితిని. అతని మనస్సు సంతోషించెను. ఇట్లు చెప్పిరి. అని మనస్సునందు కోరిక కలదై.

ఈ పద్యములో శ్లేషమేమియులేదు. వట్టి పద్యము. ఇట్టి పద్యములు విజయ విలాసములో సామాన్యముగా నుండవు.

అట్లే మరియు నొక పద్యము.

అవుఁగా మీరిట మున్నుగన్గొనిన చాయల్లేవుగా నాఁటనుం
డి విశేషంబులు గొన్ని మిమ్మునడుగన్ వేడ్కయ్యెడున్నాకు, నె
య్యవిఁగన్గొంటిరి పుణ్యభూము? లట రాజ్యంబుల్ మనోజ్ఞంబు లె
య్యవి? యేయేపురముల్ గనంబడియె మీకందంద మార్గంబునన్.

వసు చరిత్రకారుఁడిట్టి పద్యములలోఁగూడ శ్లేషలు పెట్టును. ఈ యిద్దఱికి కల కొంచెము భేదమిది.

మీరింద్ర ప్రస్థము గని
నారా ? పాండవులఁజూచినారా ? సుఖులై
వారందఱు నొకచో ను
న్నారా ? వీరాగ్రగణ్యు నరునెఱుఁగుదురా ?"

ఈ పద్యములో కనినారా, చూచినారా, ఉన్నారా, ఈ మాటలచేత పద్యమునందొక సన్నని యందము పుట్టినది. ఎఱుఁగుదురా దానిలో విఱిగిపోయినది. వట్టి "రా"యే మిగిలినది.

తరువాత నొక సీసపద్యమున్నది.

"ఎగుబుజమ్ములవాఁడు మృగరాజ మధ్యమ్ము
పుడికి పుచ్చుకొను నెన్నడుము వాఁడు."

ఇట్టి పద్యములు తెలుఁగు కావ్యములలో శ్రీ కృష్ణునిఁగూర్చి చెప్పఁబడివున్నవి. ఈ పద్యములోఁగూడ శ్లేషాదులులేవు.

తరువాతి పద్యము.

తడవాయె భూప్రదక్షిణ
మడరింపఁగ బోయి యామహామహుఁడు, పదం
పడి పుణ్యస్థలముల నె
న్నఁడు మీరందందు నరుగ నరుఁగానరుగా ?

చివరి చరణములోనున్న "నరుగ నరుగానరుగా" అన్న యమకమే యీ పద్యమునకు శోభ - శోభ యనఁగా చేమకూరకవి కూర్చఁగలిగినశోభ. ఆయన పద్యమునకు తెచ్చెడి యందములిట్టివానిమీదనే యెక్కువగా నాధారపడియుండుచు.

ఈ వరుసలో అతఁడు యతి వేషముతోనుండుట — దానిని చాటుచేసికొని చెప్పుట. తన్ను వెల్లడించుకొనుట. ఆమె సిగ్గుపడుట - మొదలైన

రచన యున్నది. ఈ వరుస పద్యములలో వరుసగానొక పది పద్యములు శ్లేషలు యమకములు మొదలైనవి లేకుండ వట్టి కథగా నడచి.

కాని కొందఱు కొందఱు కవులు కొన్ని కొన్ని మాటలు తమ పద్యములకు సౌందర్య సంపాదనార్థము ప్రయోగింతురు. అవి వారివారి వైలక్షణ్యములు.

ఈ కవి కొన్ని సంధులు ఖాహాటముగా నితర కవులు ప్రయోగించినవి ప్రయోగించును.

'వేడ్కయ్యెడున్ నాకు' ఇచ్చట విసంధి చేయుట మంచిది.

వేమాఱు గ్రుచ్చి గ్రుచ్చి నీవేమడిగెదవు. గ్రుచ్చి + ఇపుడు - గ్రుచ్చి యిపుడు అనవలె. ఇది క్త్వార్థక ఇకారము. దీనికి సంధిలేదు. ఈ కవి ఈ క్త్వార్థక ఇకార సంధులు మరి నాలుగైదుచోట్ల చేసినాఁడు.

''నన్ను గాంధర్వంబునను బెండ్లియాడవే
సిగ్గేలపడియెదే చిగురుఁబోఁడి.''

ఈయన తంజావూరువాఁడు. అప్పుడు యక్షగానముల యొత్తిడి కలదు. ఎంత కాదన్నను వాని వాసనపోదుకదా! మద్దెలయు శ్రుతియు తాళమును కలిపి యక్షగానములలో నిటువంటి వాక్యములుండును. దాని వాసన దీనియందున్నట్లున్నది. అనఁగా రచనయందు బిగువు తక్కువ. సాహిత్యముద్ర తక్కువ. మహానుభావులైన ప్రబంధ కవుల పలుకుఁబడిలోని గడుసుఁదనము తక్కువయని యర్థము.

ఇట్టి రచనయందు మనము రమించమని లేదు. మనము రమింతుము. యక్షగానములుచూచిసంతోషించమా? భావములయందెప్పుడునుదాత్తతయు, ననుదాత్తతయు కలవు. భావములందే కాదు చెప్పుటయందుఁగూడ నుండును. ఇది క్లిష్టమైన వ్యవహారము. పాఠకుఁడు తనబుద్ధిని మహావిషయములచేత పరిష్కృతము చేసికొని యుదాత్తముగా దీర్చి దిద్దికొననిచో మహాకవులకు, కొన్ని కళలు తక్కువ కవులకు భేదము నేర్పరించికొనలేదు.